ఫిబ్రవరి 2016 పుష్యము - మాఘము | శాలివాహన శకం 1937 ₹ 5



# ఆంధ్రప్రదేశ్




## అవకాశాల గని ఆంధ్రప్రదేశ్

కొత్త ఏడాదిలో రాష్ట్రానికి సరికొత్త తలుపులు తెరుచుకున్నాయి. విశాఖ భాగస్వామ్య సదస్సు, దావోస్ ప్రపంచ ఆర్థిక వేదిక నవ్యాంధ్రప్రదేశ్ శక్తియుక్తులను ప్రపంచానికి చాటాయి. సమర్థ నాయకత్వంతో సాధించలేనిదంటూ ఏమీ లేదని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు మరోసారి చాటారు.

CII PARTNERSHIP SUMMIT 2016
Partnership for A Shared and Sustainable World Economy

WORLD ECONOMIC FORUM



# బెజవాడలో ఎగిరిన మువ్వన్నెల జెండా

విజయవాడ మున్సిపల్ స్టేడియంలో జరిగిన 67వ భారత గణతంత్ర దినోత్సవాల్లో గవర్నర్ ఈఎస్ఎల్ నరసింహన్, ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, మంత్రులు, ఉన్నతాధికారులు పాల్గొన్నారు. గవర్నర్ జాతీయపతావిష్కరణ చేయగా, ప్రభుత్వ కార్యక్రమాల ప్రగతిని తెలుపుతూ జరిగిన వివిధ శకటాల ప్రదర్శన సందర్శకులను ఆకట్టుకుంది.

# ఈ సంచికలో...

ఆంధ్రప్రదేశ్

తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రచురితం

సంపుటి 59 సంచిక 8
శాలివాహన శకం 1937 పుష్యము–మాఘము

**పబ్లిషర్ కమిషనర్**
డా. పి కృష్ణమోహన్

**ప్రధాన సంపాదకుడు**
కందుల రమేష్

**సంపాదకుడు**
నున్నా నరేష్

**సహ సంపాదకులు**
నీరుకొండ ప్రసాద్
జాస్తి గోపాల ప్రసాద్
డబ్బీరు రామకృష్ణ పట్నాయక్

ముఖచిత్రం
దావోస్‌లో ముఖ్యమంత్రి

రెండవ కవర్
గణతంత్ర ఉత్సవాల్లో గవర్నర్

మూడవ కవర్
ముఖ్యమంత్రి కార్యక్రమాల చిత్రమాలిక

నాల్గవ కవర్
పేదరికంపై గెలుపు ప్రకటన

**ప్రచురణ**
సమాచార, పౌరసంబంధాల శాఖ
సమాచార భవన్, ఎ.సి.గార్డ్స్
హైదరాబాద్ – 500 028
ఫోన్: 040 – 23300258

రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవి కానక్కరలేదు.

**రూపకల్పన**
కార్తీక్ బీసు

**ముద్రణ**
కాక్స్‌టన్ ఆఫ్‌సెట్ ప్రైవేట్ లిమిటెడ్
హైదరాబాద్

www.andhrapradeshmagazine.org
Email: apchiefeditor@gmail.com
www.ipr.ap.nic.in

సంపాదకీయం

# విశాఖ ఓ ముందడుగు!

విశాఖలో జరిగిన భాగస్వామ్య సదస్సు నవ్యాంధ్రప్రదేశ్ బంగారు భవితవ్యానికి బాటలు వేసింది. ఈ సదస్సు ఇంత పెద్ద ఎత్తున విజయవంతం కావడం అందరిని అశ్చర్యచకితులను చేసింది. ఇందుకు కారణం లేకపోలేదు. కొత్తగా ఏర్పడిన అవశేష ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పెట్టుబడులను ఆకర్షించడానికి జరిగిన తొట్టతొలి సదస్సుకు పారిశ్రామికరంగం నుంచి ఇంత పెద్దఎత్తున స్పందన వస్తుందని ఎవరూ ఊహించలేకపోవడం.

కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన సంస్థలతో కలిపితే, మొత్తం దాదాపు 6 లక్షల కోట్ల పెట్టుబడులు ఈ ఒక్క సదస్సు ద్వారా తరలివచ్చాయి. ఇందుకు కారణం వ్యాపారవేత్తలు అంధ్రప్రదేశ్‌ని అవకాశాల గనిగా చూడటం మాత్రమే కాదు. సమర్ధత, పట్టుదల కలిగిన నాయకత్వం ఈ రాష్ట్రానికి ఉందని పారిశ్రామిక వర్గాలు విశ్వసించడం కూడా.

ఈ పెట్టుబడులన్నీ పరిశ్రమలుగా, రాష్ట్ర యువతకు ఉపాధిగా కార్యరూపం దాల్చడానికి కొంత సమయం పడుతుంది. ఇరవై ఏళ్ల క్రితం హైదరాబాదును ఐటి కార్యకలాపాలకు కేంద్రంగా అభివృద్ధి చేయాలని ఇదే ముఖ్యమంత్రి తలపెట్టిన రోజులను ఇప్పుడు మనం గుర్తు చేసుకోవాలి. హైదరాబాదులో సాఫ్ట్‌వేర్ రంగం వేళ్లూనుకోవడం అంత తేలికైన పనికాదని కొట్టివేసిన వారున్నారు. బెంగుళూరు వంటి నగరాలకు పోటీగా ఎదగడం హైదరాబాదుకు సాధ్యమయ్యే పని కాదని పెదవి విరిచిన విమర్శకులకూ కొదవ లేదు. పదేళ్లు గడిచాక పరిస్థితులు మారాయి. ఇవాళ సాఫ్ట్‌వేర్ ఎగుమతుల్లో హైదరాబాదు దేశంలోనే రెండవ స్థానంలో ఉందంటే, అది చంద్రబాబు నాయుడి సంకల్పబలమే.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ఇదే చరిత్ర పునరావృతం కాబోతోంది. వివిధ రంగాల్లో భారీ పరిశ్రమలకు నెలవుగా మారడానికి, పారిశ్రామికంగా, సాంకేతికంగా అత్యున్నత స్థాయిని అందుకోవడానికి, రాష్ట్ర ప్రజల జీవన ప్రమాణాలు పెద్ద ఎత్తున పెరగడానికి ఇప్పటి ఈ ప్రయత్నాలు రానున్న కొద్దికాలంలో ఫలప్రదం అవుతాయి. దీనికి తోడు, దావోస్ ప్రపంచ ఆర్థిక సదస్సులో పాల్గొన్న ఏకైక ముఖ్యమంత్రిగా చంద్రబాబు మన రాష్ట్రానికి ప్రపంచ ఆర్థికపటంలో ఒక ప్రత్యేక గుర్తింపు తీసుకొచ్చారు.

ఆంధ్రప్రదేశ్ ఒక కొత్త బంగారు లోకంగా వెలుగొందడానికి రానున్న ఈ పెట్టుబడుల వరద ఒక పెద్ద ముందడుగు.

కందుల రమేష్

**కందుల రమేష్**
చీఫ్ ఎడిటర్

Printed and Published by **DR P KRISHNA MOHAN** on behalf of Commissioner, Information and Public Relations Dept., (on behalf of Govt. of AP); Published at Samachar Bhavan, AC Guards, Hyderabad - 500028 Ph: 040-23300258 Printed at **M/s Caxton Offset Pvt. Ltd.**, 11.5.416/3, Red Hills, Hyderabad - 500 004 Chief Editor: Ramesh Kandula




## 'రాయలసీమ'అభివృద్ధి భేష్

జనవరి నెలలో వెలువడిన 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికలో ప్రచురించిన అంశాలు చాలా బాగున్నాయి. ప్రధానంగా రాయలసీమ సమగ్రాభివృద్ధికోసం రాష్ట్ర ప్రభుత్వం చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాల గురించి 'సీమకి మహోదయం' అనే శీర్షికతో ప్రచురించిన కథనం ఆకట్టుకున్నది. ఈ కథనంలో రాయలసీమ ప్రాంతానికి ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు ప్రత్యేకశ్రద్ధతో ప్రతిష్ఠాత్మకంగా అమలు చేస్తున్న కార్యక్రమాల వివరాలు నన్నెంతగానో చైతన్యపరిచాయి. ఇంతవరకు రాయలసీమను నిర్లక్ష్యం చేస్తున్నట్లు వస్తున్న ఆరోపణలన్నీ అసత్యాలని మీ కథనంతో తేలిపోయింది.

– ఎస్. కోటిలింగేశ్వరరావు, రాజమండ్రి

## 'వీరమాచనేని' ప్రతిభను చక్కగా ఆవిష్కరించారు

ప్రముఖ సినీ దర్శకులు వీరమాచనేని మధుసూదనరావు గారి వైవిధ్యమైన జనాకర్షక దర్శకత్వంపై రచయిత రావి కొండలరావు తన 'దర్శకరత్నాలు' శీర్షికతో రాసిన కథనం చాలా బాగుంది. సినీ దర్శకత్వంలో మధుసూదనరావు కనబరిచిన ప్రతిభను కళ్లకు కట్టినట్టుగా అభివర్ణించడం అభినందనీయం.

– శిడగం దొరయ్య, ఏలేశ్వరం

## 'దారిద్ర్య భావం వీడండి' శీర్షిక అదిరింది

జనవరిలో వెలువడిన 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికలో 'దారిద్ర్యభావం వీడండి' అనే శీర్షికతో రచయిత సి. నరసింహారావు రాసిన కథనం అదిరింది. నిరుపేదలు పదిమంది పరస్పరం కలుసుకున్నప్పుడు వారి మధ్య జరిగిన చర్చల సారాంశం ఆధారంగా వారి సగటు జీవన మనుగడ కోసం పడుతున్న ఆరాటం, అనుభవాలతోపాటు జీవితంలో డబ్బే ప్రధాన ఇంధనమైన ఈ రోజుల్లో తమ ఉన్నత జీవితాశయం కోసం పరితపించి, లక్ష్యాలను అధిగమించిన కొందరు మహనీయుల జీవిత విజయగాథలు సమాజానికి ఆదర్శంగా నిలుస్తాయని నా భావన.

– డి.చాంద్ బాషా, కర్నూలు

## ముఖచిత్రం సంప్రదాయబద్ధంగా ఉంది

జనవరి నెల ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక ముఖచిత్రం సంప్రదాయబద్ధంగా, అందర్నీ ఆకట్టుకునేలా ఉంది. మన సంస్కృతికి అద్దం పడింది. మీకు అభినందనలు. అలాగే 'కాకరలేని భోజనం అసంపూర్ణం' చాలా బాగుంది, మధుమేహగ్రస్థులకు ఎంతో ఉపశమనం కలిగిస్తుంది. 'మనకు తెలియని మన తెలుగు' శీర్షికలో అచ్చతెలుగుపదాలను అందించి అమ్మమాటకు పెద్దపీట వేయడం ఆనందం కలిగించింది

– వాండ్రంగి కొండలరావు, ఫ్రీలాన్స్ జర్నలిస్ట్, పొందూరు, శ్రీకాకుళంజిల్లా.

## 'ఆంధ్రప్రదేశ్' పత్రికకు చందా ఇలా కట్టాలి

'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికకు చందాదారులుగా చేరాలనుకుంటున్న వారు వార్షిక చందా నిమిత్తం 50 రూపాయల మనియార్డరును 'అకౌంట్స్ ఆఫీసర్, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్' పేరిట పంపాలి. (మీరు డిమాండ్ డ్రాఫ్ట్ (డిడి) తీసుకునేట్లయితే, బ్యాంకు నిబంధనల ప్రకారం రూ. 60 కి డిడి పంపాలి.) తమ పూర్తి చిరునామాను, తాము 'ఆంధ్రప్రదేశ్ ' పత్రికను ఏ భాషలో కోరుకుంటున్నారో కూడా ఆ మనియార్డరులో రాయాలి. ఆ మనియార్డర్‌ను ఈ క్రింది చిరునామాకు పంపాలి.

అకౌంట్స్ ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌర సంబంధాల శాఖ, సమాచార భవన్, ఏ.సి.గార్డ్స్, మాసాబ్ ట్యాంక్, హైదరాబాద్ – 500 028.

చందాదారులు తమ చిరునామా మార్పు, కాపీలు అందకపోవడం గురించి ఈ ఫోన్ నెంబరుకు కాల్ చేసి వివరాలు కనుక్కోవచ్చు: +91-9989662462.

## రచయితలకు గమనిక

'ఆంధ్రప్రదేశ్' పత్రికపై అభిమానంతో రచనలను పంపుతున్న రచయితలు రచనతోపాటు తమ బ్యాంకు అకౌంట్ పాస్ బుక్ మొదటి పేజీ ఫోటో కాపీ గానీ, బ్లాంక్ చెక్కు కొట్టేసి పంపితేనే, ప్రచురితమైన రచనలు పారితోషికం ఆయా అకౌంట్‌లో జమ చేయడం జరుగుతుందని అకౌంట్స్ అధికారి తెలియజేస్తున్నారు. రచయితలూ, రచయిత్రులు దీని ప్రాధాన్యత గ్రహించి, మాతో సహకరించవలసిందిగా కోరుకుంటున్నాం.

– సంపాదకులు

## 'యనమల' ఇంటర్వ్యూ బాగుంది

జనవరి నెల 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికలో 'కేంద్రం సహకారంతో ఆర్థిక ఇబ్బందులన్నీ అధిగమిస్తాం' అనే శీర్షికతో ఇచ్చి ప్రత్యేక ఇంటర్వ్యూ చాలా బాగుంది. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి, కేంద్రం సహకారం ఆర్థిక భవిష్యత్‌పై ఇచ్చిన వివరాలు బాగున్నాయి.

– డాక్టర్ శివభూషణం, కర్నూలు

## 'తితిది' దేవస్థానం కథనం నచ్చింది

జనవరి 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికలో 'భక్తుల సౌకర్యాలకు తితిదే పెద్దపీట' అనే అంశంతో ఇచ్చిన వార్తా కథనం బాగుంది. మీరిచ్చిన సమాచారం వివరాలు యాత్రీకులకు బహుళ ప్రయోజనాలు కలిగేలా ఉన్నాయి. అభినందనలు

– వాస్తు రామచంద్ర, నెల్లూరు

## కాకరలేని భోజనం నచ్చింది

జనవరిలో వెలువడిన 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికలో ఇచ్చిన అంశాలన్నీ నచ్చాయి. 'కాకరలేని భోజనం అసంపూర్ణం' అనే శీర్షికతో ఇచ్చిన కథనం నచ్చింది. ఆరోగ్యానికి ఔషధంలా పనిచేసే కాకరకాయ ఉత్తమమైంది. చేదుగా ఉంటుందని తినటం మానేయకూడదు. మన తెలుగుపదాల గురించి, దర్శకులు విక్టరీ మధుసూదనరావు పరిచయ విశేషాలు ఆకట్టుకున్నాయి

– చోడవరపు నాగేశ్వరరావు, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్

ఆంధ్రప్రదేశ్ (తెలుగు, ఇంగ్లిష్) పత్రికను పాఠకులు ఇంటర్నెట్‌లో www.andhrapradeshmagazine.org లో కూడా చదువుకోవచ్చు.



CII
PARTNERSHIP SUMMIT 2016
Partnership for A Shared and Sustainable World Economy

ఆంధ్రప్రదేశ్‌కు ప్రేరణ సూత్రం
అతిథులకు ఆకర్షణ మంత్రం

# బ్రాండ్ చంద్రబాబు నేతృత్వంలో భాగస్వామ్య సదస్సు బ్రహ్మాండం!




వి శాఖపట్నంలో జనవరి 10 నుంచి 12 వరకు మూడు రోజుల పాటు జరిగిన భారత పరిశ్రమల సమాఖ్య (సీఐఐ) భాగస్వామ్య సదస్సు మొత్తాన్నీ ఒకటి...రెండు పదాల్లోకి కుదించుకొని చెప్పుకుంటే–

అద్భుతం... అపూర్వం!

అంచనాలకు మించి మూడువందలు దాటిపోయిన అవగాహన పత్రాలు (ఎంఓయూలు), 6 లక్షల కోట్ల రూపాయల విలువైన ఒప్పందాలు, కలగనున్న కొత్త ఉపాధి అవకాశాలతో 10 లక్షలకి పైగా వెలగనున్న జీవితాలూ, 41 దేశాల ప్రతినిధులు, వ్యాపార దిగ్గజాలు, రాజకీయ దురంధరులు, చర్చోపచర్చలు, సాంస్కృతిక ప్రదర్శనలు, అరమరికలు లేని ఆహ్వానాలు.... ఆత్మీయ ఆతిథ్యాలు... వీటన్నింటి వల్ల మాత్రమే సదస్సు అద్భుతం కాదు.

విభజన సంక్షోభం నుంచి ఇప్పుడిప్పుడే తేరుకుంటున్న రాష్ట్రం. సీఐఐ– భాగస్వామ్య సదస్సు వంటి ప్రతిష్ఠాత్మక, అంతర్జాతీయ సదస్సు ఏర్పాటు చెయ్యాలంటే ఆ స్థాయిని అందుకునే సౌకర్యాలు అమరాలి. అటువంటి సౌకర్యాలతో పాటు, రవాణా, వసతి వంటి మౌలిక సదుపాయాల నగరం కావాలి, జాతీయ పటంలో ఆ నగరానికి ప్రత్యేకమైన ఉనికి ఉండాలి. అవేమీ లేకపోయినా సదస్సు నిర్వహణకి సై అనడం అద్భుతం! అతి తక్కువ వ్యవధిలో విశాఖపట్టణాన్ని, విశాఖలోని ఏపీఐఐసి వేదికని అంతర్జాతీయ స్థాయిలో తీర్చిదిద్దడం అద్భుతం! అయినవాళ్లకు ప్రేరణగా.. అతిథేయులకి ప్రధాన ఆకర్షణగా తానే నిలువెత్తు బ్రాండ్‌గా నిలిచిన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు రాష్ట్రంలో మరో పారిశ్రామిక నవశకానికి చేసిన అంకురార్పణ– అద్భుతం... కచ్చితంగా అపూర్వం.

కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ మాటల్లో చెప్పుకోవాలంటే– తాయిలాలో... వాయినాలో ఇస్తామని ఆశపెడితే పేరంటాలకి ఎవ్వరైనా పరుగెత్తుకొస్తారేమో గానీ, పారిశ్రామికవేత్తలు మాత్రం రానేరారు. ప్రలోభాలతోనో, ప్రామిస్‌లతోనో వ్యాపారదిగ్గజాల్ని రప్పించలేమని సదస్సులో ప్రారంభోత్సవ ఉపన్యాసం చేసిన జైట్లీ అన్న మాటలు అక్షరసత్యాలు. సాధారణంగా ఇటువంటి సదస్సుల్లో చివరి రోజుకు వచ్చే సరికి సమావేశ మందిరాల్లో హాజరు పలచబడటం, ప్రముఖులు వెళ్లిపోవటం, మొక్కుబడిగా ముగింపు సమావేశం జరగడం సర్వసాధారణం. కానీ మూడో రోజున ముగింపు సమావేశమూ మొదటి రోజు ప్రారంభ సమావేశం జరిగినంత ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా 40 వరకు ద్వైపాక్షిక వ్యాపార సమావేశాలు జరిగాయి. మొదటి రోజు నుంచి చివరి రోజు వరకూ అదే ఉత్సాహం, అంతే సందడి. ఎక్కడైనా ఒక పారిశ్రామికవేత్త పెట్టుబడులు పెట్టాలంటే ప్రధానంగా చూసే అయిదు అంశాలు ఇవి: తగినంతగా వనరులు, నైపుణ్యం కలిగిన మానవ వనరుల లభ్యత, సుపరిపాలన, పెట్టుబడులకు రక్షణ, ఇంకా బలమైన నాయకత్వం. ఈ ఐదు అంశాలూ ఉన్నాయా? లేదా? అన్నదే పారిశ్రామికవేత్తలకి ముఖ్యం.

తమందరికీ ఎనలేని విశ్వాసాన్నీ, కొండంత భరోసాని ఇచ్చిన అధినాయకుడు చంద్రబాబులోనే ఆ ఐదు అంశాల్నీ వ్యాపారవేత్తలు చూడటం నిజమైన అద్భుతం.

వీటన్నింటినీ మించి, మరో వైపు ఈ సదస్సు నిర్వహణపై సందేహాలు పటాపంచలు చేసి, కార్యక్రమాన్ని నభూతో.... అన్న రీతిగా జరిపించి, వచ్చే ఏడాది కూడా ఇదే వేదిక మీదకు వచ్చేలా పారిశ్రామిక దిగ్గజాలను ఒప్పించిన కార్యదక్షుడు చంద్రబాబు– ఐదుకోట్ల ఆంధ్రుల గుండెల్లో గొప్ప ధీమాని నింపడం– మహాద్భుతం.

నవ్యాంధ్ర సారథి నేతృత్వంలో ఏడాదిన్నర కాలంలో ప్రగతిపథంలో పయనిస్తున్న రాష్ట్రాన్ని జయప్రదమైన సదస్సుతో నవశకాలవైపు పరుగులు పెట్టించడం అద్భుతాలన్నింటిలో పరమాద్భుతం!

## విశ్వవ్యాప్తమైన విశాఖ కీర్తి

సన్‌రైజ్ ఆంధ్రప్రదేశ్ పేరిట రాష్ట్ర ప్రభుత్వం, కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ (సీఐఐ), భారత ప్రభుత్వం ఆధ్వర్యంలోని పారిశ్రామిక విధానం, ప్రోత్సాహక శాఖ (డిఐపిపి) లతో కలిసి నిర్వహించిన అంతర్జాతీయ భాగస్వామ్య సదస్సుతో విశాఖపట్నం కీర్తి విశ్వవ్యాపిత మయింది. పట్టుదల, లక్ష్యం, సమర్థత ఉండాలే కాని రాష్ట్రానికి పెట్టుబడులు, పరిశ్రమలు బారులు తీరటం అసాధ్యమేమి కాదని నిరూపించారు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు. భాగస్వామ్య సదస్సులో వెల్లువెత్తిన పెట్టుబడుల ప్రాథమిక ఒప్పందాలు యథాతథంగా పట్టాలెక్కితే ఆంధ్రప్రదేశ్ ప్రస్థానం మరో మలుపు తిరుగుతుంది. విశాఖ భాగస్వామ్య సదస్సుకు 41 దేశాలనుంచి 350 మంది హాజరయ్యారు. అంతే కాకుండా దేశ నలుమూలల నుండి కూడా మొత్తం 1600 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అగ్ర దేశాలైన అమెరికా, చైనా నుంచి కూడా 40 మందికి పైగా ప్రతినిధులు వచ్చారు. 21 మంది మంత్రులు, రాయబారులు, కాన్సులేట్ జనరళ్లతో పాటు పారిశ్రామిక దిగ్గజాలు విశాఖకు తరలి వచ్చారు. సదస్సు తొలి రోజే రాష్ట్రానికి పెట్టుబడుల వరద పారింది. భాగస్వామ్య సదస్సు లక్ష్యం నెరవేరింది. 324 ఒప్పందాలు కుదిరి నవ్యాంధ్రకు లక్షల కోట్ల పెట్టుబడులు రాబోతున్నాయి. లక్షలాది ఉద్యోగాలకు బాటలు పడుతున్నాయి. కేవలం పరిశ్రమల స్థాపనేకాకుండా రాజధాని అమరావతి నిర్మాణంలో పాలు పంచుకోనేందుకు, పలు సంస్థలు ఆసక్తి చూపడం గమనార్హం.

ఇంత పెద్ద సదస్సు నిర్వహించేందుకు విశాఖపట్నంలో తగిన సదుపాయాలు లేనప్పటికీ రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా తీసుకొని ఏర్పాట్లు చేసింది. విశాఖ హార్బర్ పార్క్ ఏరియా లోని ఏపీఐఐసీ మైదానంలో అత్యంత సౌకర్యవంతగా సమావేశ ప్రాంగణం ఏర్పాటుచేశారు. తొలిరోజు సదస్సుకు దేశ విదేశాల నుంచి పెద్ద సంఖ్యలో హాజరైన పారిశ్రామిక ప్రతినిధులతో సమావేశ ప్రాంగణం కిటకిటలాడింది. పారిశ్రామిక దిగ్గజాలు,రాజకీయ ప్రముఖుల రాకతో విశాఖ నగరం కొత్త శోభను సంతరించుకుంది. దేశీయ పారిశ్రామిక దిగ్గజాలు అనిల్ అంబానీ, ఆది గోద్రెజ్, గ్రంథి మల్లికార్జునరావులు ప్రత్యేక విమానంలో వచ్చారు. రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, కేంద్ర మంత్రులు అరుణ్ జైట్లీ, నిర్మలా సీతారామన్, పీయూష్ గోయల్, అశోక్ గజపతిరాజు, సుజనా చౌదరి తొలి రోజు సదస్సులో పాల్గొనగా రెండవరోజు కేంద్ర మంత్రి వెంకయ్య నాయుడు సదస్సుకు హాజరయ్యారు.

సదస్సులో కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఈ–పెవిలియన్ ప్రారంభించి సందర్శించారు. ఇందులో 13 స్టాళ్లలో జిల్లాల వారిగా భౌగోళిక ప్రాధాన్యతలు, పరిశ్రమల ఏర్పాటుకు వున్న అవకాశాలు, వనరుల లబ్ధి తదితర అంశాలను ప్రదర్శించారు. రాష్ట్ర రాజధాని అమరావతిలో వున్న అవకాశాలు, గనులు, పర్యాటకం, గృహాలు, మౌలిక సదుపాయాలు, వ్యవసాయ రంగాల గురించి వివరిస్తూ ఏపీలో పెట్టుబడులు పెట్టడం వలన కలిగే ప్రయోజనాలను వివరించారు.





6 పోర్టులు, 6 విమానాశ్రయాలు, 46 వేల కిలోమీటర్ల రహదారి వ్యవస్థ, 7,040 కిలోమీటర్ల రైల్వే వ్యవస్థ, 850 కిలోమీటర్ల జాతీయ జల రవాణా వ్యవస్థ, నిరంతరాయ విద్యుత్ సరఫరా సదుపాయం, తరుగులేని భూ బ్యాంకు, 99 ఏళ్ల పాటు అందుబాటు ధరలకే భూములు లీజుకు ఇస్తామంటూ ఈ–పెవిలియన్ లో ప్రదర్శనకు వుంచారు. ఆంధ్రప్రదేశ్ భౌగోళిక చిత్ర నమూనా పారిశ్రామిక దిగ్గజాలను విశేషంగా ఆకట్టుకుంది. మేక్ ఆంధ్రప్రదేశ్ యువర్ బిజినెస్ నినాదంతో దీన్ని తయారుచేశారు.

ఈ భాగస్వామ్య సదస్సు ద్వారా రూ.2 లక్షల కోట్లు ఒప్పందాలు కుదరవచ్చని ప్రభుత్వం భావించగా అనూహ్యంగా రూ.4,76,878 కోట్ల పెట్టుబడులు కుదరడంతో ఏపీ ప్రభుత్వంలో ఆనందం వెల్లివిరిసింది. రాష్ట్ర గవర్నర్ ఇ.ఎస్.ఎల్ నరసింహన్, ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, కేంద్ర మంత్రులు అశోక్ గజపతిరాజు, వై.ఎస్ చౌదరి, కొరియాకు చెందిన ఓసీపీ గ్లోబల్ సిఈవో లీ, సిఐఐ జాతీయ అధ్యక్షుడు సుమిత్ మజుందార్ చివరి రోజు సమావేశంలో పాల్గొన్నారు.

ఈ సదస్సు తాము నిర్వహిస్తామంటే అందరూ ఆశ్చర్యపోయారని, మీ రాష్ట్రంలో సౌకర్యాలు ఎక్కడున్నాయన్నట్లుగా చూశారని, కానీ పట్టుదలగా తీసుకొని ఈ సదస్సుకు ఏర్పాట్లు చేశామని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు చెప్పారు. తన అంచనాల కంటే మిన్నగా సదస్సు జరిగిందని, సీఐఐ భాగస్వామ్య సదస్సు వచ్చే ఏడాది కూడా విశాఖపట్నంలోనే జరుగుతుందని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు చెప్పారు. ఊహించిన దానికన్నా స్పందన ఎక్కువగా ఉండటంతో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సదస్సు యావత్తూ ఉత్సాహభరితంగా కనిపించారు.. స్వయంగా అన్ని ఒప్పందాలు తన సమక్షంలోనే పూర్తి చేయించారు. సదస్సుకు విచ్చేసిన ప్రతినిధులంతా ఏపీ భవిష్యత్ పట్ల ఎంతో విశ్వాసం ప్రకటించారని, ప్రపంచ దేశాలన్నీ ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ వైపు చూస్తున్నాయని ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

ఆసియా ఖండంలో అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న మహానగరాల్లో విశాఖ ఒకటి. ఇప్పుడు అంతర్జాతీయ భాగస్వామ్య సదస్సు విశాఖ అభివృద్ధికి మరింత దోహదం చేసే అవకాశాలున్నాయని అధికారులు అంచనా వేస్తున్నారు. దేశ విదేశాల నుంచి సదస్సుకు హాజరైన ప్రతినిధులంతా విశాఖలో అందుబాటులో వున్న సదుపాయాలు, ప్రజల జీవనశైలి, ప్రకృతి సంపదపై ఆసక్తి కనబరిచారు.

సిఐఐ 22వ భాగస్వామ్య సదస్సు విశాఖలో విజయవంతం కావడంతో ఇదే ఉత్సాహంతో 23వ భాగస్వామ్య సదస్సు కూడా విశాఖలోనే జరపాలని చంద్రబాబు నాయుడు నిర్ణయించారు. ఈ సదస్సులో కాగితాల మీద కుదుర్చుకున్న ఒప్పందాలన్నీ కార్యరూపం దాల్చేలా అన్ని ప్రయత్నాలూ చేయాలని ముఖ్యమంత్రి కృతనిశ్చయంతో ఉన్నారు. వచ్చే ఏడాది 23వ భాగస్వామ్య సదస్సు ఇదే విశాఖ వేదిక మీద జరిగేలా చూడటం, పాత ఒప్పందాల స్థితిగతుల్ని ఆ సదస్సులో సమీక్షించుకోవాలని ప్రతిపాదించడం ఆ కృతనిశ్చయంలో భాగాలే.

## వివిధ రంగాల్లో ఒప్పందాలు కుదుర్చుకున్న ముఖ్య కంపెనీలు

**పరిశ్రమలు**
- ఎస్సెల్ గ్రూపు
- రిలయన్స్ అడాగ్
- భారత్ ఫోర్జ్
- అశోక్ లేలాండ్
- అమరరాజా
- రైజింగ్ స్టార్ (ఫాక్స్‌కాన్)
- దివీస్
- అరబిందో ఫార్మా
- ట్రినా సోలార్
- లాంగి సిలికాన్
- ఇండియన్ ఆయిల్
- స్టీల్ ఎక్చేంజి ఆఫ్ ఇండియా

**ఇంధనం**
- సుజ్లాన్ ఎనర్జీ, యాక్సిస్ విండ్ ఎనర్జీ
- సానీ గ్రూపు
- గమేసా విండ్ టర్బైన్స్
- సన్ ఎడిసన్ ఎనర్జీ

**రిటైల్**
- వాల్‌మార్ట్
- ఫ్యూచర్ గ్రూపు
- అరవింద్ బ్రాండ్స్
- స్పెన్సర్ రిటైల్స్

**ఇన్‌ఫ్రా**
- నేషనల్ హైవే ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్
- డ్రెడ్జింగ్ కార్పొరేషన్
- కంటైనర్ కార్పొరేషన్

**మైనింగ్**
- ఎన్ఎస్ఎల్ మైనింగ్ రిసోర్సెస్
- సంఘి సిమెంట్స్
- మైహోం గ్రూపు

**ఆహారశుద్ధి**
- సీఎస్‌బీ ఇన్‌ఫ్రా
- లిండే గ్రూపు
- జైన్ అల్ట్రా మెగా ఫుడ్ పార్కు

**ఐటీ**
- డాలస్ టెక్నాలజీస్
- స్పైస్ మొబైల్స్

**గృహనిర్మాణం**
- కన్సార్టియం ఆఫ్ కన్‌స్ట్రక్షన్ కంపెనీస్ ఆఫ్ చైనా

**పర్యాటకం**
- ఐవరీ శాండ్స్
- ఇంటర్‌గ్లోబ్ హోటల్స్
- స్టార్‌వుడ్

**సీఆర్‌డీఏ**
- హడ్కో
- ఆంధ్రా బ్యాంకు

**పురపాలన**
- ఏస్ అర్బన్ డెవలపర్స్

**నైపుణ్యాభివృద్ధి**
- ఈ–కౌశల్
- టీమ్‌లీజ్ సర్వీసెస్

# నవ్యాంధ్రను తాకిన పెట్టుబడుల సునామీ




విశాఖపట్నం సాగరతీరంలో మూడు రోజుల సీఐఐ భాగస్వామ్య సదస్సులో 'సన్‌రైజ్ ఆంధ్రప్రదేశ్'ను పెట్టుబడుల సునామీ తాకింది. పెట్టుబడుల ప్రవాహాన్ని ఆశిస్తూ నిర్వహించిన తొలి భాగస్వామ్య సదస్సు ఆరంభమే అదిరింది. 'సన్‌రైజ్ ఆంధ్రప్రదేశ్'లో పెట్టుబడులు పెట్టడానికి వస్తున్న పారిశ్రామికవేత్తలకు ఆకాశమే హద్దుగా మారింది. మూడు రోజుల వ్యవధిలోనే ఉత్సాహపూరిత వాతావరణంలో సాగిన భాగస్వామ్య సదస్సులో 328 ఒప్పందాలు, రూ.4,67,577 లక్షల కోట్ల పెట్టుబడులు, 9,58,896 ఉద్యోగాల కల్పనజరగడంతో, అంచనాలు మించాయని ముఖ్యమంత్రితోపాటు ప్రభుత్వ యంత్రాంగంలో సంతృప్తిని వ్యక్తమయింది.

ఏడాదిన్నర కాలంగా ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడి పాలనా సౌరభాలకు ఆకర్షితులవుతూ, ఆయన పాలనా సామర్థ్యాన్ని మెచ్చుకుంటూ కేంద్ర మంత్రులు, 41 దేశాల నుంచి వచ్చిన 1600 మంది మంత్రులు, రాయబారులు, దేశ, విదేశీ బహుళజాతి కంపెనీలు, వాణిజ్య, పారిశ్రామిక అధిపతులు భాగస్వామ్య సదస్సులో ఉత్సాహంగా పాల్గొనడం విశేషం. రాజధాని కాకపోయినా, పేరొందిన గొప్ప నగరం కాకపోయినా, ఏడాది క్రితం హుద్ హుద్ ఉక్కిరిబిక్కిరి చేసినా, పెట్టుబడుల సదస్సులో పాల్గొనేందుకు ఎంతోమంది పారిశ్రామికవేత్తలు విశాఖ రావడం గమనించాల్సిన అంశం. విభజన దరిమిలా హైదరాబాద్‌ను వదులుకుని ముఖ్యమైన ఆదాయ వనరును కోల్పోయినప్పటికీ అతి స్వల్ప కాలంలోనే 11 శాతం పైబడి వృద్ధి రేటును సాధించడంతోనే ఏపీ సత్తా ఏంటో ప్రపంచానికి ఈ సదస్సు చాటిచెప్పింది. తెలుగువారి అనుకూలతల్లో మొదటిది వ్యాపార దక్షత. ఇప్పటికే సమర్ధమైన పెట్టుబడిదారులుగా ప్రపంచవ్యాప్తంగా సత్తా చాటారు. ఇప్పుడు స్థిరమైన ప్రభుత్వం, సమర్ధ నాయకత్వమున్న చంద్రబాబు ప్రభుత్వం స్వదేశీయులనే కాకుండా విదేశీయులను కూడా రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టడానికి ఆహ్వానిస్తోంది. 2016 సదస్సులో కుదిరిన అవగాహనా ఒప్పందాలను 2017 సదస్సులో పున:సమీక్షించనున్నారు. ప్రస్తుతం నెలకొన్న సానుకూల స్థితి ఇలాగే కొనసాగితే 2022 నాటికి దేశంలోని మూడు అగ్రగామి రాష్ట్రాలలో ఒకటిగా ఏపీని నిలుస్తుందనడంలో సందేశం లేదు.

## ఏఏ రంగాలకు ఎన్నెన్ని?

భాగస్వామ్య సదస్సులో ప్రధానంగా పరిశ్రమ రంగంలో 115 అవగాహన ఒప్పందాలు కుదరగా, వీటి విలువ రూ.2,01,277 కోట్లు. వీటిద్వారా 4,30,886 ఉద్యోగాలు రానున్నాయి. ఇంధనరంగంలో 24 అవగాహన ఒప్పందాలు చేసుకున్నారు. వీటి విలువ రూ.1,45,842 కోట్లు. ఇంధన రంగంలో కుదిరిన ఒప్పందాల వల్ల 68,205 ఉద్యోగాలకు అవకాశం ఏర్పడింది. మౌలిక సదుపాయాల కల్పన  రంగంలో 43,900 కోట్ల రూపాయిల విలువైన 8 అవగాహన ఒప్పందాలు కుదిరాయి. వీటి ద్వారా రాష్ట్రంలో 15 వేల ఉద్యోగాలు వస్తాయి.

గృహనిర్మాణ రంగంలో 4 ఎంవోయూలు చేసుకున్నారు. రూ.41,500 కోట్ల పెట్టుబడులు ఈరంగంలో రానున్నాయి. 2,50,000 మంది ఉపాధి పొందనున్నారు. సీఆర్‌డీఏలో 13,300 కోట్ల రూపాయిలతో 4 అవగాహన ఒప్పందాలు కుదిరాయి. గనుల రంగంలో 25 అవగాహన ఒఫ్పందాలు జరిగాయి. వీటి విలువ రూ.6,455 కోట్లు. వీటిద్వారా 10,390 మందికి ఉద్యోగాలు దక్కనున్నాయి. ఫుడ్ ప్రాసెసింగ్ రంగంలో రూ.5,102 కోట్ల విలువ





గల 65 అవగాహన ఒప్పందాలు జరిగాయి. దీనివల్ల 61,900 ఉద్యోగాలు రానున్నాయి. పర్యాటక, ఆతిధ్య రంగంలో కుదిరిన రూ.4,659 కోట్ల విలువైన 26 అవగాహన ఒప్పందాల వలన 15,240 ఉద్యోగాలు రానున్నాయి.

ఐటీ పరిశ్రమలో 64 అవగాహన ఒప్పందాలు జరిగాయి. వీటి విలువ రూ.3,368 కోట్లు. వీటిద్వారా 50 వేల కొత్త ఉద్యోగాలు రానున్నాయి.

చిల్లర వర్తకంలో రూ.1480 కోట్ల విలువైన 4 అవగాహన ఒప్పందాల వల్ల 37,150 ఉద్యోగాల సృష్టి జరగనుంది. పట్టణాభివృద్ధి రంగంలో రూ.500 కోట్ల పెట్టుబడులతో వెయ్యిమందికి ఉపాధి కల్పించే విధంగా ఒక అవగాహన ఒప్పందం జరిగింది.

పశు సంవర్ధక రంగంలో రూ.195 కోట్ల విలువైన 6 అవగాహన ఒప్పందాలు జరగగా, 4,050మందికి ఉద్యోగాలు దక్కనున్నాయి. నైపుణ్యాభివృద్ధి రంగంలో జరిగిన 16 అవగాహన ఒప్పందాల వలన 45,000 మందికి ఉద్యోగాలు వస్తాయి.

### వీసీఐసీకి 840 మిలియన్ డాలర్ల సాయం

'విశాఖ-చెన్నయ్ పారిశ్రామిక క్యారిడార్ (వీసీఐసీ)' ని ఆసియా డెవలప్మెంట్ బ్యాంక్ (ఏడీబీ) అభివృద్ధి చేయనుంది. వీసీఐసీ పరిధిలో విశాఖపట్నం, కాకినాడ, కంకిపాడు-గన్నవరం, ఏర్పేడు-శ్రీకాళహస్తి నోడ్స్ ఏర్పాటవుతాయి. ఇందుకోసం 840 మిలియన్ డాలర్ల ఆర్థిక సహాయాన్ని ఏడిబి అందించనుంది. వీసీఐసీ ఏర్పాటుతో శ్రీకాకుళం నుంచి శ్రీకాళహస్తి వరకు ఆంధ్రప్రదేశ్ ముఖచిత్రం మారిపోనుంది. ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు రూ.73,000 కోట్ల పెట్టుబడిని ఆకర్షించగలిగే స్మార్ట్ ఇండస్ట్రియల్ టౌన్‌షిప్ ప్రాజెక్టు చేపట్టనున్నట్లు ఎస్సెల్ గ్రూపు ప్రకటించింది. దాదాపు 10 వేల ఎకరాల్లో ఈ ప్రాజెక్టును చేపట్టేందుకు రాష్ట్ర ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకున్నట్లు జీ గ్రూపు సంస్థల అధినేత సుభాష్ చంద్ర వెల్లడించారు. ఎస్సెల్ గ్రూపునకు చెందిన కంపెనీలతోపాటు దాదాపు 200 ఇతర సంస్థలకు ఈ ప్రాజెక్టు కేంద్రస్థానం అవుతుంది.

## రంగాల వారీగా ఒప్పందాలు, పెట్టుబడులు

| విభాగం | ఎంవోయూలు | పెట్టుబడులు (రూ.కోట్లలో) | ఉద్యోగ/ఉపాధి |
|---|---|---|---|
| పరిశ్రమలు | 115 | 201277 | 430886 |
| ఇంధనం | 24 | 145842 | 68205 |
| మౌలిక సదుపాయాలు | 8 | 43900 | 15000 |
| గృహనిర్మాణం | 4 | 41500 | 250000 |
| సీ.ఆర్.డీ.ఏ. | 4 | 13000 | ------ |
| మైనింగ్ | 25 | 6455 | 10390 |
| ఆహారశుద్ధి | 65 | 5102 | 61900 |
| పర్యాటకం | 26 | 4659 | 15240 |
| ఐటీ | 64 | 3368 | 50000 |
| రిటైల్ | 4 | 1480 | 37,150 |
| పురపాలన | 1 | 500 | 1000 |
| పశుసంవర్ధక | 6 | 195 | 4,050 |
| నైపుణ్యాభివృద్ధి | 16 | ---- | 45,000 |
| మొత్తం | 328 | 467,577 | 9,58,896 |




# ఎదురీతలో నిలిచి గెలిచిన ఫలితం!

విశాఖ భాగస్వామ్య సదస్సు ఘనవిజయంతో పెట్టుబడులకు గొప్ప అవకాశాల గల రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్‌కి ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు లభించింది. "ఇది నేను ఊహించని స్పందన. ఇంతమంది పారిశ్రామిక ప్రముఖులు మన రాష్ట్రం మీద నమ్మకంతో పెట్టుబడుల కోసం ముందుకు రావడం నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది," అని స్వయంగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడే అన్నారు.

నవ్యాంధ్రకు లక్షల కోట్ల పెట్టుబడులు రావడం అంత సామాన్యంగా జరగలేదు. ఏటికి ఎదురీత వంటి ప్రతికూల పరిస్థితుల్ని ఎదిరించి ధైర్యంగా నిలిచి, ఏడాదిన్నర స్వల్ప వ్యవధిలోనే రాష్ట్రాన్ని ప్రగతి బాటలు పట్టించిన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు యుక్తి, సామర్థ్యాల వల్లే పెట్టుబడులు వెల్లువెత్తాయి. ఏడాదిన్నర కాలాన్ని ఒకసారి అవలోకిస్తే, తరచి చూసుకుంటే ఎన్నో ఆశ్చర్యకర, అద్భుత ఫలితాల సంగమం మనకళ్ళ ముందు ఆవిష్కృతమవుతుంది. అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో 22 మిలియన్ యూనిట్ల కొరతతో విద్యుత్ కోతలు... సకాలంలో అందకపోవడమే కాకుండా నకిలీ, కల్తీ విత్తనాలు, ఎరువులతో పంటలు పండక పోవడం, గిట్టుబాటు ధరలు లేక రైతుల ఆత్మహత్యలకు పాల్పడటం, ఉద్యోగావకాశాలు లేక యువత భవిష్యత్తు అంధకారం బంధురంగా మారడం...ఆదాయాలు పెరిగే మార్గం లేక, వ్యాపారులు అంతంతమాత్రంగా నెట్టుకొస్తున్న రోజులు. మిన్నువిరిగి మీదపడినట్లు... రాజకీయ నేపథ్యంలో విభజన మూలంగా మిగిలిన రాష్ట్రానికి రాజధాని లేదు...రాష్ట్రం ఒకచోట ఉంటే.. పరాయి గడ్డపై మంత్రి మండలి, సచివాలయం విధుల నిర్వహణ...రూ.16 వేల కోట్ల లోటు బడ్జెట్...కనీవినీ ఎరుగని దుస్థితిలో ఈసురోమంటున్న నవ్యాంధ్ర ప్రజలకు ఎన్నికలు చీకట్లో చిరుదీపంలా దారి చూపించాయి...ఆ ఎన్నికల్లో అత్యధిక నియోజకవర్గాల్లో గెలిపించి అధికారం కట్టబెట్టడంతో రెండోసారి నారా చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా, ఆయన సహచరులు మంత్రులుగా బాధ్యతలు చేపట్టడంతో నవ్యాంధ్ర ప్రజలు తమను తాము రక్షించుకున్నట్లు అయింది. గతంలో తొమ్మిదేళ్ళకాలంలో మంచిపేరు తెచ్చుకున్న పరిపాలనాదక్షుడు, ఐటీ రంగాన్ని వ్యవస్థీకృతం చేయడం ద్వారా హైదరాబాద్‌ను ప్రపంచపటంలో గుర్తింపు తెచ్చిన సమర్థుడు, అధికారపీఠం అధిష్టించిన వందరోజుల్లోనే నవ్యాంధ్రలో విద్యుత్ సరఫరా మెరుగుపరిచి, పంపిణీలో నష్టాలు తగ్గించడంతో కోతలు తొలగించడం సాధ్యమైంది, గోదావరి నీటిని కృష్ణా నదికి మళ్ళించి దేశంలో ప్రప్రథమంగా నదుల అనుసంధానం గావించి అసాధ్యాన్ని సుసాధ్యంగా మార్చి అపరభగీరథుడుగా చంద్రబాబు కీర్తి గడించారు. నూతన రాజధాని నిర్మాణానికి అవసరమైన 33 వేల ఎకరాలను స్వచ్ఛందంగా ముందుకు వచ్చిన రైతులు నుంచి సమీకరించడం దేశ వ్యాప్త సంచలనానికి దారితీసింది. బడ్జెట్‌లో సాధారణ ఖర్చులు పోను మిగులు లేకపోయినా, ఆదాయ వనరులు పరిమితంగా ఉన్నప్పటికీ వెరవక రైతు రుణమాఫీకి నడుం బిగించారు... లక్షలాది మంది వృద్ధులు, వితంతువులు, వికలాంగులు, నేత పనివారికి పింఛన్లను రెండు వందల నుంచి వేయికి పెంచి ఇస్తున్నారు. అనేక ప్రజాసంక్షేమ కార్యక్రమాలకు పెద్దపీట వేశారు.

ప్రథమంగా సింగపూర్, జపాన్, చైనా, దావోస్ తదితర దేశాలకు వెళ్లి ప్రపంచ స్థాయి అగ్రగామి కంపెనీ అధిపతులతో సమావేశాలు నిర్వహించి రాష్ట్రానికి పెట్టుబడులను ఆకర్షించేలా చేసిన కృషి కొద్ది కాలంలోనే అమోఘ ఫలితాలనిస్తున్నాయి. వ్యవసాయంలో ఆంధ్రప్రదేశ్ అనుసరిస్తున్న విధానాలు దేశానికి మార్గదర్శకంగా నిలుస్తున్నాయి. ఏపీలో 1000 కిలోమీటర్ల రోడ్డు మార్గం, 1000 కిలో మీటర్ల రైలుమార్గం, దాదాపు 1000 కిలోమీటర్ల కోస్తాతీరం, ఎయిర్ పోర్టులు, పోర్టులు పెట్టుబడిదారులకు సానుకూలాంశాలు ప్రధాన ఆకర్షణగా మారాయి.

చంద్రబాబు విజన్ గొప్పదని, అనుకున్నది సాధించేదాకా విశ్రమించని తత్వం అని ఈ సదస్సు నిరూపితం చేసింది. ఏపీలో అనుసరిస్తున్న 'స్మార్ట్ ఆర్గనైజేషన్' విధానాలు దేశానికి ఇప్పుడు చాలా అవసరమని కేంద్రమంత్రి వెంకయ్య నాయుడు అన్నారు. అమెరికాకు కాలిఫోర్నియా గ్రోత్ ఇంజన్ అని, అలాగే భారత్‌కు ఆంధ్రప్రదేశ్ గ్రోత్ ఇంజన్ అని కేంద్ర మంత్రి జయంత్ సిన్హా సదస్సు వేదికగా అభివర్ణించడం గమనార్హం. ఆంధ్రప్రదేశ్‌కు ఇప్పటికే కేంద్రం రెండు పారిశ్రామిక కారిడార్లు కేటాయించింది. తూర్పుతీరానికి ముఖద్వారంగా ఉన్న ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులకు అవకాశాలు పుష్కలంగా ఉన్నందున ఇంత భారీ ఎత్తున స్పందన వస్తోంది. అన్నింటా అత్యంత అనుకూలమైన వాతావరణంతో ఆంధ్రప్రదేశ్ పెట్టుబడులకు ఉత్తమమైన రాష్ట్రంగా కనిపిస్తోంది. "ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టడానికి దేశవిదేశాల నుంచి వచ్చిన ఇన్వెస్టర్లకు నాది భరోసా. అనుమతుల పేరుతో అనవసరపు కాలయాపన ఇకపై జరగదు. పూర్తి పారదర్శక విధానాలతో, కేవలం ఒకే ఒక దరఖాస్తుతో పరిశ్రమల స్థాపనకు కావాల్సిన అన్ని అనుమతులను 21 రోజుల వ్యవధిలో అందిస్తాం. సుపరిపాలన, జవాబుదారీతనం, పారదర్శక విధానాలను పాటిస్తూ సింగిల్ డెస్క్ విధానంతో అనుమతులు వేగవంతంగా ఇస్తాం" అని ముఖ్యమంత్రి స్పష్టమైన హామీ ఇచ్చారు.

ఇప్పుడు విశాఖలో నిర్వహించిన భాగస్వామ్య సదస్సులో ఊహించని రీతిలో రాష్ట్రానికి పెట్టుబడులు రావడంతో, చంద్రబాబుపై ఏపీ ప్రజలు మాత్రమే కాకుండా అంతర్జాతీయ స్థాయి పరిశ్రమల అధిపతులు, పెట్టుబడిదారుల విశ్వాసం ప్రదర్శిస్తున్నారని రుజువైంది. చంద్రబాబు దార్శనికత, కష్టపడి పనిచేసే స్వభావం రాష్ట్రానికి వరం. ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి జెట్ స్పీడులో సాగాలంటే ఇక మిగిలింది సీఎం చంద్రబాబు సమర్థ నాయకత్వానికి ప్రజలు తమ పూర్తి మద్దతును అందించడమే.

– జాస్తి గోపాల ప్రసాద్




# చంద్రబాబు హయాంలో అగ్రగామిగా 'నవ్యాంధ్ర'

- కేంద్రం తరఫున పరిపూర్ణ సహకారం అందిస్తాం
- విశాఖపట్నంలో జరిగిన సిఐఐ భాగస్వామ్య సదస్సులో అరుణ్‌జైట్లీ




నవ్యాంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు అందిస్తున్న సమర్ధమైన పరిపాలనలో నవ్యాంధ్ర రాష్ట్రం త్వరలో దేశంలోనే ఒక అగ్రగామి రాష్ట్రంగా రూపాంతరం చెందబోతోందని కేంద్ర ఆర్థికశాఖ మంత్రి అరుణ్‌జైట్లీ అభిప్రాయపడ్డారు. ఏపీ ప్రజల సత్తా ఏంటో ప్రపంచానికి బాగా తెలుసని, ఈ విషయం గత చరిత్ర చెబుతోందన్నారు. సీఐఐ భాగస్వామ్యంతో రాష్ట్ర ప్రభుత్వం జనవరి 10 నుంచి మూడు రోజుల పాటు విశాఖపట్నం నగరంలో ఏర్పాటు చేసిన సదస్సు ప్రారంభోత్సవ కార్యక్రమంలో ఆయన ముఖ్యఅతిథిగా ప్రసంగించారు. 1600 మంది దేశ, విదేశీ ప్రతినిధులతో 10న ఆరంభమైన ఈ సదస్సులో జైట్లీ మాట్లాడుతూ, రాష్ట్ర ప్రగతికోసం చంద్రబాబు తన పరిపాలనలో చూపుతున్న సమర్థత, ముందుచూపు, కార్యదీక్షలను ప్రశంసించారు.

సమైక్యాంధ్రప్రదేశ్ విభజన సందర్భంలో నాటి కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన హామీలన్నీ అమలు చేస్తూ రాష్ట్ర సమగ్రాభివృద్ధికి కృషి చేస్తామని అరుణ్‌జైట్లీ అన్నారు. నవ్యాంధ్ర పునర్నిర్మాణ బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహిస్తారన్న విశ్వాసంతోనే చంద్రబాబుకు ఇక్కడ ప్రజలు పట్టంగట్టారని కొనియాడారు. రాష్ట్ర విభజన జరిగాక అనేక సమస్యలు, సవాళ్లు రాష్ట్రాన్ని కుదిపేస్తున్న సందర్భంలో నవ్యాంధ్ర నిర్మాణ సారథ్యం అనుభవజ్ఞుడైన చంద్రబాబుకు అప్పగిస్తూ తీసుకున్న నిర్ణయంతో ఏపీ ప్రజలు ఎంతో తెలివైన వారుగా మరోసారి నిరూపించుకోగలిగారని జైట్లీ అన్నారు.

పెట్టుబడులు పెట్టేందుకు ఆంధ్రప్రదేశ్ అత్యంత అనుకూలమైన రాష్ట్రమని జైట్లీ అన్నారు. విభజనవల్ల హైదరాబాద్‌ను వదులు కోవడంవల్ల ప్రధానమైన ఆదాయవనరును కోల్పోవలసి వచ్చిందని, అయినప్పటికీ అతి స్వల్పకాలంలోనే 11శాతం వృద్ధిరేటును సాధించి, ఏపీ తన సత్తా ఏంటో నిరూపించుకోగలిగిందన్నారు. ఈ రెండంకెల వృద్ధి, దేశానికి కూడ ఎంతో ప్రయోజనకరమని వ్యాఖ్యానించారు. కొత్తగా ఏర్పాటైన నవ్యాంధ్రకు ఒక పక్క రాజధాని, మరోపక్క పాలన నిర్వహణకు మౌలిక సదుపాయాలేవీ లేనప్పటికీ రాష్ట్ర ప్రగతిలో డబుల్ డిజిట్ పురోగతిని సాధించడం ముఖ్యమంత్రి చంద్రబాబు పరిపాలనాదక్షతకు నిదర్శనమని జైట్లీ కొనియాడారు.

పరిపాలకుని సమర్థత, సుస్థిరమైన ప్రభుత్వాన్ని దృష్టిలో పెట్టుకునే ఎవరైనా ఔత్సాహికులు పెట్టుబడులు పెడతారన్నారు. ఈ పరిస్థితులన్నీ రాష్ట్రంలో సానుకూలంగా ఉన్నాయని జైట్లీ పెట్టుబడిదారులకు భరోసా ఇచ్చారు.

స్వాతంత్ర్యానంతరం మన దేశంలో అనేక కొత్త రాష్ట్రాలు ఏర్పాటైనప్పటికీ, నవ్యాంధ్ర నూతన రాజధానిగా చరిత్రప్రసిద్ధిగాంచిన 'అమరావతి' నామకరణం చేయడంతోనే అవుట్‌స్టాండింగ్ గ్లోబల్ సిటీగా ప్రపంచం దృష్టిని ఆకర్షించిందని జైట్లీ కొనియాడారు.

రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టేందుకు చంద్రబాబు పాలనే ఔత్సాహికులకు ఒక భరోసా అని కితాబిచ్చారు. ప్రభావశీలుడైన చంద్రబాబు నాయకత్వం ఏపీకి అదనపు అర్హతని జైట్లీ అభివర్ణించారు. రాష్ట్రంలో కొన్ని ప్రతికూల అంశాలు ఉన్నప్పటికీ భారీ లక్ష్యాలు నిర్దేశించుకుని అలుపెరుగకుండా ముఖ్యమంత్రి కార్యదీక్షతో పనిచేస్తున్నారన్నారు. అందుకే ఈ రాష్ట్రం అతి త్వరలోనే అగ్రగామి రాష్ట్రంగా ఆవిర్భవిస్తుందన్న విశ్వాసం తనకున్నదని ఆయన ఆశాభావం వ్యక్తం చేశారు.

ముద్రా బ్యాంకు ఆవిర్భాంతో దేశవ్యాప్తంగా కోటీ 73 లక్షల మంది చిన్న తరహా పారిశ్రామిక వేత్తలయ్యారన్నారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఏపీ అభివృద్దే ప్రధాన లక్ష్యంగా పెట్టుకుని పరస్పర సహకారంతో పని చేస్తున్నాయని, పెట్టుబడిదారులు ఈ విషయాన్ని గమనించి ముందుకు రావాలని జైట్లీ అన్నారు.

## ఏపీలో పెట్టుబడులు పెట్టడం లాభదాయకం

కేంద్ర మంత్రి నిర్మలా సీతారామన్

సహజవనరులు, నైపుణ్యంతో కూడిన మానవ వనరులు ఉన్న ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టడం లాభదాయకమని కేంద్ర వాణిజ్య, పరిశ్రమలశాఖమంత్రి నిర్మలా సీతారామన్ అన్నారు. ఏపీలో పెట్టుబడులు పెట్టేందుకు ఔత్సాహికులు ముందుకు రావాలని ఆమె పిలుపునిచ్చారు. సీఐఐ భాగస్వామ్య సదస్సు-2016 లో ఆమె మాట్లాడుతూ సామర్థ్యం, నైపుణ్యంతో తెలుగువారు నేడు ప్రపంచాన్నే జయించారని, దేశంలో భారీ ప్రాజెక్టుల నిర్మాణాలలో ఎక్కువగా తెలుగువారే ఉండటం గర్వించదగిన అంశమన్నారు. సీఐఐ సదస్సు విశాఖపట్నంలో జరగడం, ఏపీ నుంచి తాను ప్రాతినిథ్యం వహించడం తనకెంతో గర్వంగా ఉందన్నారు. ఈ సదస్సును ఏపీలో నిర్వహించాలని ప్రతిపాదించినవెంటనే ముఖ్యమంత్రి చంద్రబాబు ఏ మాత్రం వెరవకుండా ధైర్యంగా ముందుకు వచ్చాన్నారు. ఇటీవల హుద్‌హుద్ తుపాను కన్నెర్రతో అతలాకుతలమైన విశాఖపట్నం నగరంలో ఈ సదస్సును సాహసోపేతంగా నిర్వహించడం అభినందనీయమని నిర్మలా సీతారామన్ అన్నారు.

## వచ్చే ఏడాది కూడ విశాఖలోనే 'సదస్సు'

ముఖ్యమంత్రి చంద్రబాబు అభ్యర్థనమేరకు 2017లో జరగనున్న సీఐఐ భాగస్వామ్య సదస్సును మళ్లీ విశాఖపట్నం నగరంలోనే నిర్వహించనున్నట్లు కేంద్రమంత్రి నిర్మలా సీతారామన్ ప్రకటించారు.

❖




# 'చంద్రబాబు ఒక పెర్ఫార్మర్... ఒక రిఫార్మర్'




- కేంద్ర పట్టణాభివృద్ధిశాఖ మంత్రి వెంకయ్యనాయుడు
- చంద్రబాబు సమర్థ పరిపాలనపై ప్రశంసల జల్లు

నవ్యాంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు విజన్ చాలా గొప్పది. అనుకున్నది సాధించేదాకా ఆయన విశ్రమించని మిషన్. ఆయనొక మిషన్..ఆయనదొక విజన్. ఆయనొక పెర్ఫార్మర్...ఒక రిఫార్మర్" అని కేంద్ర పట్టణాభివృద్ధిశాఖ మంత్రి ముప్పవరపు వెంకయ్యనాయుడు అభివర్ణించారు. విశాఖపట్నంలో జరిగిన సీఐఐ భాగస్వామ్య సదస్సులో ఆయన ముఖ్యఅతిథిగా ప్రసంగిస్తూ, చంద్రబాబు అందిస్తున్న సమర్థ పరిపాలనపై ప్రశంసల జల్లు కురిపించారు. చంద్రబాబు దార్శనికత, కష్టపడి పనిచేసే స్వభావం నవ్యాంధ్రకు ఒక వరంలాంటిదని, చంద్రబాబే ఒక బ్రాండ్ అంటూ కొనియాడారు.

నలభై ఒక్క దేశాల ప్రతినిధులు ఈ సదస్సులో పాల్గొనడం శుభ సంకేతమన్నారు. విదేశీ పెట్టుబడిదారుల చూపంతా ఇప్పుడు భారత్‌పై ఉందని, అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు భారత దేశాన్ని బలీయమైన ఆర్థిక శక్తిగా గుర్తించాయని వెంకయ్యనాయుడు అన్నారు. ప్రజలు వాస్తవ పరిస్థితులను గుర్తిస్తున్నారన్నారు. వియత్నాం వంటి చిన్న దేశాలు కూడ మంచి వృద్ధిరేటు సాధిస్తున్నాయని గుర్తు చేశారు. అవకాశం ఉన్నంత మేరకు నవ్యాంధ్ర సమగ్రాభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం తరపున అన్నివిధాలా సహకరిస్తామన్నారు.

### అమరావతికి రూ.7500 కోట్ల రుణం

నవ్యాంధ్ర నూతన రాజధాని అమరావతి నిర్మాణానికి రూ.7,500 కోట్ల మేరకు హడ్కో సంస్థ నుంచి రుణం ఇవ్వనున్నట్లు వెంకయ్యనాయుడు ఈ సదస్సులో ప్రకటించారు. గృహనిర్మాణ కార్యక్రమంలో భాగంగా కేంద్రప్రభుత్వం దేశం మొత్తం మీద 2లక్షల 36వేల గృహాలు నిర్మించాలని నిర్ణయించగా ఇందులో ఒక లక్షా 96వేల గృహాలను ఒక్క నవ్యాంధ్రప్రదేశ్‌లోనే నిర్మించాలని నిర్ణయించామన్నారు. ఏపీ పట్ల కేంద్రప్రభుత్వానికి ఉండే నిబద్ధతకు ఇదొక నిదర్శనమన్నారు. ఆంధ్రప్రదేశ్‌కు హైదరాబాద్ బ్రాండ్ లేకపోయినా పరవాలేదని, చంద్రబాబునాయుడే నవ్యాంధ్రకు ఒక బ్రాండ్ అని ప్రశంసించారు. ఏపీలో వెయ్యి కిలోమీటర్ల రహదారి మార్గం, మరో వెయ్యి కిలోమీటర్ల రైలు మార్గం, దాదాపు వెయ్యి కిలోమీటర్ల పొడవున కోస్తాతీరం, విమానాశ్రయాలు, ఓడరేవులు ఉన్నాయని, ఇవన్నీ పెట్టుబడిదారులకు సానుకూలమైన అంశాలని వెంకయ్యనాయుడు అన్నారు.

### ల్యాండ్ పూలింగ్ ఆదర్శం: కేంద్రమంత్రి జయంత్ సిన్హా

ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అమరావతి రాజధాని నిర్మాణం కోసం అనుసరించిన ల్యాండ్ పూలింగ్ విధానం దేశానికే ఒక ఉత్తమ నమూనా అని కేంద్ర ఆర్థికశాఖ సహాయమంత్రి జయంత్ సిన్హా ప్రశంసించారు. పేదల అభ్యున్నతి కోసం ఒక పక్క కృషి చేస్తూనే, మరో పక్క దేశాన్ని అన్ని రంగాలలోనూ బలీయమైన ఆర్థికశక్తిగా మలచడానికి చంద్రబాబు కృషి చేస్తున్నట్లు తెలిపారు. ఏపీలో పింఛన్ల పంపిణీ, పౌర సరఫరాల విధానం మన దేశానికే ఆదర్శమని కొనియాడారు. వ్యవసాయంలో ఏపీ అనుసరిస్తున్న విధానాలు దేశానికే మార్గదర్శకంగా ఉన్నాయన్నారు. ఏపీలో అనుసరిస్తున్న 'స్మార్ట్ అర్బనైజేషన్' విధానాలు దేశానికి ఇప్పుడు చాలా అవసరమన్నారు. అమెరికాకు కాలిఫోర్నియా గ్రోత్ ఇంజన్ వంటిదని, అలాగే భారత్‌కు ఆంధ్రప్రదేశ్ గ్రోత్ ఇంజన్ అవుతుందంటూ కేంద్రమంత్రి జయంత్ సిన్హా సీఎం చంద్రబాబును అభినందించారు.



విభజనానంతర ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన తొలి భాగస్వామ్య సదస్సుకు వచ్చిన స్పందన అపూర్వం. రాష్ట్రానికి ఇంకా పూర్తి స్థాయి రాజధాని ఏర్పడకపోయినా, ఆర్థికలోటుపాట్లు ఇంకా చక్కబడకపోయినా, ఇక్కడ దూరదృష్టి, దార్శనికత ఉన్న నాయకత్వం ఉందని పారిశ్రామిక, వ్యాపారవర్గాలు విశ్వసించాయి. ప్రకృతి ప్రసాదించిన వనరులను, మానవ శక్తిసామర్థ్యాలను మేళవించి ఆంధ్రప్రదేశ్ దేశానికే తలమానికంగా రూపొందుతుందనే నమ్మకాన్ని పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టడం ద్వారా దేశ, విదేశీ పారిశ్రామికవేత్తలు ప్రదర్శించారు.

# నవ్యాంధ్రకు వరాల జల్లు కురిపించిన కేంద్రం



విశాఖపట్నంలో జనవరి 10 నుంచి మూడు రోజుల పాటు జరిగిన సీఐఐ భాగస్వామ్య సదస్సులో కేంద్రప్రభుత్వం రాష్ట్రానికి వరాల జల్లు కురిపించింది. వేలాది కోట్ల వ్యయం కాగల నాలుగు ప్రధానమైన ప్రాజెక్టులకు అనుమతించింది. రూ.30వేల కోట్లతో హెచ్‌పీసీఎల్ విస్తరణ ప్రాజెక్టు చేపట్టడానికి కేంద్రం అనుమతించినట్లు కేంద్ర రసాయనాలు, ఎరువులశాఖ మంత్రి అనంతకుమార్ ప్రకటించారు. అలాగే రూ.20 వేల కోట్ల వ్యయం కాగల వైద్యపరికరాల పార్కును ఏర్పాటు చేయనున్నట్లు తెలిపారు. మరో రూ.30వేల కోట్ల వ్యయంతో పెట్రోకెమికల్ కాంప్లెక్స్‌ను ఏర్పాటు చేయాలని కేంద్రం నిర్ణయించినట్లు మంత్రి అనంతకుమార్ ప్రకటించారు.

సదస్సులో కేంద్రమంత్రి అనంతకుమార్ మాట్లాడుతూ విశాఖపట్నం నగరాన్ని ఫార్మా హబ్‌గా అభివృద్ధి చేయనున్నట్లు చెప్పారు. ఇందుకోసం ఈ నగరంలో రూ.600కోట్ల పెట్టుబడితో జాతీయ ఫార్మస్యూటికల్స్ విద్య, పరిశోధనా సంస్థ (నైపర్) ఏర్పాటు చేయనున్నట్లు తెలిపారు. ఐఐటీతో సమానమైన ఈ సంస్థ వల్ల రాష్ట్రంలో ఫార్మా పరిశ్రమకు అవసరమైన నిపుణులు అందుబాటులోకి రానున్నారు. ఈ సంస్థ ఏర్పాటుకు కనీసం 100 ఎకరాలను సమకూర్చాలని మంత్రి అనంతకుమార్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడును కోరారు. రాష్ట్ర ప్రభుత్వం భూమిని సేకరించినట్టయితే వచ్చే బడ్జెట్‌లోనే దీనికోసం రూ.600 కోట్లు కేటాయిస్తామని ప్రకటించారు. అన్నీ అనుకున్నట్టుగా సాగితే త్వరలోనే దీనికి శంకుస్థాపన చేస్తామన్నారు.

నవ్యాంధ్రలో హిందూస్థాన్ పెట్రోలియం రిఫైనరీని రూ.30 వేల కోట్ల పెట్టుబడితో విస్తరించనున్నట్లు అనంతకుమార్ వెల్లడించారు. రాబోయే ముప్పై రోజుల వ్యవధిలోనే కేంద్ర పెట్రోలియంశాఖ మంత్రితో దీనిపై చర్చించనున్నట్లు తెలిపారు. పెట్రోకెమికల్ కాంప్లెక్స్‌ను కూడ ఏర్పాటు చేయడానికి చర్యలు తీసుకోబోతున్నామన్నారు. ఇప్పటివరకు దేశంలో నాలుగు పెట్రో కెమికల్ కారిడార్లు ఉన్నాయని, వీటిలో దహేజా, పారాదీప్, నాగపట్నంలలో చెరొకటి ఉండగా, విశాఖపట్నం- కాకినాడ మధ్య మరొక కారిడార్ ఉండనున్నట్లు మంత్రి అనంతకుమార్ వివరించారు. ఈ కారిడార్‌ను పెట్రో కెమికల్ కాంప్లెక్స్‌గా అభివృద్ధి చేయనున్నట్లు చెప్పారు.

ఈ విషయాన్ని కేంద్ర పెట్రోలియంశాఖ మంత్రి ధర్మేంద్ర ప్రధాన్‌తో చర్చించి, ఆయన అనుమతితోనే ఈ ప్రాజెక్టును సూత్రప్రాయంగా ప్రకటిస్తున్నానన్నారు. ఈ పెట్రో కాంప్లెక్స్‌లో దాదాపు రూ.30 వేల కోట్ల పెట్టుబడులు వచ్చే అవకాశాలు ఉన్నాయన్నారు. ఈ కాంప్లెక్స్‌ను ఎక్కడ ఏర్పాటు చేయాలన్న అంశాన్ని వచ్చే నెలలో నిర్ణయించనున్నట్ల చెప్పారు.

## వైద్యపరికరాల తయారీ ప్రాజెక్టు

విశాఖపట్నంలో రూ.20వేల కోట్ల పెట్టుబడితో వైద్యపరికరాల తయారీ ప్రాజెక్టును ఏర్పాటు చేయనున్నట్లు మంత్రి అనంతకుమార్ ప్రకటించారు. అత్యున్నతమైన సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన వైద్యపరికరాలు ఫార్ములేషన్స్, బల్క్ డ్రగ్స్ తయారు చేయడానికి వీలుంటుందన్నారు. ఇలాంటి పార్కును గుజరాత్ రాష్ట్రంలో కూడ ఏర్పాటు చేయనున్నామని మంత్రి వెల్లడించారు.

## 'సిపెట్' విస్తరణకు చర్యలు

భారత ప్రధాని నరేంద్రమోడీ ఎంతో ప్రతిష్ఠాత్మకంగా అమలు చేస్తున్న 'స్కిల్ ఇండియా స్కీమ్' ద్వారా విజయవాడలో పనిచేస్తున్న ప్లాస్టిక్ ఇంజనీరింగ్ అండ్ టెక్నాలజీ కేంద్ర సంస్థ (సిపెట్) హోదాను పెంచబోతున్నామన్నారు.

## 'నేను ఎన్టీఆర్ అభిమానిని'

'నేను నా కుటుంబసభ్యులంతా స్వర్గీయ ఎన్టీరామారావు అభిమానులం. మా పూర్వీకులంతా అనంతపురానికి చెందినవారు. తెలుగురాష్ట్రంతో మాకు ఎంతో అనుబంధం ఉంది. ఇప్పుడు ఎన్టీఆర్‌తో సమానంగానే చంద్రబాబును అభిమానిస్తున్నాం' అని కేంద్ర మంత్రి అనంతకుమార్ హర్షధ్వానాల మధ్య వెల్లడించారు.

## 'చంద్రబాబు...ఓ అయస్కాంతం'

"నవ్యాంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు సీఐఐ సదస్సుకు ఒక అయస్కాంతంలా వ్యవహరించారు. ఆయన సమర్థమైన నాయకత్వపై ఉన్న విశ్వాసంతోనే సన్‌రైజ్ స్టేట్ నిర్మాణ నేపథ్యంలో పెద్దఎత్తున జరిగిన ఈ సదస్సు విజయవంతమైంది", అని మంత్రి అనంతకుమార్ చంద్రబాబుపై ప్రశంసల వర్షం కురిపించారు.






# ఏపి ఒక గొప్ప ఆర్థిక శక్తిగా ఎదగనుంది

- చంద్రబాబు నాయకత్వమే రాష్ట్రానికి గొప్ప ఉత్తేజం
- విశాఖ దగ్గర భారీ నౌకానిర్మాణ కేంద్రం




"కొత్త రాష్ట్రం ఏర్పడిన తర్వాత జరుగుతున్న తొలి భాగస్వామ్య సదస్సులో పాల్గొనడం గౌరవంగా భావిస్తున్నాను. ఆధునిక భారతదేశపు గొప్ప క్రాంతదర్శుల్లో ఒకరు, గొప్ప క్రియాశీలిగా, ప్రగతి సాధకునిగా, ప్రేరణశక్తిగా ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు, గౌరవం పొందిన ఒక మహానాయకుడితో వేదిక పంచుకోవడం అంతకుమించి గౌరవమని నా అభిప్రాయం. ఇరవై ఏళ్లుగా నేను ఎరిగిన ఆ మహానాయకుడు, రాష్ట్ర ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు గారు.

1990 తొలినాళ్లలో మా నాన్నగారు ధీరూబాయ్ అంబాని సమక్షంలో తొలిసారి చంద్రబాబు గారిని నేను కలిసిన క్షణాలు ఇంకా నా స్మృతిపథంలో పదిలంగా ఉన్నాయి.

చంద్రబాబు నాయుడు గారూ.... అది మీ మామగారు, రాజకీయ మార్గదర్శకులు, మహానాయకులైన ఎన్టీఆర్ గారి హయాం. మా నాన్న గారు మిమ్మల్ని మొదటిసారి కలిసినప్పుడు, అదృష్టవశాత్తూ నేనూ వారితో ఉన్నాను. అప్పుడు మా నాన్న గారు మీ గురించి చెప్పిన మాటలు ఇప్పటికీ జ్ఞాపకం.

"అనిల్! వాస్తవిక దృష్టితో కలలు గనే అతి అరుదైన సామర్థ్యాన్ని భగవదానుగ్రహంగా పొందిన యువ నాయకుడితను. ఎన్టీఆర్‌కు నిజమైన వారసుడు"

దేశంలో అంతర్జాతీయ స్థాయి బిజినెస్ స్కూల్ ఏర్పాటు చేయడానికి చూస్తున్నప్పుడు ఐదు రాష్ట్రాలు దానిని దక్కించుకోవడానికి పోటీపడిన రోజుల్ని నేను మర్చిపోలేను. అప్పుడు ఫోన్ చేశారు మీరు– "అనిల్! ఆ బిజినెస్ స్కూల్ ఆంధ్రప్రదేశ్‌కు వచ్చేలా చూడాలి. దానికిగాను ఏమి చేయడానికైనా మా ప్రభుత్వం సిద్ధంగా ఉంది".

"ఆ సంస్థ అంకురార్పణ స్థితి నుంచీ, మీ ధృఢదీక్ష, నాయకత్వ ప్రతిభే దన్నుగా అది ఈ రోజు ఇంతటి అత్యున్నత స్థాయికి చేరుకున్న దశ వరకూ నేను మీతో అసోసియేట్ కావడం నాకు గర్వకారణం. ఈ రోజు ప్రపంచంలోని అత్యుత్తమ సంస్థల్లో ఒకటిగా ఇండియన్ స్కూల్ ఆఫ్ బిజినెస్, హైదరాబాద్ గుర్తింపుపొందింది.

ఆంధ్రప్రదేశ్‌తో రిలయన్స్ గ్రూపుకి ఉన్న సంబంధ బాంధవ్యాలు ఇప్పటివి కావు. ఇప్పటికే ఏపీలో టెలికం, విద్యుత్ రంగాల్లో రూ. 15,000 కోట్ల పెట్టుబడితో 8,000 మందికి ఉద్యోగాలు కల్పిస్తున్నాం. మీకు తెలుసు, ప్రాచీన కాలం నుంచీ విశాఖపట్టణం ఒకానొక ప్రసిద్ధ వాణిజ్య రేవు. విశాఖకి 70 కిలోమీటర్ల చేరువలో ఉన్న రాంబిల్లి దగ్గర భారీ నౌకా నిర్మాణ కేంద్రం ఏర్పాటు చేసేందుకు ఈ రోజు తాజాగా మరో ఒప్పందం కుదుర్చుకున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నా.

'రిలయన్స్ డిఫెన్స్ కంపెనీ' చేపట్టే ఈ ప్రాజెక్టు తొలి దశ కోసం రూ. 5,000 కోట్లు పెట్టుబడి పెట్టనున్నాం. భవిష్యత్తులో మరో రూ. 10వేల కోట్ల పెట్టుబడి పెట్టే అవకాశం ఉంది. ఈ ప్రాజెక్టు ద్వారా కూడా వేలాది యువతకు ఉపాధి అవకాశాలు లభిస్తాయి. అణు జలాంతర్గాములు, యుద్ధ విమాన వాహక నౌకల తయారీకి ఈ ప్రాంతం మంచి వ్యూహాత్మక కేంద్రం. ఏపీలో ఇప్పటి వరకు ఏ పారిశ్రామిక సంస్థ కూడా ఒకే చోట ఈ స్థాయిలో పెట్టుబడి పెట్టింది లేదని చెప్పడానికి గర్వపడుతున్నా.

రాంబిల్లిలో నౌకా నిర్మాణ కేంద్రం ఏర్పాటు ద్వారా అటు ప్రధాని మోదీ 'మేక్ ఇన్ ఇండియా', ఇటు ఏపీ సీఎం చంద్రబాబు 'మేడ్ ఇన్ ఆంధ్రప్రదేశ్' కలలు సాకారమవుతాయి.

నారా లోకేష్‌ని కలిశాను. ఆయన అత్యున్నత విద్యార్హతలు, రాజకీయ పరిజ్ఞానం అద్భుతం. ఆయనది సూపర్ బ్రైట్ మైండ్. ఎన్.టి.ఆర్., చంద్రబాబుల అభివృద్ధి వారసత్వం చిరకాలం కొనసాగుతుందన్న అభిప్రాయం లోకేష్‌ని కలిశాక కలిగింది.

"ప్రతి సంక్షోభమూ ఒక్కో అవకాశమే," అని చంద్రబాబు నాయుడు గారు ఇటీవల అనడం విన్నాను. అది విన్నప్పుడు– "ప్రతికూలమైన ప్రతిస్థితి ఒక అవకాశం వంటిది," అనే మా నాన్న గారి మాటలు గుర్తుకొచ్చాయి. ఈ రోజు ఆంధ్రప్రదేశ్ ఎదుర్కొంటున్న సవాళ్లు చూస్తుంటే, పై మాటలు తప్ప మరేవీ స్ఫురణకి రావు. ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు గారు తన సంకల్పంతో, పట్టుదలతో సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న అవశేషాంధ్ర ప్రదేశ్‌ను అనంతమైన ఉపాధి అవకాశాలు, అభివృద్ధికి ఆలవాలమైన రాష్ట్రంగా తీర్చి దిద్దారు. ఆయన నేతృత్వంలో నవ్యాంధ్ర దేశంలోని గొప్ప ఆర్థిక శక్తుల్లో ఒకటిగా ఎదిగే రోజు మరెంతో దూరంలో లేదు.

మిత్రులారా! రండి.

ఇండియాలో పెట్టుబడులు పెట్టండి. ఆంధ్రప్రదేశ్ లో పెట్టుబడులు పెట్టండి.

ధన్యవాదాలు. జైహింద్"

# అమరావతి అభివృద్ధిలో భాగస్వాములు కావాలి

– ముఖ్యమంత్రి చంద్రబాబు




అంతర్జాతీయ ప్రమాణాలతో అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మిస్తున్న నవ్యాంధ్రప్రదేశ్ నూతన రాజధాని 'అమరావతి' మహానగర నిర్మాణంలో పారిశ్రామిక వేత్తలంతా భాగస్వాములు కావాలని ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు పిలుపునిచ్చారు. జనవరి 10 నుంచి మూడు రోజుల పాటు జరిగిన సీఐఐ భాగస్వామ్య సదస్సులో ఆయన మాట్లాడుతూ ఏపీలో పెట్టుబడులు పెట్టేందుకు అనువైన వాతావరణం ఉన్నదన్నారు. పరిశ్రమలు, ప్రాజెక్టులు పెట్టే ఔత్సాహికులకు సరళతరంగా ఏకగవాక్ష విధానంలో అనుమతులిస్తామన్నారు. మౌలిక సదుపాయాల కల్పనతోపాటు, పలు రాయితీలిచ్చి ప్రోత్సహిస్తామన్నారు. ప్రపంచస్థాయి కార్యాలయాలన్నీ అమరావతిలోనే ఏర్పాటు చేయడానికి అవసరమైన వసతులు కూడ కల్పిస్తున్నట్లు చంద్రబాబు ప్రకటించారు.

పెట్టుబడులకు అనుకూలమైన రాష్ట్రంగా ప్రపంచబ్యాంకు ఆంధ్రప్రదేశ్‌కు దేశంలోనే రెండో స్థానం ఇచ్చిందని గుర్తు చేశారు. త్వరలో నంబర్ వన్ రాష్ట్రంగా ఎదగాలన్న ఏకైక లక్ష్యంతో తాము చిత్తశుద్ధితో పనిచేస్తున్నామన్నారు. అంతర్జాతీయస్థాయి రాజధాని నిర్మాణంతోపాటు 2022నాటికి దేశంలో మూడు అగ్రగామి రాష్ట్రాలలో ఏపీ ఒక అగ్రరాష్ట్రంగా ఎదగబోతున్నదని చంద్రబాబు అన్నారు. ఈ అవకాశాన్ని పెట్టుబడిదారులంతా సద్వినియోగం చేసుకోవాలని కోరారు.

## 'వృద్ధిలో దేశంతోనే పోటీపడుతున్నాం'

వృద్ధిరేటులో తాము దేశంతోనే పోటీపడుతున్నామని చంద్రబాబు అన్నారు. ప్రపంచంలో భారత్‌కు మాత్రమే రానున్న రెండేళ్లలో రెండంకెల వృద్ధి సాధించగల సత్తా ఉన్నదన్నారు. దేశీయ వాణిజ్యానికే పరిమితం కాకుండా ఎగుమతులకు కూడ పుష్కలమైన అవకాశం ఉన్న తయారీ పరిశ్రమపై కేంద్రప్రభుత్వం సరైన విధానాలను రూపకల్పన చేయాలని చంద్రబాబు విజ్ఞప్తి చేశారు.

## 21రోజుల్లో అనుమతులు

రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధిని పరిగణనలోకి తీసుకుని పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వచ్చే ఔత్సాహికులకు ఏకగవాక్ష విధానంలో కేవలం 21రోజులలోనే అన్ని రకాల అనుమతులూ ఇస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రకటించారు. అనుమతుల పేరుతో అనవసరమైన కాలయాపన జరగకుండా తమ ప్రభుత్వం ఈ చర్యలు చేపట్టిందన్నారు. రాష్ట్ర విభజన వల్ల కలిగే అంతరాయాలు, అవరోధాలను అధిగమిస్తున్నామన్నారు. ఆర్థికంగా అభివృద్ధి చెందడంతోపాటు, ఆనందమయ జీవనానికి కేంద్రంగా నవ్యాంధ్రప్రదేశ్‌ను తీర్చిదిద్దుతామన్న విశ్వాసం తనకున్నదన్నారు.

రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని పెట్టుబడిదారులకు అన్నివిధాలా తాను అండగా ఉంటానన్నారు. రాజధాని కాకపోయినా, గొప్పనగరం కాకపోయినా, ఏడాది క్రితం హుద్‌హుద్ తుపాను ఉక్కిరిబిక్కిరి చేసినా, పెట్టుబడుల సదస్సులో పాల్గొనేందుకు ఎంతోమంది పారిశ్రామిక వేత్తలు విశాఖపట్నం రావడం తనకెంతో సంతృప్తినిచ్చిందన్నారు. రాష్ట్రంలో పూర్తిస్థాయి కన్వెన్షన్ సెంటర్ లేకపోయినా, తాత్కాలిక ఏర్పాట్లతోనే విశాఖపట్నం నగరంలో ఈ సదస్సు నిర్వహిస్తున్నట్లు తెలిపారు.

## 'పెట్టుబడిదారులకు నాది భరోసా'

"నవ్యాంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వచ్చే దేశ,విదేశీ పారిశ్రామిక వేత్తలు, ఔత్సాహికులకు నాది భరోసా. సుపరిపాలన, జవాబుదారీతనం, పారదర్శక విధానాలను పాటిస్తూ ఏకగవాక్ష విధానంతో అనుమతులన్నీ వేగవంతంగా ఇస్తాం. మేమిచ్చే రాయితీలు, ప్రోత్సాహకాలను అవకాశంగా తీసుకుని రాష్ట్రంలో విరివిగా పెట్టుబడులు పెట్టండి", అని ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు పెట్టుబడిదారులకు మరోసారి భరోసా ఇచ్చారు. తూర్పుతీరానికి ముఖద్వారంగా ఉన్న ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులకు అవకాశాలు పుష్కలంగా ఉన్నాయన్నారు. మనం అనేక ఒడిదుడుకులను ఎదుర్కొంటున్నప్పటికీ ప్రధాని నరేంద్రమోడీ దార్శనికత, సమర్థ నాయకత్వంతో భారత్ శరవేగంతో అభివృద్ధి చెందుతోందన్నారు. ప్రపంచంలో ప్రముఖ కంపెనీలకు దక్షిణ భారతీయులే సీఇఓలుగా ఉన్నారని, వారిలో తెలుగువారి పాత్రకూడ ఉండటం గర్వంగా ఉందని చంద్రబాబు అన్నారు. ఏపీకి చెందిన సత్యనాదెళ్ల మైక్రో సాఫ్ట్‌కు సీఇఓగా ఉండగా, గూగుల్ కంపెనీకి తమిళనాడుకు చెందిన సుందర్ పిచాయ్ సీఇఓగా వ్యవహరిస్తున్నారని గుర్తు చేశారు. మన దేశంలో ప్రధానంగా ఏపీలో సాంకేతికపరంగా ప్రజలు ఎంత ముందంజలో ఉన్నారో చెప్పటానికి సత్యనాదెళ్ల ఒక ఉదాహరణ అని చంద్రబాబు అన్నారు.

❖




# chief minister's social network

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సోషల్ మీడియాలో చాలా యాక్టివ్‌గా ఉంటారు. తన కార్యకలాపాలను, కార్యక్రమాలను ఎప్పటికప్పుడు ఫాలోవర్స్‌తో పంచుకుంటారు. ఇటీవల, విశాఖ భాగస్వామ్య సదస్సు, దావోస్ ప్రపంచ ఆర్థిక వేదిక సమావేశాల సందర్భంగా, ముఖ్యమంత్రి చేసిన ట్వీట్లు, దానికి కొంతమంది స్పందన ఇక్కడ చూడవచ్చు. ట్విట్టర్‌లో @ncbn అనే అడ్రసులో మీరు కూడా ముఖ్యమంత్రి ట్వీట్లను ఫాలో కావచ్చు.

Tweet

**Shekhar Gupta** @ShekharGupta

Trust @ncbn Chandrababu Naidu to make a real pitch @Davos Andhra even had a lounge on Promenade, 1st for a CM/State

RESTAURANT YOUR PORT OF CALL Sunrise AP LOUNGE ANDHRA PRADESH

**Amith P** @amithpr Jan 20
@ShekharGupta he is beating the former Gujarat CM on this one. @ncbn @Davos

**deepak sharma** @DSharma101 Jan 20
@ShekharGupta We have very Good CM in states like @ArvindKejriwal @ncbn @Dev_Fadnavis @NitishKumar . We need good @PMOIndia to guide nation.

**Sedrick Alex D'mello** @Dmello... Jan 20
@ShekharGupta @ncbn @Davos Very impressed by Nara Chandrababu Naidu's pitch

Tweet

**N Chandrababu Naidu** @ncbn

Elaborated on how AP's Startup & Innovation Policy aims to create entrepreneurs during my chat with Azim Premji.

ANDHRA PRADESH India's Sunrise State

11:06 p.m. - 21 Jan 2016

82 255

**Rajshekhar** @rajasekhar2580 Jan 21
@ncbn sir, after looking at the efforts you are putting to develop AP, I feel you reach your targets before targeted time. All the best sir

**Phani kumar BVN** @phanikum... Jan 22
@ncbn ముందు చూపు ఉన్న ముఖ్యమంత్రి.. కీప్ ఇట్ అప్

**सीरवी** @RajkumarNMBL Jan 21
@ncbn u will do good..
Its new nd totally fresh startup for AP, nd u have lot of challenges, bt definately u will do good for AP

Tweet

**N Chandrababu Naidu** @ncbn

Total MoUs inked at #SunriseAP Summit in 2 days are 314, ushering in combined investments of Rs. 3.92 lakh-crore, providing 7-8 lakh jobs.

10:24 p.m. - 11 Jan 2016

**178** RETWEETS **312** LIKES.

**naa tweetu naa istam** @neeku... Jan 11
@GunturianN @ncbn MOU depends on poilical and economical and social situation. Hope so babu Garu is different from other CMs

**PreciousZero** @GunturianN Jan 11
@neeku_enduku @ncbn yes very true

**priyanka** @Priyalives Jan 12
That is @ncbn .. keep it going sir ! very proud of you! #InvestInAP twitter.com/ncbn/status/68...

Tweet

**N Chandrababu Naidu** @ncbn

Reliance ADAG is investing Rs.5,000 cr in naval shipbuilding facility in AP. This will bring in numerous jobs.

10:12 p.m. - 10 Jan 2016

**A srinivasarao** @A70Srinivasarao Jan 10
@ncbn sir exlent meru

**Guravareddy** @ReddyGurava Jan 10
@ncbn your r working was sooo good always thinking of A.P people #TDP

**Veera Chunduri** @Raidu0923 Jan 10
@ncbn @AndhraPradeshCM wow news to coastal grads n youth.

Tweet

**N Chandrababu Naidu** @ncbn

Met world leaders -Ethiopia PM Hailemariam Desalegn & Nigeria Vice President Yemi Osinbajo. Had chat on development.

9:14 p.m. - 22 Jan 2016

58 220

**Dr.Narendra kumar V** @vnk9999 Jan 22
@ncbn very nice every babu Garu ..

**VENKAT** @VENKAT901046611 Jan 22
@ncbn very nice sir ur dynamic leadership qualitys

**sairam** @mokshaamm Jan 23
@ncbn I'm very proud that you're receptive... and always strives hard to adopt world's best practises to Take govt. Closer to CommonMan




# దావోస్‌లో ధగధగలాడిన నవ్యాంధ్ర బావుటా

## విజయవంతమైన చంద్రబాబు 'దావోస్' పర్యటన

ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు దావోస్ పర్యటన ఫలవంత మయ్యింది. స్విట్జర్లాండ్‌లోని దావోస్‌లో ప్రపంచ ఆర్థిక వేదిక (వరల్డ్ ఎకనమిక్ ఫోరం- డబ్ల్యూఈఎఫ్) నిర్వహించిన 46వ వార్షిక సదస్సులో ముఖ్యమంత్రి జయప్రదంగా పాల్గొన్నారు. భారతదేశంలోని ముఖ్యమంత్రుల్లో చంద్రబాబుకి ఒక్కరినే డబ్ల్యూఈఎఫ్ ముఖ్య అతిథిగా ఆహ్వానించినప్పుడే అది విజయవంతమయ్యింది; కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ, రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ రఘురామ్ రాజన్‌తో సహా ఆ అంతర్జాతీయ సదస్సుకు భారత్ నుంచి హాజరైన ప్రముఖులు ముగ్గురిలో చంద్రబాబు ఒకరయినప్పుడే దావోస్ యాత్ర దిగ్విజయమయ్యింది.

భూగోళం కొసన ఎక్కడో చిన్న రాష్ట్ర ముఖ్యమంత్రికి ప్రపంచ ఆర్థిక స్థితిగతులమీద అవగాహన ఎందుకు? అడ్డగోలు విభజనతో దిక్కుతోచక అనాథలా మిగిలిన అవశేషాంధ్రప్రదేశ్‌కి సారథ్య బాధ్యతలు చేపట్టి, పునాదులు సైతం మట్టమైపోయిన నేల మీద నవ్యాంధ్ర నిర్మాణానికి నడుం కట్టడమంటే అదొక మహత్తర ప్రయత్నం, మహా యజ్ఞం. ఆర్థిక వృద్ధి – సంస్కరణలు, అందరికీ సంపద, ఆహార భద్రత, పేదరిక నిర్మూలన, సమ సమాజ స్థాపన అనే మహోన్నత లక్ష్యాల్ని నిర్దేశించుకొని, వాటి సాధన ద్వారా ప్రపంచ ఆర్థిక వ్యవస్థను పటిష్ట పరచాలనే ఆశయంతో ఏర్పడిన వేదికే వరల్డ్ ఎకనమిక్ ఫోరం. లక్ష్యసాధనలో జరిగిన తప్పొప్పులని సమీక్షించేందుకు ఏటేటా కొత్తకొత్త ఎజండాలతో వ్యాపార దిగ్గజాలు, అంతర్జాతీయ రాజకీయ నేతలు, మేధావులు, సామాజిక కార్యకర్తలు, ఆర్థిక నిపుణులు, పాత్రికేయులు జరిపే అతి కీలకమైన సమావేశం- దావోస్ సదస్సు. దావోస్ తరహా ఇటువంటి సదస్సునే మన రాష్ట్రంలో జరపాలని ఆశించి, దానికి విశాఖపట్టణంను శాశ్వత వేదిక చేయాలని ముఖ్యమంత్రి ఇటీవల విభజనానంతర ఆంధ్రప్రదేశ్ లో అనూహ్యరీతిలో జరిగిన తొలి సిఐఐ భాగస్వామ్య సదస్సులో ప్రతిపాదించారు.

'నాల్గవ పారిశ్రామిక విప్లవం' అనే అజండాతో జరిగిన దావోస్ సదస్సులో, అదే నినాదంతో నవ్యాంధ్రను ఆ పారిశ్రామిక విప్లవం వైపు నడిపిస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబు ముఖ్య ఆకర్షణగా నిలిచారు. ఆర్థికరంగ నిపుణులు, ఆర్బీఐ గవర్నర్ రఘురాం రాజన్ సిఎంతో ప్రత్యేకంగా సమావేశం కావడం, భూసేకరణకు చంద్రబాబు అనుసరించిన ల్యాండ్ పూలింగ్ విధానాన్ని ఆదర్శమంటూ ప్రశంసించడం విశేషం. దావోస్ పర్యటన మీద ప్రముఖ పాత్రికేయుడు శేఖర్ గుప్తా ప్రత్యేకంగా చేసిన ఇంటర్వ్యూలో కూడా ముఖ్యమంత్రి చంద్రబాబుని దేశానికే రోల్ మోడల్‌గా ఆర్బీఐ గవర్నర్ అభివర్ణించడం ఒక్కటి చాలు, సిఎం దావోస్ పర్యటన ఎంత ఫలవంత మయ్యిందో చెప్పడానికి. విశాఖలో భాగస్వామ్య సదస్సు ద్వారా సాధించిన విజయంతో ప్రపంచ దృష్టిని ఆకర్షించిన ఆంధ్రప్రదేశ్ పతాకాన్ని అంతర్జాతీయ డబ్ల్యూఈఎఫ్ వేదిక పైన సైతం రెపరెపలాడించిన ఘనత ముఖ్యమంత్రి చంద్రబాబుదే.

న వ్యాంధ్రప్రదేశ్ బ్రాండ్ ఇమేజీ పెంచేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చేపట్టిన దావోస్ పర్యటన ఎంతో తోడ్పడింది. ఈ రాష్ట్రం పరిశ్రమలు నెలకొల్పేందుకు, పెట్టుబడులు పెట్టేందుకు అత్యంత అనుకూల ప్రదేశమని ప్రపంచ దేశాలకు చాటి చెప్పేందుకు ప్రతిష్ఠాత్మకమైన ప్రపంచ ఆర్థిక ఫోరాన్ని ముఖ్యమంత్రి వేదికగా చేసుకున్నారు. స్విట్జర్లాండ్‌లోని దావోస్ నగరంలో ఏటా జరిగే ఈ వేదికకు వివిధ దేశాల నుంచి అత్యంత ప్రముఖనాయకులు, పారిశ్రామిక, ఆర్థికవేత్తలు తరలివస్తారు. ఈ సదస్సుకు ఇప్పటికి పదిసార్లు హాజరైన చంద్రబాబునాయుడు ఈసారి కూడా భారతదేశం నుంచి పాల్గొన్న ఏకైక ముఖ్యమంత్రి కావడం విశేషం.

రాష్ట్రంలో ముఖ్యమంత్రి చంద్రబాబు అందిస్తున్న పరిపాలనా సామర్థ్యాన్ని, నిర్విరామంగా రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి పాటుపడుతున్న ఆయన పనితీరును విశ్వాసంలోకి తీసుకుని, కొత్త రాష్ట్రమైనప్పటికీ పెట్టుబడులు పెట్టేందుకు, రాష్ట్ర ప్రగతిలో భాగస్వాములయ్యేందుకు పెట్టుబడిదారులు ఉత్సాహంతో ముందుకు రావడం ఒక శుభపరిణామం. అనుకున్నట్టు అన్నీ జరిగితే రాబోయే రోజుల్లో నవ్యాంధ్రప్రదేశ్ ప్రగతిపథంలో దేశంలో ఒక అగ్రశ్రేణి రాష్ట్రంగా అవతరించే అవకాశం ఉన్నది.

ప్రపంచ శ్రేణి ఉన్నత నగరంగా నిర్మిస్తున్న ఆంధ్రప్రదేశ్ నూతన రాజధాని అమరావతిలో పెద్దఎత్తున పెట్టుబడులు పెట్టాలని, ఇందుకోసం అమరావతిలో తమ తమ కార్యాలయాలు ప్రారంభించాలని ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు అంతర్జాతీయ పారిశ్రామిక దిగ్గజాలకు పిలుపునిచ్చారు. ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టి, మీ వ్యాపారాభివృద్ధికి బాటలు వేసుకోవాలని ప్రపంచస్థాయి పారిశ్రామికవేత్తలకు పిలుపునిచ్చారు.

బజాజ్ గ్రూప్ ఛైర్మన్ రాహుల్ బజాజ్, ఇన్ఫోసిస్ సీఇఓ విశాల్ సిక్కా, భారతీ ఎంటర్‌ప్రైజెస్ ఛైర్మన్ సునీల్ మిత్తల్, పిరమాల్‌గ్రూప్ ఎంటర్‌ప్రైజెస్ ఛైర్మన్ అజయ్ పిరమాల్, సుజ్లాన్ ఎనర్జీ లిమిటెడ్ వ్యవస్థాపకుడు తులసి తంతితో పాటు సుమారు వంద మంది సీఇఓలు ఈ సదస్సులో పాల్గొన్నారు.

రక్షణ రంగ ఉత్పత్తులకు, విమానయాన రంగానికి నవ్యాంధ్రప్రదేశ్‌ను గమ్యస్థానం చేసేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు చేస్తున్న ప్రయత్నం కార్యరూపం దాల్చబోతోంది. దావోస్‌లో జరిగిన ప్రపంచ ఆర్థిక సదస్సులో భాగంగా మూడోరోజు రక్షణరంగ ఆయుధాల ఉత్పత్తిలో అతిపెద్దదైన లాక్‌హీడ్ మార్టిన్ కంపెనీతో సంప్రదింపులు జరిపారు. రక్షణ పరికరాల తయారీకి నవ్యాంధ్రలో అనువుగా ఉన్న ప్రాంతాలు, వాటి ప్రత్యేకతలను లాక్‌హీడ్ మార్టిన్ కంపెనీ ప్రతినిధులకు చంద్రబాబు వివరించగా, ఆ కంపెనీ సీఇఓ మార్టిన్ హ్యూసన్ భారత్‌లో ప్లాంట్ నెలకొల్పేందుకు సంసిద్ధంగా ఉన్నట్లు ప్రకటించారు. టెక్సాస్‌లోని తమ తయారీ యూనిట్లను కొన్నింటిని భారత్‌కు తరలించే యోచన ఉన్నట్లు తెలిపారు. ఎయిర్‌క్రాఫ్ట్‌లు, ఫైటర్ జెట్ల ఉత్పత్తిలో ప్రసిద్ధి చెందిన లాక్‌హీడ్ మార్టిన్ కంపెనీకి సాఫ్ట్‌వేర్ రంగంలోనే కాక మిలటరీ, పౌర ఉపగ్రహాల తయారీలోనూ అపార ప్రతిభ ఉన్నది.

## సీఐఐ ఇన్వెస్టర్స్ మీట్‌లో చంద్రబాబు

దావోస్‌లో జరిగిన సీఐఐ ఇన్వెస్టర్స్ మీట్‌లో చంద్రబాబు మాట్లాడుతూ దావోస్‌లో తాను పదోసారి పర్యటిస్తున్నట్లు చెప్పారు. తానెప్పుడూ ఒక విద్యార్థిలాగనే భావిస్తుంటానని, దావోస్‌లో తాను పర్యటించిన ప్రతీసారీ అనేక విషయాలు నేర్చుకుంటున్నట్లు తెలిపారు. ఏపీలో అపారమైన ఖనిజ సంపద ఉందని, వ్యవసాయ ఉత్పత్తులు, 974 కి.మీ పొడవున సుదీర్ఘ తీరప్రాంతం ఉన్నదని, అన్నింటికీ మించి నైపుణ్యం కలిగిన మానవ వనరులు పుష్కలంగా ఉండటం పెట్టుబడిదారులకు అన్నివిధాలా కలిసొచ్చే అంశమని చంద్రబాబు వివరించారు.

ఈ సందర్భంగా పలువురు పెట్టుబడిదారులు అడిగిన పలు ప్రశ్నలకు చంద్రబాబు ఎంతో ఓపికతో సమాధానాలు చెప్పి, వారిని సంతృప్తి పరచగలిగారు. నవ్యాంధ్రప్రదేశ్ అద్భుతమైన వృద్ధిరేటుతో దూసుకుపోతోందన్నారు. ప్రపంచ సగటు వృద్ధిరేటు 2.5శాతం ఉండగా, భారత్ వృద్ధిరేటు 7.5 శాతం ఉందని చంద్రబాబు తెలిపారు. నవ్యాంధ్ర అంతకంటే మించిన వృద్ధి రేటును నమోదు చేస్తుందన్నారు. రాష్ట్రంలో అభివృద్ధితోపాటు సంక్షేమ కార్యక్రమాలపై కూడ ప్రత్యేక దృష్టి పెట్టామన్నారు. ఉపాధి అవకాశాలను గణనీయంగా పెంచడంలో విజయం సాధిస్తున్నట్లు చెప్పారు.

## ఎయిర్‌బస్‌తో చర్చలు

ఎయిర్‌బస్ సీఇఓతో ముఖ్యమంత్రి చంద్రబాబు చర్చలు జరిపారు. రక్షణ, అంతరిక్ష పరిశోధనా రంగాలకు రాష్ట్రం అనుకూలంగా ఉంటుందన్న విషయాన్ని ఆయన వివరించారు. ఆంధ్రప్రదేశ్‌లో ఉపగ్రహ ప్రయోగ కేంద్రం కూడ ఉన్నదన్నారు. అనంతపురంలో విమానయాన రంగానికి అవసరమైన మౌలిక వసతులు కల్పిస్తామని చంద్రబాబు చెప్పారు. ఎంఆర్ఓ సెంటర్ స్థాపనకు పుట్టపర్తిని పరిశీలించాలని చంద్రబాబు ఎయిర్‌బస్ సీఇఓను కోరారు. భారత్‌లో పెట్టుబడులు పెట్టేందుకు ఆసక్తి చూపించిన ఎయిర్‌బస్ సీఇఓ మరో మూడు నెలల్లో ఏపీలో పర్యటిస్తానని చంద్రబాబుకు హామీ ఇచ్చారు.

## 'హీరో' ప్లాంటుకు త్వరలో శంకుస్థాపన

'హీరో'గ్రూపు అధినేత పవన్ ముంజల్ ముఖ్యమంత్రితో భేటీ అయ్యారు. ఏపీలో నెలకొల్పనున్న తమ నూతన ప్లాంట్‌కు త్వరలోనే శంకుస్థాపన తేదీని ప్రకటిస్తామని తెలిపారు.

## 'అకోనియా ఎనర్జీ' సీఇఓతో భేటీ

మౌలిక సదుపాయాలు, ఇంధన వనరులు, సేవ, నిర్మాణం, నీరు, పరిశ్రమ రంగాలలో ప్రసిద్ధిగాంచి, పునరుత్పాదక విద్యుత్ ఉత్పత్తిలో గ్లోబల్ లీడర్ అయిన స్పెయిన్ దేశానికి చెందిన అకోనియా ఎనర్జీ సంస్థ సీఇఓ రఫియేల్ మాటియో అల్కాలాతో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు భేటీ అయ్యారు. నవ్యాంధ్రలో పునరుత్పాదక విద్యుత్ రంగంలో ఉన్న అవకాశాలను వివరించారు. విద్యుత్‌ప్లాంట్లను స్థాపిస్తే మౌలిక సదుపాయాలు కల్పిస్తామని, అత్యంత వేగంగా అనుమతులు మంజూరు చేస్తామని భరోసా ఇచ్చారు.

## మార్చిలో 'రోత్‌చైల్డ్' సీఎండి రాక

ఇంటర్నేషనల్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకింగ్ రంగంలో పేరుప్రఖ్యాతులు గడించిన ఎన్.ఎం.రోత్ చైల్డ్ అండ్ కంపెనీ ఆటోమోటివ్ సెక్టార్ సీఎండి విలాస్ సెగ్గాల్‌తో ముఖ్యమంత్రి చంద్రబాబు భేటీ అయ్యారు. ఈ సందర్భంగా ఏపీలో అంతర్జాతీయ ప్రమాణాలతో నిర్మిస్తున్న అమరావతి నూతన రాజధాని నిర్మాణంపై ముఖ్యమంత్రి చంద్రబాబు అరూప్ గ్రూప్ ఛైర్మన్‌కు వివరించారు. ఏపీలో పర్యటించమని ఆయన అరూప్ గ్రూప్ ఛైర్మన్‌ను ఆహ్వానించగా, వచ్చే మార్చి నెలలో రావడానికి ప్రయత్నిస్తానని హామీ ఇచ్చారు. అరూప్ గ్రూప్ కంపెనీ 23దేశాల్లో 30 కార్యాలయలతో తన సేవలను విస్తరించి ఉంది. రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టేందుకు ఈ కంపెనీ సీఎండి సెగ్గాల్ కూడ ఆసక్తి చూపారు.

## 'కోకుసై కోగ్యో' సీఇఓతో భేటీ

జపాన్ కంపెనీ అయిన కోకుసైకోగ్యో సీఇఓ సంద్రా ఉ వన్ పిషుతో ముఖ్యమంత్రి చంద్రబాబు భేటీ అయ్యారు. పిషు టోక్యో స్టాక్ ఎక్స్ఛేంజికి మొదటి మహిళా అధ్యక్షురాలిగా వ్యవహరించారు. ప్రస్తుతం ఆమె కోకు సైకోగ్యో కంపెనీకి సీఇఓగా పనిచేస్తున్నారు. ఈ కంపెనీ భౌగోళిక సమాచార వ్యవస్థలో ప్రసిద్ధి చెందింది. భూ ఉపరితల సమాచారాన్ని ఒడిసిపట్టడం, నిల్వ చేయటం, తనిఖీ చేయటం, సమాచారాన్ని ప్రదర్శించటం దీని ప్రత్యేకతలతో కూడిన కంప్యూటర్ వ్యవస్థను ఈ

WORLD
ECONOMIC
FORUM




# దావోస్ వీధుల్లో మన ప్రగతి రథచక్రాలు

ప్రపంచ ఆర్థిక వేదిక (వరల్డ్ ఎకనమిక్ ఫోరం) 46వ సదస్సు నిర్వాహకుల కంటే ముందుంది అతిథులను ఆహ్వానించి ఆకర్షణగా నిలిచింది– ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక ప్రచార రథం! కొండ మొత్తాన్నీ చిన్న అద్దంలో చూపించినట్టు– నవ రాజధాని అమరావతి రూపురేఖలు, సుదీర్ఘమైన సాగర తీరం, రాష్ట్రంలో రెక్కవిప్పిన పారిశ్రామిక రివల్యూషన్– వంటి పోస్టర్లుతో ఏపీ బస్సు దావోస్ రికామీ వీధుల్లో సదస్సు ప్రారంభానికి ముందు నుంచే షికారు చేసింది. ఏపీలో వ్యాపార అవకాశాలు, తిరుగులేని నాయకత్వం, ఆర్థిక లావాదేవీల్లో పారదర్శకత, లోపరహితమైన ప్రణాళిక వంటి సమాచారాన్ని అరటిపండు ఒలిచి పెట్టినట్టు దేశ విదేశీ సంస్థలు ప్రతినిధులకు అందించిందీ బస్సు. 'మేక్ ఆంధ్రప్రదేశ్ యువర్ బిజినెస్' అంటూ ప్రపంచ పెట్టుబడిదారులకు, వాణిజ్యవేత్తలకు పిలుపునిస్తూ చక్కర్లు కొట్టింది. అంతర్జాతీయ సదస్సు జరిగే నగరంలో ఒక రాష్ట్ర ప్రభుత్వానికి బ్రాండింగ్ తెచ్చేందుకు చేస్తున్న ఈ తరహా ప్రయోగం ఇదే తొలిసారి.

ఆంధ్రప్రదేశ్ ఆకర్షణలు, అవకాశాలూ వివరిస్తూ ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక శాఖ వినూత్నంగా ఏర్పాటుచేసిన హోర్డింగులు దావోస్ నగరంలో స్థానికులను ఎంతగానో ఆకట్టుకున్నాయి. రోజుకి పన్నెండు గంటలు పనిచేసేలా ఓ ప్రత్యేక లాంజ్ ని కూడా ఆంధ్రప్రదేశ్ సిద్ధం చేసింది. 'దావోస్ లో ప్రత్యేక ఆఫీసు తెరిచిన ఏకైక ఇండియన్ సీఎం చంద్రబాబే'నని ఆర్బీఐ గవర్నర్ రఘురాం రాజన్ అంతటి వారు ప్రశంసించడం బట్టి, దావోస్ అతిథుల చూపు నవ్యాంధ్ర వైపు తిప్పేలా చేయడానికున్న ప్రతి అవకాశాన్నీ ఆంధ్రప్రదేశ్ అందిపుచ్చుకుందని చెప్పవచ్చు. గత ఏడాది దావోస్ సదస్సులో పాల్గొని విభజనానంతర ఆంధ్రప్రదేశ్ అస్తిత్వాన్ని చాటిన చంద్రబాబు, ఈసారి సదస్సుకు కొత్త వ్యూహాలతో నవ్యాంధ్రని విశాలమైన యవనిక మీద సరికొత్తగా ఆవిష్కరించారు.

కంపెనీ నిర్వహిస్తున్నది.

### జెట్రో సీఎండీతో చంద్రబాబు భేటీ

ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టేందుకు జపాన్ కంపెనీలకు తగు సూచనలు చేయాలని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు జపాన్ ఎక్స్‌టర్నల్ ట్రేడ్ ఆర్గనైజేషన్ (జెట్రో) సంస్థ సీఎండి హిరొాయుకి ఇషిగేకికి విజ్ఞప్తి చేశారు. ఏపీలో పెట్టుబడులు పెడతే ఎలా లాభదాయకమో వివరించారు. జపాన్ కంపెనీలను ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టే విధంగా వ్యూహరచన చేయాలని చంద్రబాబు కోరారు.

### 'అమరావతి' లైటింగ్ వ్యవస్థ

నవ్యాంధ్రప్రదేశ్ నూతన రాజధాని అమరావతి నగరంలో విద్యుద్దీకరణ వ్యవస్థను నెలకొల్పేందుకు తగు ప్రతిపాదనలతో ముందుకు రావాలని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ఎలక్ట్రానిక్స్ రంగంలో ప్రసిది చెందిన ఫిలిప్స్‌కంపెనీని ఆహ్వానించారు. ఫిలిప్స్ కంపెనీ ఎగ్జిక్యూటివ్ వైస్ ప్రెసిడెంట్, బోర్డు సభ్యుడు రోనాల్డ్ డి జాంగ్‌తో ఆయన ప్రత్యేకంగా సమావేశమయ్యారు. ఏపీ సమగ్రాభివృద్ధికోసం చంద్రబాబు పడుతున్న శ్రమ, నిర్విరామంగా చేస్తున్న కృషిని ఈ సందర్భంగా జాంగ్ అభినందించారు. అమరావతి నగరంలో ఇంధనాన్ని ఆదా చేయగలిగే అధునాతన సాంకేతిక వ్యవస్థను ఏర్పాటు చేయడానికి తగిన ప్రతిపాదనలతో ముందుకు రావాలని చంద్రబాబు జాంగ్‌ను కోరారు. వ్యయాన్ని తగ్గించే స్మార్టు పవర్ గ్రిడ్ ఏర్పాటులో సహకరించాలని కోరారు.

వరల్డ్ ఎకనామిక్ ఫోరంలో ఆంధ్రప్రదేశ్ మాత్రమే సొంతంగా ఒక లాంజ్‌ని ఏర్పాటు చేసుకుంది. ఒక రాష్ట్రం ఇలా చొరవ తీసుకోవడం ఇదే ప్రధమం. ఇండియా అంటే ఆంధ్రప్రదేశ్ అనే భావాన్ని దావోస్‌లో కలిగించారు. ఈ గొప్పతనం ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడిదే.

– శేఖర్ గుప్తా, ప్రముఖ జర్నలిస్టు




### పోర్టుల అభివృద్ధికి సిద్ధం

సుదీర్ఘ తీరప్రాంతం, డీప్ పోర్టులు కలిగివున్న నవ్యాంధ్రను లాజిస్టిక్ హబ్‌గా మలచేందుకు ముందుకు రావాలని బెల్జియంకు చెందిన యాంట్వెర్ప్ పోర్టు అథారిటీ సీఇఓ బ్రూనిక్స్‌కు ముఖ్యమంత్రి చంద్రబాబు విజ్ఞప్తి చేశారు. దావోస్ సదస్సులో సీఎంతో ఆయన భేటీ అయ్యారు. పోర్టులను కేవలం సరుకుల రవాణాకోసమే పరిమితం కాకుండా, బహుళ ప్రయోజనాలకు వినియోగపడేలా ప్రణాళికలు సంసిద్ధం చేస్తున్నామని బ్రూనిక్స్ ముఖ్యమంత్రికి తెలియజేశారు.

### రీఇన్సూరెన్స్ ఎండీ మార్టిన్ భేటీ

ముఖ్యమంత్రి చంద్రబాబుతో రీఇన్సూరెన్స్ కంపెనీ 'స్విస్‌రె' ఎండీ మార్టిన్ పార్కర్ భేటీ అయ్యారు. తుపాను వైపరీత్యాలతో వాటిల్లే నష్టాలకు బీమా సౌకర్యం కల్పించడంపై మార్టిన్ ఆసక్తి చూపించారు. భారత ప్రభుత్వం తాజాగా ప్రవేశపెట్టిన పంటల బీమా పథకాన్ని పరిశీలించాలని ఈ సందర్భంగా చంద్రబాబు ఆయనకు సూచించగా, నిర్దిష్టమైన ప్రతిపాదనలతో రాష్ట్రానికి వస్తామని మార్టిన్ హామీ ఇచ్చారు.

### ఏషియన్ బ్యాంకు సహకారం

ముఖ్యమంత్రి చంద్రబాబుతో ఏషియన్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకు ప్రెసిడెంట్ జిన్ లికున్ భేటీ అయ్యారు. సరికొత్త ప్రాజెక్టులతో ముందుకు వస్తున్నామని, మీ వద్ద ప్రాజెక్టులు సిద్ధంగా ఉంటే ఆర్థిక సహకారం అందిస్తామని కూడ ఆయన సీఎంకు హామీ ఇచ్చారు. భారత్ తమకు అత్యంత ప్రాధాన్యతగల దేశమని తెలిపారు. అందులో ఏపీకి ప్రథమస్థానం ఇస్తామని హామీ ఇచ్చారు. రాష్ట్రానికి త్వరలోనే ఏఐఐబీ ప్రతినిధి బృందాన్ని పంపి, అధ్యయనం చేయనున్నట్లు ఆయన సీఎంకు తెలిపారు.

### 'విప్రో'అధినేతతో చంద్రబాబు భేటీ

విప్రో అధినేత అజీం ప్రేమ్‌జీతో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు భేటీ అయ్యారు. ఆయనతో పాటు అతని తనయుడు రిషబ్ కూడ ఉన్నారు. రాష్ట్రంలో అమలవుతున్న స్మార్ట్ విలేజ్, స్మార్ట్ వార్డ్ కార్యక్రమాల గురించి చంద్రబాబు వారికి వివరించారు. దేశానికే ఆదర్శంగా అమలు చేస్తున్న 'ఇ–ప్రగతి' కార్యక్రమంలో భాగస్వాములు కావాలని చంద్రబాబు ప్రేమ్‌జీని కోరారు.

### 'రోనాల్డ్ బర్గర్' సీఇఓ సీఎంతో భేటీ

రోనాల్డ్ బర్గర్ కంపెనీ గ్లోబల్ సీఇఓ చార్లెస్ ఎడ్వర్డ్ ముఖ్యమంత్రి చంద్రబాబుతో భేటీ అయ్యారు. ఈ సందర్భంగా ఏరో స్పేస్, రక్షణ రంగాల్లో తమ ప్రతిభను సీఎంకు వివరించారు. ఏపీలో ఈ రంగాలలో పెట్టుబడులు పెడతామని సీఎంకు ఆయన హామీ ఇచ్చారు. అమరావతిని సందర్శించాలని చంద్రబాబు చార్లెస్‌ను ఆహ్వానించారు. చంద్రబాబుతో హ్యులెట్ ప్యాకార్డ్ ఎగ్జిక్యూటివ్ వైస్ ప్రెసిడెంట్ మైక్ నెఫ్‌కెన్ కూడ భేటీ అయ్యారు.

### 'అమరావతి'కి సహకరించండి

నవ్యాంధ్ర నూతన రాజధాని అమరావతి మహానగర నిర్మాణానికి సహకరించాలని 'జైకా' సంస్థ ప్రెసిడెంట్ షిన్ని కిటోకాకు ముఖ్యమంత్రి చంద్రబాబు విజ్ఞప్తి చేశారు. అమరావతిని సందర్శించాలని ఆయన కిటోకాను కోరగా అందుకు ఆయన అంగీకరించారు. జపాన్‌కు అమరావతి పెద్ద అవకాశం, అకర్షణ అని వ్యాఖ్యానించారు.

### నవ్యాంధ్రలో ఫైబర్ ఆప్టికల్ ప్రాజెక్టు

నవ్యాంధ్రలో ఫైబర్ ఆప్టికల్ ప్రాజెక్టు ఏర్పాటుకు సిస్కో కంపెనీ సూత్రప్రాయంగా అంగీకరించింది. సిస్కో కంపెనీ ఎగ్జిక్యూటివ్ ఛైర్మన్ జాన్ చాంబర్స్ సీఎం చంద్రబాబుతో భేటీ అయ్యారు. ఈ సందర్భంగా నవ్యాంధ్రలో ప్రతీ ఇంటికీ ఆప్టికల్ ఫైబర్ కనెక్షన్ సౌకర్యం కల్పించాలని లక్ష్యంగా పెట్టుకున్నట్లు చంద్రబాబు ఆయనకు తెలిపారు. ఈ ప్రాజెక్టులో సహకరించమని కోరగా, ఉభయ పక్షాల నుంచి ఒక సంయుక్త కార్యాచరణ బృందాన్ని ఏర్పాటు చేసుకుందామని చాంబర్స్ సూచించారు.

### రక్షణ, సౌరవిద్యుత్ రంగాలలో 'సన్‌గ్రూప్' పెట్టుబడులు

నవ్యాంధ్రలో రక్షణ ఉత్పత్తులు, సౌరవిద్యుత్, పట్టణ మౌలిక సదుపాయాల రంగాలలో పెట్టుబడులు పెట్టేందుకు రష్యాకు చెందిన సన్ గ్రూప్ సంస్థ అంగీకరించింది. త్వరలో సమగ్రమైన నివేదికలతో వస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబుకు ఆ సంస్థ హామీ ఇచ్చింది. సన్‌గ్రూప్ సంస్థ ఛైర్మన్ విక్రమ్ ఖేమ్కా చంద్రబాబుతో ప్రత్యేకంగా భేటీ అయ్యారు.

### మెడికల్ హబ్‌కు సహకారం

ఫోర్టీస్ కంపెనీకి చెందిన మల్వీందర్‌సింగ్‌తో ముఖ్యమంత్రి చంద్రబాబు భేటీ అయ్యారు. ఏపీని మెడికల్ హబ్‌గా తీర్చిదిద్దేందుకు ప్రణాళికలు రూపొందిస్తున్నామని, అందువల్ల ఈ రంగంలో పెట్టుబడులు పెట్టాలని సింగ్‌ను చంద్రబాబు కోరారు. అందుకు ఆయన సానుకూలంగా స్పందించారు. సేల్స్ ఫోర్స్‌కంపెనీ ఎగ్జిక్యూటివ్ వైస్ ప్రెసిడెంట్ వివేక్ కుంద్రా కూడ చంద్రబాబుతో భేటీ అయ్యారు.

– దబ్బీరు రామకృష్ణ పట్నాయక్

WORLD ECONOMIC FORUM

# దావోస్ దృశ్యమాలిక

1. దావోస్ ప్రపంచ ఆర్థిక వేదిక సమాలోచనల్లో పాల్గొన్న ఏకైక ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడే
2. జ్యురిక్‌లో దిగిన తొలిరోజు, ముఖ్యమంత్రికి స్వాగతం పలుకుతున్న ప్రవాసాంధ్రులు
3. విదేశీ వ్యాపార బృందంతో చర్చలు
4. టాటా గ్రూప్ చైర్మన్ సైరస్ మిస్త్రీతో చర్చలు
5. భారత ఆర్థికశాఖ మంత్రి అరుణ్ జైట్లీతో ముఖ్యమంత్రి
6. ఎటు చూసినా ఆంధ్రప్రదేశ్ హడావుడే... దావోస్‌లో సొంత లాంజ్‌ని కూడా ఏర్పాటుచేసుకున్న ఒకేఒక రాష్ట్రం ఏపి
7. ఊపిరిసలపని సమావేశాల నడుమ, సహచరులతో మాటామంతీ
8. లాక్‌హీడ్ మార్టిన్ సిఈఓ మార్లిన్ హ్యుసన్‌తో సమావేశం. రాష్ట్రంలో తమ ప్లాంటు ఏర్పాటుకు సంబంధించి చర్చలు.
9. విప్రో చైర్మన్ అజీమ్ ప్రేమ్‌జీతో ముఖ్యమంత్రి, ఆయన బృందం భేటి












WORLD ECONOMIC FORUM

# ప్రపంచదేశాలతో పోటీపడే సత్తా మాకే ఉంది

## ప్రపంచ ఆర్థిక సదస్సు లో ముఖ్యమంత్రి చంద్రబాబు


శ్రీలంక ప్రధాని రణిల్ విక్రమసింఘేతో ముఖ్యమంత్రి

అభివృద్ధిలో ప్రపంచ దేశాలతో పోటీపడే సత్తా నవ్యాంధ్రప్రదేశ్‌కే ఉంది. వినూతన ఆలోచనాశైలితో పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు రావాలి. మా రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టడానికి అన్నివిధాలా అనువైన వాతావరణం ఉంది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోండి అని ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు పిలుపునిచ్చారు. దావోస్‌లో ఇటీవల జరిగిన ప్రపంచ ఆర్థిక వేదిక 46వ, సదస్సులో వ్యాపార అనుకూల వాతావరణం' అనే అంశంపై జరిగిన చర్చలో చంద్రబాబూ ప్రసంగించారు.

"పట్టణాభివృద్ధి భవిష్యత్-సేవలు' అనే అంశంపై జరిగిన స్టీరింగ్ కమిటీ సమావేశంలో సీఎం చంద్రబాబు మాట్లాడారు. విభజన తర్వాత రాష్ట్రం ఎదుర్కొంటున్న సవాళ్ళు, సంక్షోభాన్ని అవాకాశంగా తీసుకుని పనిచేస్తున్న తీరును, నూతన రాజధాని నిర్మించేందుకు, అమరావతి నగరాభివృద్ధికి ఉత్తమ విధానాలను తెలియజేయాలని, ఉత్తమ విధానాలు సూచించినవారి పేర్లను శాశ్వతంగా ఉండేలా శిలాఫలకాలపై లిఖిస్తామని చంద్రబాబు ఆహ్వానితులను కోరారు.

### ఏపీ పర్యాటకంపై శ్రీలంక ఆసక్తి

ఆంధ్రప్రదేశ్ పర్యాటక రంగంలో విస్తృత అవకాశాలను అన్వేషించేందుకు శ్రీలంక ప్రభుత్వం ఆసక్తిని ప్రదర్శించింది. దావోస్ రెండవ రోజు సదస్సులో పారిశ్రామిక వేత్తలతో విస్తృతంగా చర్చలు జరిపారు.

శ్రీలంక ప్రధాని విక్రమ్‌సింఘేతో ముఖ్యమంత్రి చంద్రబాబు భేటీ అయ్యారు. చిన్నదేశమైనా అభివృద్ధిలో ముందడుగు వేస్తున్న శ్రీలంక దేశం పర్యాటక రంగంపై అత్యధిక ఆదాయాన్ని ఆర్జిస్తున్న క్రమంలో... ఏపీ పర్యాటక రంగం అభివృద్ధి లో పెట్టుబడులు పెట్టాలని చంద్రబాబు శ్రీలంక ప్రధానికి విజ్ఞప్తి చేశారు.

పర్యాటక రంగం అభవృద్ధికి ఏపీలో ఉన్న అనుకూలాంశాలను ముఖ్యమంత్రి చంద్రబాబు శ్రీలంక ప్రధానికి వివరించారు. మరో పర్యాయం భేటీ అయినప్పుడు ఈ అంశంపై విస్తృతంగా చర్చించాలని నిర్ణయించారు. ఏపీలో పర్యాటక రంగంలో నూతన అవకాశాలను పరిశీలిస్తామని సింఘే హామీ ఇచ్చారు.

### దావోస్ పర్యటనలో విశేషాలు

- దావోస్ పర్యటనలో సింగపూర్ జాతీయ విశ్వవిద్యాలయం ఆచార్యుడు కిశోర్ మెహబూబా ముఖ్యమంత్రితో భేటీ అయ్యారు. ప్రభుత్వం అమలు చేస్తున్న విధానాలు, వాణిజ్యం, పోటీ తత్వంలో నవ్యాంధ్రకు ఉన్న అవకాశాలపై పరిశోధిస్తున్నట్లు తెలిపారు. తమ పరిశోధనలపై త్వరలో ఒక నివేదిక కూడ సమర్పించనున్నట్లు మెహబూబా సీఎంకు తెలిపారు. అంతర్జాతీయ స్థాయిలో పది ఉత్తమ గమ్యస్థానాలలో నవ్యాంధ్రప్రదేశ్ ప్రథమ స్థానంలో నిలిచేలా విధాన నిర్ణయాలలో తగు సూచనలు ఇవ్వాలని కోరారు. ఏపీని విద్యా, వైజ్ఞానిక కేంద్రంగా తీర్చిదిద్దేందుకు 'లీక్వాన్ యూ స్కూల్ ఆఫ్ పబ్లి పాలసీ-సింగపూర్' దేశం ముందుకు వచ్చింది.
- టాటా గ్రూపు ఛైర్మన్ సైరస్ మిస్త్రీ ముఖ్యమంత్రి చంద్రబాబుతో భేటీ అయ్యారు. ఆంధ్రప్రదేశ్‌లో వివిధ రంగాలలో పెట్టుబడులు పెట్టేందుకు మిస్త్రీ ఆసక్తి చూపారు. తెలుగువారి వంటకాలు, పచ్చళ్ల గురించి మిస్త్రీ ఆరా తీసారు.
- స్కాన్ ఫోర్డ్ విశ్వవిద్యాలయ విద్యార్థులతో ముఖ్యమంత్రి చంద్రబాబు ముచ్చటించారు.
- వృత్తి నైపుణ్య సేవల్లో ప్రఖ్యాతి గాంచిన కేపీఎంజీ ప్రతినిధులతో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు చర్చలు జరిపారు.
- కేంబ్రిడ్జి ఉపకులపతి సర్ లెజెక్ బోరీ సూయిజ్‌తో కూడ ముఖ్యమంత్రి భేటీ అయ్యారు. పరస్పర సహకారంపై సమగ్ర అధ్యయనానికి 18మంది పరిశోధకులను పంపనున్నట్లు సూయిజ్ సీఎంకు హామీ ఇచ్చారు.
- దావోస్‌లోశ్రీలంక ప్రధాని రణిల్ విక్రం సింఘే, అక్కడ ఆర్థిక మంత్రి రవి కరుణనాయకేలతో ముఖ్యమంత్రి భేటీ అయ్యారు, రాష్ట్రంలో పర్యాటక అవకాశాలపై విక్రం సింఘే ఆసక్తి చూపారు.
- బెల్జియం యువరాణి కూడ చంద్రబాబుతో ప్రత్యేకంగా భేటీ అయ్యారు.
- నెస్లే సీఇఓ పాల్ బుల్కే చంద్రబాబును కలిసి పాడి పరిశ్రమ, ఆహారశుద్ధి రంగాల్లో పెట్టుబడులు పెట్టేందుకు ఆసక్తి కనబరిచారు.
- శ్రేయ్ ఇంటర్నేషనల్ ఎండీ హమంత్ కనోరియాతో ముఖ్యమంత్రి చంద్రబాబు భేటీ అయ్యారు. మౌలిక వసతులు, తయారీ రంగాలకు అవసరమైన ఎక్విప్‌మెంట్ బ్యాంక్ ఏర్పాటు చేసేందుకు ప్రణాళిక రూపొందించాలని చంద్రబాబు కనోరియాకు విజ్ఞప్తి చేశారు.





వ్యవసాయరంగాన్ని సంక్షోభం నుంచి గట్టెక్కించేందుకు కృషిచేస్తున్నామని ముఖ్యమంత్రి చెప్పారు. కేంద్రం ఇటీవల ప్రవేశపెట్టిన బీమా పథకం వల్ల రూ. 8,800 కోట్ల మేరకు రైతులకు లబ్ధి చేకూరనున్నట్లు, భవిష్యత్‌లో ఈ బీమా పథకాన్ని మరింత కట్టుదిట్టంగా అమలు చేయనున్నట్లు ఆయన చెప్పారు.

# కేంద్ర 'బీమా' పథకంతో రైతన్నలకు మంచిరోజులు

## బీమా వల్ల రైతులకు రూ.8,800కోట్ల మేరకు లబ్ధి

కేంద్ర ప్రభుత్వం రైతులకోసం కొత్తగా అమలు చేస్తున్న బీమా పథకంవల్ల అన్నంపెట్టే రైతన్నలకు మంచిరోజులు వచ్చినట్టేనని నవ్యాంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు వ్యాఖ్యానించారు. రైతుల ప్రయోజనాలను కాపాడే ఈ బీమా పథకం ద్వారా వారిలో మరింత విశ్వాసాన్ని, భరోసాను కల్పించడం అభినందనీయమన్నారు. ఖరీఫ్ సీజన్‌లో 2శాతం, రబీ సీజన్‌లో 1.5 శాతం వంతున మొత్తం 3.5 శాతం మేరకు బీమా వర్తించడం, ఆన్‌లైన్ చెల్లింపులు, పూర్తి స్థాయిలో బీమా సదుపాయం కల్పించడం హర్షణీయమన్నారు. ఈ బీమా పథకం వల్ల రూ. 8,800 కోట్ల మేరకు రైతులకు లబ్ధి చేకూరనున్నట్లు చెప్పారు.

అన్నదాతల సంక్షేమమే ప్రధాన లక్ష్యంగా తమ ప్రభుత్వం రైతుల ప్రయోజనాలకోసం త్రికరణ శుద్ధితో పనిచేస్తున్నదన్నారు. వ్యవసాయరంగాన్ని సంక్షోభం నుంచి గట్టెక్కించేందుకు కృషిచేస్తున్నామన్నారు. చిత్తూరు జిల్లాలోని తన స్వగ్రామమైన నారావారిపల్లెను సంక్రాంతి వేడుకల సందర్భంగా జనవరి14న చంద్రబాబు సందర్శించారు. నారావారిపల్లెలో విలేకర్లతో ఆయన మాట్లాడుతూ రాబోయే భవిష్యత్‌లో ఈ బీమా పథకాన్ని మరింత కట్టుదిట్టంగా అమలు చేయనున్నట్లు చెప్పారు. రైతులకు రుణాలను సకాలంలో ఇస్తున్నామని, దేశంలోనే కనీవినీ ఎరుగని రీతిలో రుణమాఫీ పథకాన్ని అమలు చేస్తున్నామన్నారు. లాభసాటి వ్యవసాయం ద్వారా రైతన్నల జీవణ ప్రమాణాలను మెరుగుపరుస్తామన్నారు. అధికారులు, రైతులు పరస్పరం సమన్వయంతో మెలగాలని సూచించారు. కౌలు రైతులు తమ సామర్థ్యానికి తగినట్టుగా భూమిని కౌలుకు తీసుకోవాలని సూచించారు.

### పదిలక్షల కుంటల నిర్మాణం

పంట సంజీవని పథకం కింద పది లక్షల కుంటలు నిర్మిస్తామన్నారు. వర్షాకాలంలో ఆ కుంటలు నీటిని రీచార్జి చేయడానికి ఉపయోగపడతాయని చంద్రబాబు తెలిపారు. నీటి వినియోగంలో దుబారాను తగ్గించుకుని ఈ వనరులను పెంచుకోవచ్చున్నారు.

### గ్రామసీమల అభివృద్ధికి బాటలు

దేశ, విదేశాలలో ఎక్కడెక్కడో జీవిస్తున్న ప్రవాసాంధ్రులంతా గ్రామసీమల ప్రగతికి దోహదపడాలని చంద్రబాబు పిలుపునిచ్చారు. తమ స్వగ్రామాల సమగ్రాభివృద్ధికి బాటలు వేయాలన్నారు. ఈ ఏడాది స్మార్ట్ విలేజ్, స్మార్ట్ వార్డు కార్యక్రమాలతో ముందుకు సాగుతున్నామన్నారు. గతంలో ఎన్నడూ లేని విధంగా ప్రతీ ఒక్కరూ పల్లెలకు వచ్చారని, వచ్చే ఏడాది సంక్రాంతి నాటికి విదేశాల్లో గల తెలుగువారంతా పల్లె బాట పట్టాలని పిలుపునిచ్చారు. తమతమ సొంత గ్రామాలకు కొంతయినా మేలు చేసి జన్మభూమి రుణం తీర్చుకోవాలని చంద్రబాబు కోరారు.

### బ్రహ్మణి నారావారిపల్లె దత్తత

తమ కోడలు బ్రహ్మణి నారావారిపల్లెను దత్తత తీసుకున్నదని, ప్రాధాన్యతాక్రమంలో తమ గ్రామ సమగ్రాభివృద్ధికి చర్యలు తీసుకుంటున్నారని ముఖ్యమంత్రి చంద్రబాబు చెప్పారు. నైపుణ్యం, సమర్థత ఉంటే డబ్బులేనప్పటికీ అభివృద్ధి సాధించడం అంత కష్టమేమీ కాదన్నారు.

### కుటుంబసభ్యులతో చంద్రన్న సంక్రాంతి

ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు తన కుటుంబసభ్యులతో కలిసి సంక్రాంతి వేడుకలను ఘనంగా జరుపుకున్నారు. మూడు రోజులపాటు ఈ వేడుకల్లో పాల్గొన్నారు. భోగి రోజున నారావారిపల్లె చేరుకున్న చంద్రబాబు, మరునాడు సంక్రాంతి రోజున మధ్యాహ్నం తన సతీమణి భువనేశ్వరీదేవి, తనయుడు లోకేష్, కోడలు బ్రహ్మణి, సోదరి హైమావతితో కలిసి ఇంటి ముందు ఉన్న దివంగత మాజీ ముఖ్యమంత్రి ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలలు వేసి, ఘనంగా నివాళులర్పించారు.

❖

## కొత్త పేరు... కొత్త స్ఫూర్తి!

# జన చైతన్యానికే జన్మభూమి


జన్మభూమి కార్యక్రమంలో స్వయంగా పాల్గొంటున్న ముఖ్యమంత్రి

కదులుదాంరండి మనం జన్మభూమికై - తల్లి పాల రుణం కాస్త తీర్చుదానికై... అంటూ పాటతో మొదలైన జన్మభూమి కార్యక్రమాన్ని 1997 జనవరి 1న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రారంభించారు. తెలుగు జాతి చరిత్రలో సువర్ణాధ్యాయానికి శ్రీకారం చుట్టిన ప్రజా ఉద్యమం అది. ప్రజల భాగస్వామ్యంతో గ్రామ, గ్రామాన చైతన్యం వెల్లివిరిసి వ్యక్తిగతంగా, సమిష్ఠిగా ప్రజలందరూ అభివృద్ధికి తమ వంతు కృషి చేసే ఈ మహోన్నత కార్యక్రమం 1997 నుండి 2004 మధ్య రైతులు, మహిళలు, బడుగు బలహీన వర్గాల ప్రజల కోసం 19 విడతలలో సాగింది. సమాజ పునర్నిర్మాణానికి ఉపయోగపడే త్యాగనిరతి, నిరంతర కృషి, ఆత్మగౌరవం, కష్టించి పనిచేయడం, సమానత్వం, చురుకైన భాగస్వామ్యం, పారదర్శకత, జవాబుదారితనం మొదలైన విలువలు జన్మభూమి ప్రత్యేకతలు. జన్మభూమి కేవలం ప్రభుత్వ కార్యక్రమం కాదు. ప్రజల భాగస్వామ్యంతో కొనసాగే నిరంతర పక్రియ ఇది. అయితే ఈ మహోన్నత కార్యక్రమం గత ప్రభుత్వ హయాంలో ఆగిపోయింది.

రాష్ట్ర విభజన అనంతరం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన చంద్రబాబు నాయుడు 'జన్మభూమి- మా ఊరు' పేరిట మళ్ళీ జన్మభూమి కార్యక్రమాన్ని ప్రజల ముందుకు తీసుకొచ్చారు.

### కొత్త పేరు... కొత్త స్ఫూర్తి!

పాత పథకానికి కాస్త పేరు మార్చడం- కొత్త సీసాలో పాత సారా కాదనీ, 2014 గాంధీ జయంతి రోజు తిరిగి ప్రారంభమైన 'జన్మభూమి- మా ఊరు' స్ఫూర్తిదాయకంగా చాటి చెబుతోంది. రాష్ట్రంలోని ప్రతి ఒక్కరికి మెరుగైన జీవనాన్ని సమకూర్చే లక్ష్యంతో చేపట్టిన జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ప్రతి సారి అన్ని గ్రామ పంచాయితీలలో, మున్సిపాలిటీలలో, పట్టణాలలో, వార్డులలో గ్రామ సభలు నిర్వహించి ప్రజలు తమ అవసరాలను గుర్తించి వాటికి ప్రాధాన్యతలు నిర్ణయించడం ద్వారా ప్రభుత్వ వాటి పరిష్కారానికి కృషి చేస్తుంది. చంద్రబాబు ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత 2014 అక్టోబర్2 నుంచి నిర్వహించిన మొదటి జన్మభూమి కార్యక్రమంలో 12,676 గ్రామాల్లో 3,387 వార్డులలో గ్రామ సభలు నిర్వహించారు. రాష్ట్ర వ్యాప్తంగా 90% పైగా, గ్రామాల్లో, వార్డుల్లో గ్రామ సభలు పూర్తి చేయడం జరిగింది. ఉచిత వైద్య శిబిరాలు ద్వారా 1,48,394 మందికి వైద్య పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు అందించారు. వివిధ గ్రామాలలో నిర్వహించిన వెటర్నరి క్యాంపులు ద్వారా 1,72,363 పశు వులకు పరీక్షలు చేసి మందులు అందించారు. పొలం పిలుస్తుంది కార్యక్రమం క్రింద 1,59,602 భూసార పరీక్ష పత్రాలను రైతులకు అందించారు. బడి పిలుస్తుంది కార్యక్రమంలో ఇంత వరకు బడిలో చేరని 41,825 మంది పిల్లలను, బడిలో చేరి చదువు మానేసిన 14,460 మంది పిల్లలను గుర్తించడమైంది. పేదరికంపై గెలుపు కార్యక్రమంలో 12,15,939 మంది స్వయం సహాయక బృందాల సభ్యులను నైపుణ్యత పెంపొందించడానికి గుర్తించడమైంది. స్వచ్ఛాంధ్ర కార్యక్రమంలో మరుగుదొడ్ల నిర్మాణం కోసం 18,92,382 కుటుంబాలను గుర్తించారు. నీరు చెట్టు పథకం క్రింద 54,131 నీటి కుంటలను మరమ్మతులు చేయటం కోసం గుర్తించారు.

### వెబ్ సైట్‌లో జన్మభూమి సమాచారం

గత రెండు విడతల జన్మభూమి కార్యక్రమంలో సమస్యలు,అర్జీల పరిష్కారానికి కృషి చేసి గత జులై 2015 నుండి జన్మభూమి దరఖాస్తుల పరిష్కార పురోగతిని 'మీ కోసం' వెబ్ సైట్ లో వుంచి ఉన్నతాధికారులు స్వయంగా పర్యవేక్షించారు. దీని ప్రకారం మొదటి,రెండు విడతల సమస్యల అర్జీల పరిష్కారంలో 95% పరిష్కారం అయ్యాయి. మొత్తం 34,87,546 అర్జీలను స్వీకరించగా 33,36,557 అర్జీలను పరిష్కరించడం జరిగింది. **core.ap.gov.in** వెబ్ సైట్ లో జన్మభూమి అర్జీల పరిష్కార సమాచారం అందరికీ అందుబాటులో వుంచబడింది. గత రెండు జన్మభూమి కార్యక్రమాలలో అత్యధికంగా రెవెన్యూ

ఒకేసారి 8,000 మందితో టెలికాన్ఫరెన్స్ నిర్వహించి ప్రజా సంక్షేమం,అభివృద్ధే ధ్యేయంగా ప్రభుత్వ పథకాలన్నీ ప్రజలకు చేరే విధంగా జన్మభూమి కార్యక్రమాన్ని నిబద్ధతతో కొనసాగించి అన్ని వర్గాల ప్రజల సమస్యలు తీర్చడమే ఎజెండాగా జన్మభూమి కార్యక్రమాన్ని నిర్వహించాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆదేశించారు.

విభాగంలో 13,43,286 అర్జీలు రాగా వాటిలో 13,6,726 దరఖాస్తులపై తగు చర్యలు తీసుకొని లోపాలను సారి చేయడం జరిగింది. ఇందులో దాదాపు 97.28% పరిష్కారం అయ్యాయి. ప్రజా పౌర సరఫరాల శాఖలో 7,25,371 దరఖాస్తులు రాగా 6,98,518 దరఖాస్తులు పరిష్కరించబడ్డాయి. దాదాపు 96.30% పరిష్కారం అయ్యాయి. రాష్ట్రంలో అత్యధికంగా కృష్ణా జిల్లాలో 5,80,248 అర్జీలు రాగా 5,76,752 అర్జీలు పరిష్కారం అయ్యాయి. పరిష్కార క్రమంలో 99.40%తో కృష్ణా జిల్లా మొదటి స్థానంలో వుంది. అదేవిధంగా, ప్రకాశం, అనంతపురం, పశ్చిమ గోదావరి, విజయనగరం, కర్నూలు, శ్రీకాకుళం జిల్లాలు 95% పైగా సమస్యల అర్జీలు పరిష్కారం అయ్యాయి. ఒక్క గుంటూరు జిల్లాలో మాత్రమే 88.73% అర్జీలు పరిష్కారం అయ్యాయి.

నవ్యాంధ్రలో చంద్రబాబు ప్రభుత్వం ఏర్పడిన తరువాత మూడో విడత జన్మభూమి కార్యక్రమం 2016 జనవరి 2 నుంచి ప్రారంభించారు. స్మార్ట్ విలేజ్, స్మార్ట్ వార్డు, ప్రభుత్వ పథకాలు వాటి అమలు తీరు, 43.74 లక్షల మందికి ఫించనులు, 12,43,000 మందికి రేషన్ కార్డుల పంపిణీ, ఈ-పోస్ సమర్ధవంతంగా అమలు, కొత్త ఇళ్ల మంజూరు, భూమి రికార్డులు డిజిటలైజేషన్, అంతర్గత రోడ్లు, డ్రైనేజి గ్రామీణ నీటి పారుదల పనులు, ఎన్‌టిఆర్ జలసిరి కార్యక్రమం కింద లక్ష బోర్లు, ఆరోగ్య పశు వైద్య శిబిరాల నిర్వహణ ఈ జన్మభూమి కార్యక్రమంలో చేపట్టారు. రాష్ట్రంలోని 12,918 గ్రామ పంచాయితీలు, 670 మండలాలు, 111 మున్సిపల్ కార్పొరేషన్లు, మున్సిపాలిటీలలోని 3,393 వార్డులలో జన్మభూమి నిర్వహించారు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు. జన్మభూమి కార్యక్రమాన్ని సభలను ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించారు. ప్రజల్లో నిరంతరం వుండేందుకు ప్రజా సమస్యలు పరిష్కరించేందుకు,ప్రజలలో నిరంతరం వుండేందుకు అధికారాల్లో జవాబుదారీ పెంచేందుకు ఈ కార్యక్రమాన్ని ఉపయోగించారు. ముఖ్యమంత్రి చంద్రబాబు కూడా ఎక్కువ సభల్లో పాల్గొని ప్రజల్లో ఉత్సాహాన్ని నింపేందుకు ప్రయత్నం చేశారు.

'జన్మభూమి- మాఊరు' కార్యక్రమంపై ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, మంత్రులు, కలెక్టర్లు, అధికారులు, పార్టీ నాయకులు జన్మభూమి కమిటీ సభ్యులతో ఒకేసారి 8,000 మందితో టెలికాన్ఫరెన్స్ నిర్వహించి ప్రజా సంక్షేమం,అభివృద్ధే ధ్యేయంగా ప్రభుత్వ పథకాలన్ని ప్రజలకు చేరే విధంగా జన్మభూమి కార్యక్రమాన్ని నిబద్ధతతో కొనసాగించి అన్ని వర్గాల ప్రజల సమస్యలు తీర్చడమే ఎజెండాగా జన్మభూమి కార్యక్రమాన్ని నిర్వహించాలని ఆదేశించారు.

జిల్లా స్థాయి నుండి మండల స్థాయి వరకు కమిటీలను ఏర్పాటు చేశారు. జన్మభూమి కార్యక్రమం పర్యవేక్షణకు సీనియర్ ఐఎఎస్, ఐఎఫ్ఎస్ అధికారులను జిల్లా ఇంచార్జుగా నియమించారు. ఒక్కో రెవెన్యూ డివిజన్ కు ఒక్కో సీనియర్ అధికారి చొప్పున 51 మంది అధికారులకు బాధ్యతలు అప్పగించారు. త్రాగునీరు, పారిశుద్ధ్యం , స్వచ్ఛ ఆంధ్రప్రదేశ్, పచ్చదనం, నీటి సంరక్షణ నిర్మాణాలకు సంబంధించిన పనులు జన్మభూమిలో చేపట్టేందుకు ఒక్కో జిల్లాకు కోటి రూపాయల చొప్పున 13 జిల్లాలకు రూ.13 కోట్లు కేటాయించారు. గ్రామాలు, పట్టణాల్లోని వార్డుల్లో బేస్ లైన్ సర్వే 20 రాజీలేని అంశాలపై గ్రామాభివృద్ధి, వార్డు అభివృద్ధి, ప్రణాళికలు, వనరులు, జియోట్యాగింగ్, ప్రభుత్వపథకాల అమలు, ఫించన్ల పంపిణీ, కొత్త రేషన్ కార్డులు, ఇళ్ల మంజూరు వంటి కార్యక్రమాలు నిర్వహించారు. స్మార్ట్ విలేజ్, స్మార్ట్ వార్డు అభివృద్ధి పై ప్రభుత్వం ఎక్కువగా దృష్టి సారించింది. పలు గ్రామాలను దత్తత తీసుకునేందుకు పలువురు ప్రముఖులు, స్వచ్ఛందంగా ముందుకు వస్తున్నారు. ఇప్పటివరకు 14,094 మంది గ్రామాలను స్మార్ట్ గా తీర్చిదిద్దేందుకు సిద్ధమయ్యారు. స్మార్ట్ విలేజ్,స్మార్ట్ వార్డు అభివృద్ధి పథకం వేగం పుంజుకుంటుంది. రాష్ట్రంలో 12,291 గ్రామ పంచాయితీలు పట్టణ ప్రాంతాల్లో 3,463 వార్డులు వుండగా వీటిని దత్తత తీసుకునేందుకు 14,094 మంది గ్రామ పంచాయితీలను అభివృద్ధి చేసేందుకు జనరల్ పార్టనర్స్ నమోదు కాగా 4050 మంది ఆయా గ్రామాల్లో ఒక్కో విభాగంలో అభివృద్ధి చేసేందుకు దరఖాస్తు చేసుకున్నారు. ప్రతి గ్రామంలో అన్ని వార్డుల్లో ఆకర్షణీయమైన మౌళిక వసతులు, సహజ వనరుల వినియోగం ద్వారా అభివృద్ధి సాధించాలని లక్ష్యంగా పెట్టుకున్నారు.

తెలుగు వారి నుండి విరాళాలు సేకరించి రాష్ట్రంలోని 12,918 గ్రామ పంచాయితీలు, 3,393 వార్డులను అభివృద్ధి చెయ్యాలని ప్రణాళిక రూపొందించారు. ఆకర్షణీయ ఆంధ్రప్రదేశ్ పథకం కింద పెట్టుకున్న 20 రాజీలేని లక్ష్యాలను సాధించడానికి ఈ నిధులు ఉపయోగించనున్నారు. ఈ 20 సూత్రాల అమలుకు ప్రభుత్వం 75% నిధులు సమకూరిస్తే మిగిలిన 25% దాతల నుంచి సేకరిస్తారు. స్మార్ట్ వార్డు,స్మార్ట్ విలేజ్ పథకం అమలుకు రాష్ట్ర స్థాయి నోడల్ ఏజన్సీ బాధ్యతలను స్మార్ట్ ఆంధ్రప్రదేశ్ ఫౌండేషన్ ఏర్పాటుచేసి వారికి అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. రతన్ టాటా, అజీమ్ ప్రేమ్‌జీ, రిలయన్స్ ఫౌండేషన్, జీఎంఆర్ , జీవీకే వంటి ప్రముఖ వ్యక్తులు, సంస్థలు కలుపుకొని ఈ సంస్థను ఏర్పాటు చెయ్యాలని నిర్ణయానికి వచ్చింది. వీరంతా ఫౌండేషన్‌కు సలహాదారులుగా వ్యవహరిస్తారు. వీరు వివిధ కార్పొరేట్ సంస్థల నుంచి సామాజిక బాధ్యత కింద నిధులు సమీకరిస్తారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న స్మార్ట్ విలేజ్, స్మార్ట్ వార్డు కార్యక్రమాలపై అమెరికాలోని పేరుగాంచిన విశ్వవిద్యాలయాలు ఆసక్తి కనబరిచాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయంతో స్మార్ట్ విలేజీల కోసం వారు ఆంధ్రప్రదేశ్‌తో ఒప్పందం కుదుర్చుకోవడం శుభ పరిణామం. ఈ ఒప్పందం వల్ల భవిష్యత్తులో మరిన్ని మంచి కార్యక్రమాలను నిర్వహించేందుకు బలాన్నిస్తాయి. మూడో విడత జన్మభూమి కార్యక్రమంలో ప్రజలంతా ఉత్సాహంగా పాల్గొన్నారు. వివిధ పద్ధతుల్లో ప్రణాళికాబద్ధంగా ప్రజల సమస్యలను పరిష్కరించి ప్రజలకు దగ్గరైంది ప్రభుత్వం.

- నీరుకొండ ప్రసాద్

ఆంధ్రప్రదేశ్ 'రిటైల్' పాలసీ

# ఆకర్షణీయం... ఆదర్శం!

రూ.5,000 కోట్ల పెట్టుబడులు..
20వేల మందికి ఉద్యోగావకాశాలు లక్ష్యంగా...




నవ్యాంధ్రప్రదేశ్ సమగ్రాభివృద్ధికి ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు అమలులోకి తెస్తున్న నూతన విధానాలలో సరికొత్తది- రిటైల్ పాలసీ. భారతదేశంలో ఇదివరకు ఎన్నడూ లేని 'రిటైల్ పాలసీ' ఫలితంగా, రిటైల్ మార్కెట్టు రంగానికి నవ్యాంధ్ర స్వర్గధామం కానుంది. సుమారు 11 లక్షల రిటైల్ స్టోర్స్, మాల్స్ తో రిటైల్ మార్కెట్టులో ప్రస్తుతం 8 శాతం వాటా కలిగి ఉన్న ఆంధ్రప్రదేశ్ సమీప భవిష్యత్తులో దేశంలోనే అగ్రస్థానాన్ని కైవసం చేసుకోనుంది. అంతే కాకుండా, దళారీ వ్యవస్థను పూర్తిగా తుడిచిపెట్టే విధానాన్ని ప్రవేశపెట్టి దేశానికే ఆదర్శం అయ్యింది.

గతంలో పరిశ్రమల, పర్యాటక, మత్స్య రంగాల్లో సరికొత్త విధానాలను ప్రవేశపెట్టిన ముఖ్యమంత్రి ఇప్పుడు విశాఖ భాగస్వామ్య సదస్సు వేదికగా రిటైల్ విధానం ప్రకటించారు. అన్ని రకాల వస్తువులు లభ్యమయ్యే మాల్సుపై కొనుగోలుదారులు ఆసక్తి చూపిస్తున్న నేపథ్యంలో మరింత ప్రోత్సహించేందుకు ప్రవేశ పెట్టిన 'రిటైల్' విధానం వల్ల దళారీ వ్యవస్థ తొలగిపోతుంది. ఇప్పటికే మాల్స్ యాజమాన్యాలు నేరుగా రైతులు, తయారీదారుల నుంచి ఉత్పత్తులను కొనుగోలు చేస్తున్నారు. దీనివల్ల ఉత్పత్తిదారులకు మంచి ధర లభిస్తోంది. కొనుగోలుదారులకూ వస్తువులు తక్కువ ధరలకే లభిస్తున్నాయి. రిటైల్ స్టోర్లలో తాజా చేపలను విక్రయించే పరిస్థితి రావాలని 'రిటైల్ విధానం' ఆవిష్కరణ సందర్భంగా చంద్రబాబు ఆకాంక్షించడం ఆహ్వానించదగ్గ పరిణామం.

## వరస కట్టిన రిటైల్ దిగ్గజాలు

రిటైల్ రంగంలో పెట్టుబడులు పెట్టడానికి వాల్‌మార్ట్, ఫ్యూచర్ గ్రూప్, ఆదిత్య బిర్లా గ్రూప్, అరవింద్ లైఫ్‌స్టైల్స్ వంటి దిగ్గజ సంస్థలు ముందుకు వచ్చాయి. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సమక్షంలో రూ. 1500 కోట్ల పెట్టుబడితో ఏపీలో కార్యకలాపాలు ప్రారంభించే ఒప్పందాలను ఆ సంస్థలు కుదుర్చుకున్నాయి. ఈ పెట్టుబడుల కారణంగా 25వేల ఉద్యోగాలు రానున్నాయని ముఖ్యమంత్రి చంద్రబాబు పేర్కొన్నారు. వాల్‌మార్ట్ ఇండియా సీఈవో కృష్ణయ్యర్, ఫ్యూచర్ గ్రూప్ సీఈవో కిశోర్ బియానీ, ఆదిత్య బిర్లా గ్రూపు సీఈవో విశాఖ్ కుమార్, రహేజా కార్పొరేషన్ అధ్యక్షుడు నీల్ రహేజా, అరవింద్ లైఫ్‌స్టైల్స్ ప్రతినిధి అలోక్ దుబే తదితరులు ఆంధ్రప్రదేశ్ లో రిటైల్ రంగంలో ప్రవేశించేందుకు ఆసక్తి చూపించడం శుభసూచికం.

## రిటైల్ పాలసీపై నోటిఫికేషన్

చిల్లర వర్తక రంగంలో రూ.5,000 కోట్ల పెట్టుబడుల ఆకర్షణే లక్ష్యంగా దేశంలోనే తొలిసారిగా నూతన రిటైల్ విధానాన్ని భాగస్వామ్య సదస్సులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆవిష్కరించింది. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఈ విధాన పత్రాన్ని విడుదల చేశారు. వెంటనే నోటిఫికేషన్‌ను ప్రభుత్వం జారీ చేసింది. రిటైల్ విధానం నోటిఫికేషన్ వెలువడిన నాటి నుంచి ఐదేళ్లు అమల్లో ఉంటుంది. 2020 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో పెద్ద ఎత్తున పెట్టుబడులను ఆకర్షించడమే కాకుండా కొత్తగా 20,000 ఉద్యోగాలను కల్పించాలని ఇందులో నిర్దేశించారు. ఇందులోని ముఖ్యాంశాలివీ...

## ఎవరు అర్హులు

- వార్షిక టర్నోవరు రూ.కోటి అంతకంటే ఎక్కువ ఉన్న చిల్లర వర్తక సంస్థలకు ఈ విధానం వర్తిస్తుంది. అటువంటి సంస్థల్లో అన్ని వేళల్లో కనీసం 10 మంది పూర్తి స్థాయి ఉద్యోగులుండాలి. వస్తువులను తుది వినియోగదారులకు స్టోర్‌ద్వారా గానీ, ప్రత్యక్ష అమ్మకాలద్వారా గానీ (డైరెక్ట్ సెల్లింగ్) ఇ- కామర్స్, ఎం- కామర్స్, టీవీ... ఇలా ఏ పద్ధతుల్లో అమ్మకాలు సాగించే సంస్థలైనా ఉండొచ్చు.

భారతదేశంలో ఇదివరకు ఎన్నడూ లేని 'రిటైల్ పాలసీ' ఫలితంగా, రిటైల్ మార్కెట్టు రంగానికి నవ్యాంధ్ర స్వర్గధామం కానుంది. సుమారు 11 లక్షల రిటైల్ స్టోర్స్, మాల్స్‌తో రిటైల్ మార్కెట్టులో ప్రస్తుతం 8 శాతం వాటా కలిగి ఉన్న ఆంధ్రప్రదేశ్ సమీప భవిష్యత్తులో దేశంలోనే అగ్రస్థానాన్ని కైవసం చేసుకోనుంది.

*రిటైల్ రంగం అభివృద్ధి చెందినా కొన్ని రకాల ఉత్పత్తుల విక్రయాలకే పరిమితమవుతోంది. ఎక్కువమంది కొనుగోలుదారులు కుటుంబ సభ్యులతో సహా మాల్స్ కు వచ్చి కావాల్సిన వాటిని నాణ్యత చూసి మరీ కొనుగోలు చేయాలనే కోరుకుంటున్నారు. ఈ రంగ ప్రాధాన్యాన్ని గుర్తించి ఏపీ ప్రభుత్వం ప్రత్యేక పాలసీ విడుదల చేయడం చరిత్రాత్మక ఘటన. రానున్న 8నెలల్లో మా గ్రూపు సంస్థ 8 నగరాల్లో అధునాతన స్టోర్స్‌ను ఏర్పాటు చేయబోతోంది.*

*– కిశోర్ బియానీ*

*ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలు మాల్స్ ను 24 గంటలపాటూ తెరిచి ఉంచే అవకాశం కల్పిస్తున్నాయి. భారతదేశంలో నిర్ణీత సమయంలోనే తెరిచి ఉంచాల్సి వస్తోంది. ఈ నియంత్రణ తొలగిపోతే కొనుగోలుదారులు తమకు నచ్చిన సమయంలోనే షాపింగ్ చేసుకోవడానికి అవకాశం కలుగుతుంది. ఆర్థిక వ్యవస్థ కూడా మరింత అభివృద్ధి చెందడానికి అవకాశం ఉంటుంది. 24 గంటల షాపింగ్ కారణంగానే దుబాయ్ గణనీయంగా అభివృద్ధి సాధించింది.*

*– కృష్ణయ్యర్*

*చైనాలో సుమారు వంద షాపింగ్ మాల్స్, ఫిలిప్పీన్స్ లో 50 షాపింగ్ మాల్స్ ప్రస్తుతం నిర్మాణంలో ఉంటే 120 కోట్ల జనాభా ఉన్న భారతదేశంలో కేవలం 20లోపే నిర్మితమవుతున్నాయి. దేశంలో వివిధ రకాల పంటల ఉత్పత్తుల్లో 40 శాతం కొనుగోలుదారులకు చేరకుండానే వృథా అవుతున్నాయి. ఈ సమస్యను అధిగమించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటే ధరలు తగ్గుతాయి. అటు రైతులూ లబ్ధి పొందుతారు.*

*– నీల్ రహేజా*

*రోజుకు ఒకట్రెండు గంటలు పనిచేసే అవకాశం కల్పించాలని విద్యార్థులు ఈ రంగ సంస్థలను కోరుతున్నారు. భారతదేశంలోని కార్మిక చట్టాలు అనుమతించకపోవడంతో విద్యార్థులకు ఉపాధి కల్పించలేని పరిస్థితి ఉంది.*

*– విశాఖ్‌కుమార్*

*రాష్ట్ర విభజన అనంతరం ఏర్పడ్డ నూతన ఆంధ్రప్రదేశ్ రిటైలింగ్ వ్యాపారానికి పెద్ద మార్కెట్. ఈ రంగానికి ఏపీ ప్రభుత్వం ఇస్తున్న ప్రోత్సాహం ఎనలేనిది.*

*– అలోక్ దుబే*

- ఆంధ్రప్రదేశ్ షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్ చట్టం–1988 లోని సెక్షన్ 2 (21) లో 'షాప్' అనే నిర్వచనానికి అనుగుణంగా ఏర్పాటైన చిల్లర వర్తక సంస్థ అయి ఉండాలి.

## చిల్లర వర్తకానికి ప్రోత్సాహాలిలా...

- చిల్లర దుకాణాల్లో పనిచేసే మహిళలూ అన్ని షిఫ్టుల్లో పనిచేయడానికి ఆస్కారం కల్పించారు. ఏడాదిలో అన్ని రోజులు చిల్లర దుకాణాలు సెలవు లేకుండా కార్యకలాపాలు నిర్వహించేందుకు అనుమతి ఇస్తారు.
- చిల్లర వర్తకానికి సహకారం కోసం ప్రభుత్వ–ప్రైవేటు భాగస్వామ్య పద్ధతిలో రాష్ట్రవ్యాప్తంగా ప్రపంచ స్థాయి గోదాములు, పంపిణీ కేంద్రాల ఏర్పాటుకు ప్రభుత్వం కృషి చేస్తుంది. దీనికి అవసరమైన భూమిని ఏపీఐఐసీ 33 ఏళ్ల కాలానికి లీజు పద్ధతిలో కేటాయిస్తుంది.
- చిల్లర వర్తక సంస్థల అవసరాలకు అనుగుణంగా ఆధారపడదగిన విధంగా నిరంతర విద్యుత్తును ప్రభుత్వం సరఫరా చేస్తుంది.
- ఈ రంగానికి అవసరమైన మానవ వనరుల తయారీకి ఏపీ స్కిల్‌డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ద్వారా ప్రభుత్వం చర్యలు తీసుకుంటుంది.
- పంపిణీ కేంద్రాలను ప్రజోపయోగ సంస్థలుగా ప్రకటిస్తారు. తద్వారా సమ్మెల ప్రభావం నుంచి తప్పిస్తారు.
- ఈ సంస్థల్లో సమ్మెలు నివారించడానికి వీటిని నిత్యావసర సేవల చట్టం కిందకు తీసుకొస్తారు. కంపెనీ కేంద్రాల్లోని గోదాముల్లో పనిచేసే మహిళలకు అనుకూలంగా పని గంటలు కేటాయించి భద్రత, రక్షణ బాధ్యతలు ఆ సంస్థలు చూసుకోవాలి. అక్కడ పనిచేసేప్పుడే కాకుండా వారంతా ఇంటికి చేరుకునేందుకు వీలుగా సౌకర్యాలు కల్పించాలి.
- ఈ సంస్థల అనుమతులను సింగిల్ డెస్క్ ద్వారా ఇవ్వడంతోపాటు, ప్రభుత్వం వ్యాపార అనుకూల వాతావరణం కల్పిస్తారు. జిల్లా స్థాయిలో కలెక్టరు నోడల్ అధికారిగా అనుమతులు మంజూరు చేస్తారు.
- ఈ రంగంలో రూ100కోట్ల పెట్టుబడి, 2వేల మందికి ఉపాధితో ముందుకు వచ్చే సంస్థలను మెగా ప్రాజెక్టులుగా గుర్తిస్తారు. ఈ ప్రాజెక్టులకు మరిన్ని రాయితీలు, సదుపాయాలను ప్రభుత్వం కల్పిస్తుంది.

## రిటైల్ రంగానికి గొప్ప ప్రోత్సాహం

24 గంటలూ తెరచి ఉంచే అవకాశమివ్వాలని, మరిన్ని మాల్స్ నిర్మాణానికి ప్రోత్సాహమివ్వాలని చిల్లర వర్తక రంగ ప్రముఖులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి సూచించారు. విశాఖలోని భాగస్వామ్య సదస్సులో భాగంగా 'ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్ – ఎ రిటైల్ కేస్ స్టడీ ఆఫ్ ఇండియా' అంశంపై జరిగిన చర్చలో వాల్‌మార్ట్ ఇండియా సీఈవో కృష్ణయ్యర్, ఫ్యూచర్ గ్రూప్ సీఈవో కిశోర్ బియానీ, ఆదిత్యబిర్లా గ్రూపు సీఈవో విశాఖ్ కుమార్, రహేజా కార్పొరేషన్ అధ్యక్షుడు నీల్ రహేజా, అరవింద్ లైఫ్‌స్టైల్స్ ప్రతినిధి అలోక్ దుబే, 'రీ టైలర్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా' సీఈవో కుమార్ రాజగోపాలన్ తదితరులు పాల్గొన్నారు.



ఎన్టీఆర్ వైద్య సేవ పథకం ద్వారా ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో 19 పరీక్షలు, సామాజిక ఆరోగ్య కేంద్రంలో 40 పరీక్షలు, ప్రాంతీయ ఆసుపత్రి మరియు జిల్లా ఆసుపత్రుల్లో 63 పరీక్షలు  ఉచితంగా చేయనున్నారు.

ఆరోగ్యాంధ్రప్రదేశ్ అనే ఆదర్శాన్ని నిజం చేసేందుకు నవ్యాంధ్ర సారథి ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు యోచించిన నవ తారకమంత్రం ఎన్టీఆర్ వైద్య ఉచిత పరీక్ష పథకం. నిరుపేదలకు వరంగా, కొత్త ఏడాది కానుకగా జనవరి నుంచి ఆచరణలోకి వచ్చిన ఈ విధానం సంక్షేమ ఆరోగ్య పథకాల చరిత్రలో కొత్త అధ్యాయం. ఇంతకాలం మినహాయింపుకు గురై, రోగుల పాలిట తలకు మించిన భారమౌతున్న వైద్య పరీక్షలని కూడా ఉచిత వైద్యం పరిధిలోకి తేవడం చంద్రబాబు విప్లవాత్మక నిర్ణయం. వైద్య పరీక్షలకి అయ్యే ఖర్చు కారణంగా సగటు బతుకులు చితికి పోతున్నాయని, ఆ ఖర్చుకి జడిసి ఎన్నో కుటుంబాలు ఆస్పత్రి గుమ్మాలు తొక్కే సాహసం చేయలేకపోతున్నారనీ గ్రహించిన ముఖ్యమంత్రి ఈ కొత్త పథకం అమలుకు శ్రీకారం చుట్టారు.

జిల్లా ఆసుపత్రులే కాకుండా ప్రాథమిక, సామాజిక ఆరోగ్య కేంద్రాల్లోను పలు ఖరీదైన వైద్య పరీక్షలు ఉచితంగా అందించేదుకు ప్రభుత్వ–ప్రైవేటు భాగస్వామ్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చర్యలు చేపట్టింది. వైద్యం కోసం అయ్యే ఖర్చులో సుమారు 40% వైద్య పరీక్షలకే ప్రజలు ఖర్చు చేస్తున్నట్లు నిర్ధారణ అయిన నేపథ్యంలో ప్రజలపై ఈ భారాన్ని తగ్గించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇక నుంచి ప్రభుత్వ ఆసుపత్రులకు వచ్చే రోగులకు నిర్ధేశించిన వైద్య పరీక్షలు, సేవలు పూర్తిగా ఉచితంగా, సమర్థవంతంగా, ఉత్తమ నాణ్యత ప్రమాణాలతో 'ఎన్టీఆర్ వైద్య పరీక్ష' పేరుతో వివిధ సేవలను అందించాలని నిర్ణయించామని ముఖ్యమంత్రి తెలిపారు. ఈ సేవలను కొత్త సంవత్సరం కానుకగా 2016 జనవరి 2 న పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు ప్రభుత్వ ఆసుపత్రిలో ఎన్టీఆర్ వైద్య ఉచిత పరీక్ష కార్యక్రమాన్ని ఆయన ప్రారంభించారు.

ఎన్టీఆర్ వైద్య సేవ కొరకు రూ. 800 కోట్ల నుండి 900 కోట్లు ఖర్చుపెడుతున్నామని, రాష్ట్రంలో 500 మంది వైద్యులు, 1000 మంది నర్సులను నియమించి రోగులకు అనుక్షణం వైద్యులను అందుబాటులో ఉంచేందుకు కార్యచరణ రూపొందిస్తున్నామన్నారు ముఖ్యమంత్రి. ఆసుపత్రుల్లో వైద్యులు రాకపోకలను బయోమెట్రిక్ హాజరు విధానం ద్వారా పరిశీలించనున్నామని, ఉదయం 9 నుండి సాయంత్రం 4 వరకు డాక్టర్లు రోగులకు సేవలు అందించాల్సిందే అన్నారు. ఎన్టీఆర్ వైద్య సేవలు ప్రైవేటు వైద్యులు కూడా ప్రభుత్వ ఆసుపత్రికి వచ్చి సేవలు అందించేలా చేసి, దీనికి ప్రభుత్వం రుసుం చెల్లిస్తుందన్నారు. తాను పేదల కోసమే సీఎంగా ఉన్నాను తప్ప నాయకులు, అధికారులు కోసం కాదని సీఎం స్పష్టం చేశారు.

## ఉచిత రోగనిర్ధారణ పరీక్షలు

అన్ని ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్యుల సూచనల మేరకు అందరు రోగులకు ఉచిత లేబలేటరి పరీక్షలు నిర్వహించి నిర్ణీత సమయంలో రిపోర్టు ఇవ్వనున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో 19 పరీక్షలు, సామాజిక ఆరోగ్య కేంద్రంలో 40 పరీక్షలు, ప్రాంతీయ ఆసుపత్రి మరియు జిల్లా ఆసుపత్రుల్లో 63 పరీక్షలు ఉచితంగా చేయనున్నారు. పరీక్ష వివరాలు, రోగి వివరాలను కంప్యూటరైజేషన్ చేసి ఆధార్ తో అనుసంధానం చేయటం జరుగుతుంది. రోగి వైద్య పరీక్షలు కోసం వెళ్ళినప్పుడు వారి యొక్క గత వైద్య పరీక్షల వివరాలను ఏ ప్రభుత్వ ఆసుపత్రి నుంచి అయిన తెలుసుకొనే వెసులుబాటు కల్పించారు.

అట్లాగే గర్భిణీ స్త్రీలకు ప్రసవానికి ముందు, ప్రసవం తరువాత ఖర్చుతో కూడుకున్న వైద్య పరీక్షలు చాలా ఉన్నాయి. ఉదాహరణకు సిటీస్కాన్ ఒక్క పరీక్షకే రూ. 3000 ఖర్చు అవ్వుతుంది. ఇక స్కానింగ్ చేయాలంటే రూ. 1500 – 2000 వరకు అవుతుంది. ప్రతి గర్భిణీ స్త్రీ 5వ నెలలో తప్పక చేయించుకునే టిఫాటెస్ట్ కూడా రూ. 3000 వరకు ఖర్చు అవుతుంది. మిగిలిన పరీక్షల ధర కూడా కనీసం రూ. 1000 చెల్లించాల్సి వస్తుంది. ఇకపై గర్భిణీ స్త్రీలకు చేయాల్సిన పరీక్షల అన్నింటిని ప్రభుత్వ ఆసుపత్రుల్లోనే ఉచితంగా చేయనున్నారు.

## 102 సేవలు

గర్భిణీ స్త్రీలు ప్రసవ సమయంలో మాతృమరణాలను, శిశుమరణాల సంఖ్యను తగ్గించడం కోరకు ప్రభుత్వం 102 సర్వీసులను కొత్తగా ప్రారంభించింది. ఈ సర్వీసులను అన్ని వేళల పనిచేసే సమాచార కేంద్రం ద్వారా గర్భిణీ, మరియు బాలింతలకు అవసరమైన వైద్య సలహాలు, సూచనలను, ఇవ్వనున్నారు. గర్భిణీ లేదా బాలింతలు 102 నెంబర్ (ఉచిత సర్వీసు)కు కాల్ చేయడం ద్వారా ఈ సేవలను ఉపయోగించుకోవచ్చు.

## తల్లిబిడ్డ ఎక్స్‌ప్రెస్

ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రసవించే ప్రతి బాలింతను ఆసుపత్రి నుండి ఇంటికి సురక్షితంగా, చేర్చడానికి 278 తల్లిబిడ్డ ఎక్స్‌ప్రెస్ వాహనాలను రాష్ట్ర వ్యాప్తంగా ఏర్పాటు చేయటం జరిగింది. ఈ తల్లిబిడ్డ ఎక్స్‌ప్రెస్ వాహనాలు బాలింత స్త్రీలను, శిశువును, మరియు ఒక సహాయకురాలుని ఆసుపత్రి నుంచి ఇంటికి ఉచితంగా తీసుకెళ్ళనున్నాయి. బాలింతలు ఈ సదు–పాయాన్ని 102 నెంబర్‌కు ఫోన్ చేయటం ద్వారా వినియోగించుకోవచ్చు.

అన్ని జిల్లా ఆసుపత్రులు , ఏరియా ఆసుపత్రులు, సామాజిక, ఆరోగ్య కేంద్రాలలో ఎక్స్‌రేలను ఉచితంగా ఏ సమయంలో అయిన తీయనున్నారు. ప్రజలకు నాణ్యమైన వైద్య సేవలు అందించడానికి ఆసుపత్రుల్లో వైద్య పరికరాలను సక్రమ నిర్వాహణ సౌకర్యం కల్పించనున్నారు. ప్రతిరోజు, ప్రతిక్షణం, వైద్యులను రోగులకు అందుబాటులో ఉంచనున్నారు. ప్రభుత్వ ఆసుపత్రికి వచ్చే ప్రతి రోగికి వైద్యుని సూచన మేరకు అన్ని మందులు ఉచితంగా ఇవ్వనున్నారు. ఈ విధంగా ప్రజలకు నాణ్యమైన సమర్థవంతమైన వైద్య సేవలు అందించి ఆంధ్రప్రదేశ్‌ను ఒక ఆరోగ్యాంధ్రప్రదేశ్‌గా మార్చాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కంకణం కట్టుకున్నారు.



# తిరుగులేని ఆర్థిక శక్తిగా డ్వాక్రా సంఘాలు

- మార్కెటింగ్‌లో బహుళ జాతి కంపెనీల తోడ్పాటుతో నూతన శకానికి నాంది
- మహిళల అభ్యున్నతికి సీఎం చంద్రబాబు నిరంతర తపన



రాష్ట్ర గ్రామీణ మహిళల అభ్యున్నతికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పలు విభిన్న పథకాలకు రూపకల్పన చేసి అమలు చేయడానికి ప్రాధాన్యమిస్తోంది. రాష్ట్రంలోని గ్రామీణ మహిళల్లో సంపూర్ణ అక్షరాస్యత ఆవశ్యకతపై, పొదుపు ఉద్యమంపై విస్తృత ప్రచారం కల్పించి అందుకనుగుణంగా వారిని చైతన్య పరుస్తున్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గతంలో మొదటిసారిగా అధికారం చేపట్టి, సాగించిన తొమ్మిదేళ్ల పాలనాకాలంలో గ్రామీణ పేద మహిళల ఆర్థిక పరిపుష్టికిగాను అనేక పథకాలు ప్రవేశపెట్టి సఫలీకృతులయ్యారు. స్వయం సహాయ సంఘాల (డ్వాక్రా సంఘాల) పేరిట ప్రతి పల్లె, ప్రతి కుటుంబం అభివృద్ధి సాధించేలా కృషి చేశారు. పేదరిక నిర్మూలన, ఆదాయ వృద్ధి పర్చుకోవడం, విద్య, ఆరోగ్యం, పరిసరాల పరిశుభ్రత వంటి అంశాల్లో గ్రామీణ మహిళల్లో సాంఘిక, ఆర్థిక సాధికారత కోసం కేంద్రీకృత విధానం అమలుకు ప్రాధాన్యం ఇచ్చారు. తద్వారా రాష్ట్ర గ్రామీణ మహిళలు ఆర్థికాభ్యున్నతి సాధించే విధంగా తీర్చిదిద్దడంలో ఇప్పటికే రాష్ట్రప్రభుత్వం చరిత్ర సృష్టించింది. గ్రామీణ మహిళలకు అక్షరాస్యత, వ్యాపారాభివృద్ధి, సమాచార, విద్య, భావవక్తీకరణ(ఐఈసీ)కార్యకలాపాలను మెరుగుపరచడానికి సమాచార సాంకేతిక అభివృద్ధిని దేశంలోనే ప్రప్రథమం డ్వాక్రా సంఘాల మహిళలకు పరిచయం చేసి విప్లవాత్మక మార్పులకు నాందిపలికిన ఘనత ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు దక్కుతుంది. అయితే గత పదేళ్ళ కాలంలో నిర్వీర్యమైన డ్వాక్రా సంఘాలను మళ్ళీ బలోపేతం చేయాలని 2014 జూన్ లో అధికారంలోకి వచ్చిన తక్షణమే నిర్ణయం తీసుకోవడమే కాకుండా అందుకు అనుగుణంగా ఆచరణబద్ధం చేయడానికి చర్యలు చేపట్టారు. విభజనాంధ్రప్రదేశ్ లో ఎన్నికల జరిగి రెండోసారి అధికారం చేపట్టిన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు నేతృత్వంలో రాష్ట్రప్రభుత్వం డ్వాక్రా మహిళల సాంఘిక, ఆర్థిక స్వావలంబన సాధించే క్రమంలో మరిన్ని పథకాలను ప్రవేశపెట్టి అమలు చేయాలని నిర్ణయించింది. డ్వాక్రా మహిళల ఉత్పత్తులకు స్థానికంగానే కాకుండా అంతర్జాతీయ మార్కెట్ కల్పించేలా పలు స్వదేశీ, విదేశీ సంస్థలతో రాష్ట్రప్రభుత్వం ఒప్పందాలు చేసుకుంది.

### డ్వాక్రా చరిత్ర ఇలా మొదలైంది...

స్వయం సహాయక సంఘాల ఆవిర్భావం నుంచి ఇప్పుడు వటవృక్షంలా ఎదిగిన తీరు అపూర్వం, అనితర సాధ్యం. ఆదిలో స్వచ్ఛంద సంస్థల ఆధ్వర్యంలో డ్వాక్రా సంఘాల ఏర్పాటు జరిగినప్పుడు వాటి విధివిధానాలు,

ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు నేతృత్వంలో రాష్ట్రప్రభుత్వం డ్వాక్రా మహిళల సాంఘిక, ఆర్థిక స్వావలంబన సాధించే క్రమంలో మరిన్ని పథకాలను ప్రవేశపెట్టి అమలు చేయాలని నిర్ణయించింది. డ్వాక్రా మహిళల ఉత్పత్తులకు స్థానికంగానే కాకుండా అంతర్జాతీయ మార్కెట్ కల్పించేలా పలు స్వదేశీ, విదేశీ సంస్థలతో రాష్ట్రప్రభుత్వం ఒప్పందాలు చేసుకుంది.

---

కార్యకలాపాలు దిశానిర్దేశం లేకుండా సాగాయి. కానీ ఇరవయి ఏళ్ళ క్రితం నాడే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు డ్వాక్రా మహిళ అభ్యున్నతికి నడుం బిగించడంతో వాటి దశ మారిపోయింది. నాటి నుంచి నేటి వరకూ దినదిన ప్రవర్ధమానం అవుతూ ఇప్పుడు రాష్ట్రంలో డ్వాక్రా మహిళలు ఓ చరిత్రకు వారసులయ్యారు. మహిళలు ఆర్థికంగా సామాజికంగా, విద్యావంతులుగా ఎదిగిన సమాజం ఎంతో అభివృద్ధిని సాధిస్తుందని చంద్రబాబు విశ్వసించారు.

భారత దేశంలో అత్యధికంగా ఉన్న గ్రామాల్లో వ్యవసాయమే ప్రధాన ఆదాయ వనరు. వ్యవసాయంలో పురుషుల పాత్ర గణనీయంగా మారడంతో గ్రామాల్లో మహిళల శక్తి నిర్వీర్యమవుతున్న రోజుల నుంచి స్వయం సహాయక సంఘాల పేరిట ఏర్పడ్డ మహిళా మండళ్లు వ్యాపార వేత్తలుగా ఎదగడం ప్రస్తుత పరిణామాలు స్పష్టం చేస్తున్నాయి. ఒకనాడు ఒకే సామాజిక వర్గానికి, ఒకే ఆర్థిక స్థాయికి చెందిన వారంతా రిజిస్టర్ చేసుకున్నా, చేసుకోకపోయినా ఏర్పడ్డ మహిళలు సూక్ష్మ ఔత్సాహికులుగా ఎదగాలన్న ప్రయత్నాలు సాగాయి. మహిళలంతా స్వయం సహాయక సంఘాలుగా ఏర్పడ్డారు. ఒకే ఆలోచనలు, లక్ష్యాలు ఉన్న మహిళలంతా ఐచ్ఛికంగా ముందుకు వచ్చి తాము పొదుపు చేసుకున్న కొద్దికొద్ది మొత్తాలను ఉమ్మడి నిధిగా సమకూర్చుకుని తమ అత్యవసర ఖర్చులకు పరస్పరంగా సహరించుకోవాలని నిర్ధేశించుకున్నాయి.

స్వయం సహాయక సంఘాల మహిళలకు ప్రభుత్వ సంస్థల నుంచి క్రమంగా చేయూత లభించింది. ముఖ్యంగా ఈ సంఘాల పొదుపు మొత్తాలకు బ్యాంకులో నిల్వ చేసుకునే సౌకర్యం కల్పించడమే కాకుండా వివిధ అభివృద్ధి కార్యక్రమాల్లో భాగస్వాములను చేశారు. తద్వారా ఆర్థికంగా, సామాజికంగా ఎదగడంలో మహిళలకు సముచిత స్థానం ఏర్పరిచారు. వాస్తవానికి లాభాపేక్షలేని సంస్థల (ఎన్.జి..వో.) ఆధ్వర్యంలో 1980లో మహిళల పేదరిక నిర్మూలనే ధ్యేయంగా స్వయం సహాయక సంఘాలు ప్రారంభమయ్యాయి.

అంతేకాదు కాదు మహిళలకు పలు స్వప్రయోజానాల సాధనే లక్ష్యంగా స్వయం సహాయక సంఘాల ఏర్పాటు నిర్ధేశించారు. ప్రధానంగా సాధికారత సాధించడం, పేదవారిలోనూ నాయకత్వ లక్షణాలు పెంపొందించడం, పాఠశాలల్లో విద్యార్థుల ప్రవేశాలను అధికం చేయడం, పౌష్టికాహారం తీసుకునేలా అవగాహన పెంపొందించడం, కుటుంబ నియంత్రణ ప్రయోజనాలు తెలియజేయడం వంటి సామాజిక అంశాలలో మహిళలను చైతన్యపరడమే లక్ష్యాలుగా ఈ స్వయం సహాయక సంఘాలను నెలకొల్పారు. ఇతరత్రా లక్ష్య సాధనకన్నా ప్రాథమికంగా ఆర్థిక మధ్యవర్తిత్వమే ఉన్నతంగా కనిపిస్తోంది.

## స్వయం సహాయక సంఘాలకు సాయం

ఆర్థిక స్వావలంబనకు మహిళలు ఇప్పుడు వివిధ ఉత్పత్తులు, వాటి మార్కెటింగ్ కార్యకలాపాల్లో నిమగ్నమయ్యారు.ఎన్జీవోలు ప్రారంభించిన స్వయంసహాయక సంఘాల కార్యకలాపాలకు ప్రభుత్వసంస్థలు, బ్యాంకులు సైతం తోడ్పాటునందించడం ప్రారంభించాయి. భారత్ లో ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సహాయక సంఘాలు ఆర్థిక స్వావలంబనలో ప్రత్యేక తరహాలో ముందుకు దూసుకుపోయాయి. స్వయం సహాయక సంఘాల మహిళలే స్వయంగా నిర్వహించుకోవడం, మిత వ్యయంతో ఆర్థిక సేవలందించడం వంటి వినూత్న తరహా పద్ధతుల సమన్వయంతో మహిళల అభివృద్ధికి బాటలు పరచడం మూలంగా గుర్తింపు సాధించాయి.

స్వయం సహాయక సంఘాల మహిళల అభ్యున్నతికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పెద్దెత్తున తోడ్పాటునందించడం మొదలు పెట్టాక వాటి చరిత్ర మారిపోయింది. స్వయం సహాయక సంఘాలు ఏర్పడ్డ ఒకటి రెండేళ్ల తర్వాత సంఘాలలోని మహిళలు పొదుపు చేసుకున్న మొత్తాలకు సమానంగా రివాల్వింగ్ ఫండ్ రూపేణా మ్యాచింగ్ గ్రాంట్ ను అందిస్తోంది. అది సుమారు ఒక్కో గ్రూపుకు రూ. 10,000 నుంచి రూ. 15,000 వరకూ మ్యాచింగ్ గ్రాంట్ లభిస్తోంది.

ఈ సంఘాలు పొదుపు చేసుకున్న మొత్తాలకు నాలుగురెట్ల వరకూ వాణిజ్య బ్యాంకుల నుంచి ఎస్హెచ్ బ్యాంక్ లింకేజీ పథకం కింద రుణాలు పొందే వీలు కల్పించారు. ప్రస్తుతం స్వయంసహాయక సంఘాలు ఏర్పడి 11, 12 ఏళ్ళు దాటడంతో ఇవన్నీ కూడా నగదు క్రెడిట్ పరిమితుల కింద బ్యాంకుల నుంచి రుణాలు పొందే ఆస్కారమేర్పడుతోంది.

స్వయం సహాయక సంఘాలు బ్యాంకులకు చెల్లించాల్సిన రుణాలపై వడ్డీని రాష్ట్రప్రభుత్వమే చెల్లిస్తూ ఆదుకుంటోంది. అదే కాకుండా సంఘాలలోని ప్రతి మహిళకు మూలధనం (బహుళ ప్రాచుర్యం పొందిన చంద్రన్న చేయూత) పథకం కింద రూ. 10,000 చొప్పున అందిస్తోంది. స్వయం సహాయక సంఘాలు ప్రారంభమైన 1980 నుంచి నేటి వరకూ శిక్షణ ఇవ్వడం, ఆర్థిక పరిపుష్టి సాధించడం, ఆస్తులను ఏర్పరుచుకోవడం నుంచి పలు పథకాల రూపేణా రుణాలు అందజేయడంలో కేంద్ర ప్రభుత్వం సైతం తోడ్పాటు నందిస్తోంది.

ప్రధానంగా ఐఆర్డీపీ, ఎస్జీఎస్వై, ఎన్.ఆర్.ఎల్.ఎమ్. వంటి పథకాల నుంచి మహిళా సంఘాలకు సాయం అందుతోంది. కేంద్ర పథకాల నుంచి వచ్చే ప్రయోజనాలు ప్రధానమైన పాత్ర వహిస్తుండగా, రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే రాయితీలు మాత్రం ప్రోత్సాహకర అంశంగా మారాయి. ఆర్థిక సాయం , సంఘాల ద్వారానూ పొందే వీలుంది.

స్థానికంగానే కాకుండా, మండల, జిల్లా, రాష్ట్ర స్థాయిలో డ్వాక్రా బజార్లను ప్రతి ఏటా డిసెంబరు 2, 3 వారాల్లో నిర్వహించడం ఆరంభించారు. తత్ఫలితంగా డ్వాక్రా సంఘాల ఉత్పత్తులను ప్రజానీకానికి చేరువ చేయడం, డ్వాక్రా సంఘాలను నెలకొల్పిన ఉద్దేశం జనరంజకం కావడంలో సత్ఫలితాలు లభించాయి.

## సంఘాలు సంస్థలుగా రూపాంతరం

మొదటి రెండు సంవత్సరాల్లో కొంతమంది మహిళలు సంఘాలుగా ఏర్పడటం చిన్న మొత్తాలుగా పొదుపు చేసిన మొత్తాలు, బ్యాంకుల క్రెడిట్ రివాల్వింగ్ నిధులతో ఆదాయం సమకూర్చుకునే కార్యకలాపాల్లో నిమగ్నమవ్వడం జరుగుతుంది. తదుపరి మూడు నుంచి అయిదు ఏళ్లలో ఒకో మహిళా పొదపు చేసుకునే మొత్తానికి రూ. 5 నుంచి రూ. 10 వేల వరకూ బ్యాంకుల రుణం పొందే అర్హత సాధిస్తారు తాజా సర్వే ప్రకారం ఒక్కో స్వయం సహాయ సంఘం సభ్యులు రూ . 50 వేల వరకూ రుణం పొంది ఆదాయ సమపార్జన కార్యకలాపాలు సాగిస్తున్నట్లు వెల్లడించింది. ఒక్కో జిల్లాలో ఒక్కో మండలం ప్రకారం 13 మండలాల్లో నిర్వహించిన ఓ సంస్థ సర్వేలో 14 శాతం స్వయం సహాయక సంఘాలు పాడిపరిశ్రమపై ఆధారపడినట్లు తెలిసింది. మరో 13 శాతం సంఘాలు టైలరింగ్, రెడీమేడ్ దు-స్తుల తయారీలోనూ, 10 శాతం కిరాణదుకాణాలపై, 5 శాతం చిన్న హోటళ్లు, రెస్టారెంట్లుపైనా, 3 శాతం కూరగాయల దుకాణాలపైనా, మరో 23 శాతం పచ్చళ్ళు, మసాలా పొడులు, ఇతర ఆహార పదార్థాల తయారీ పైనా, గొర్రెలపెంపకంపై 5 శాతం మంది వెదురు బుట్టల తయారీపై 2 శాతం , కోడిమాంసం విక్రయాల్లో 2 శాతం, ఇంకో 2 శాతం మంది కిళ్ళీ దుకాణాలు నిర్వహించడం వంటి కార్యకలాపాలతో ఆదాయ సముపార్జనలో నిమగ్నమయ్యారని ఆ సర్వే పేర్కొంది. మరొక సర్వేలో సుమారు 14 లక్షల మహిళా సంఘాలు వివిధ ఆదాయం ఆర్జించే వ్యవహారాల్లో ఉన్నట్లు తేలింది..

## మార్కెటింగ్‌లో మెళుకువలు

డ్వాక్రా సంఘాలు ప్రారంభమైన తొలి రోజుల్లో వారి ఉత్పత్తుల నాణ్యత అంతర్జాతీయ స్థాయిలో విక్రయించుకునే స్థాయిలో లేకపోయాయి. డ్వాక్రా సంఘాల మహిళలు తయారు చేసిన ఉత్పత్తులను తామే స్వయంగా స్థానిక మార్కెట్లలోనే అమ్ముకునే వారు. దానికితోడు ఆయా ఉత్పత్తుల ప్యాకింగ్, ప్రచార వ్యవహారాలూ ప్రమాణాలకు తీసికట్టుగా ఉండేవి. అయితే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు డ్రాక్రా సంఘాల మహిళలను ప్రోత్సహించడంలో నూతన పద్ధతులకు నాంది పలికారు. డ్వాక్రా సంఘాల ఉత్పత్తులను నేరుగా ఆయా మహిళా సంఘాలే వినియోగదార్లకు అమ్ముకునే విధంగా డ్వాక్రా బజార్లను నిర్వహించేలా 1995లో చర్యలు తీసుకున్నారు. స్థానికంగానే కాకుండా, మండల, జిల్లా, రాష్ట్ర స్థాయిలో డ్వాక్రా బజార్లను ప్రతి ఏటా డిసెంబరు 2, 3 వారాల్లో నిర్వహించడం ఆరంభించారు. తత్ఫలితంగా డ్వాక్రా సంఘాల ఉత్పత్తులను ప్రజానీకానికి చేరువ చేయడం, డ్వాక్రా సంఘాలను నెలకొల్పిన ఉద్దేశం జనరంజకం కావడంలో సత్ఫలితాలు లభించాయి. గ్రామీణ మహిళా ఉత్పత్తిదారులను ప్రోత్సహించే ఉద్దేశంతో డ్వాక్రా బజార్లను నాయకులు, ప్రముఖులు సందర్శించడంతో ఆయా ఉత్పత్తుల నాణ్యతపై ప్రజలకు నమ్మకం పెరిగేలా దోహదపడింది.

## డ్వాక్రా మహిళల మార్కెటింగ్ విధానాలు

రాష్ట్రంలో డ్వాక్రా సంఘాల మహిళలు దాదాపు 500 రకాల ఉత్పత్తులు సాధిస్తున్నారు. దేశీ, విదేశీ స్థాయిలో నిర్వహించే ఎగ్జిబిషన్లు, బజార్లలో పాల్గొని డ్వాక్రా ఉత్పత్తుల అమ్మకాలు సాగిస్తున్నారు. విదేశాలలో జరిగే వివిధ వస్తువుల అమ్మకం బజార్లలో పాల్గొనేందుకు వెళ్ళే డ్వాక్రామహిళలకు పాస్ పోర్ట్‌లు జారీ, స్పాన్సర్డ్ చేయడంలో ఆనాడే ముఖ్యమంత్రి చంద్రబాబు చొరవ తీసుకుని ప్రోత్సహించారు. నాబార్డ్ ఇతర మార్కెటింగ్ వ్యవహారాల్లో, డ్వాక్రా బజార్లలో పాల్గొనే మహిళలకు ఆర్థికపరంగా అండగా నిలిచాయి. డ్వాక్రా సంఘాల మహిళలు తమ ఉత్పత్తులను మార్కెటింగ్ విషయంలో జాతీయ స్థాయిలో గుర్తింపు పొందిన స్వచ్ఛంద సంస్థ కపార్ట్, లేపాక్షి, ఆప్కో, పారిశ్రామిక ప్రదర్శనకేంద్రాలు, ఎన్.హెచ్.డి.సి., ఇతర మార్కెటింగ్ సంస్థలతో డ్వాక్రా సంఘాల మహిళలు ఒప్పందాలు చేసుకుని అభివృద్ధి బాటన పయనిస్తున్నారు. గ్రామీణాభివృద్ధి మంత్రిత్వ శాఖ, కేంద్ర ప్రభుత్వం సంయుక్తంగా ఏర్పాటు చేసిన 'సరస్' ఆధ్వర్యంలో ప్రతిఏటా అన్ని రాష్ట్రాల రాజధాని కేంద్రాల్లో ఎగ్జిబిషన్లు నిర్వహిస్తూ డ్వాక్రా సంఘాల మహిళల ఉత్పత్తుల అమ్మకాలకు ఆస్కారం కల్పిస్తోంది. సరస్ ఎగ్జిబిషన్లలో పాల్గొనడం మూలంగా వివిధ రాష్ట్రాల మహిళలు ఒకచోట కూడి తమ ఉత్పత్తులు, మార్కెటింగ్, నైపుణ్యాలు, పెద్దెత్తున అమ్మకాలు తదితర అంశాలపై పరస్పరం ఆలోచనలు పంచుకోవడం జరుగుతోంది. పట్టణాల్లో మార్కెటింగ్ విధానాలపై డ్వాక్రా మహిళలకు అవగాహన ఏర్పడుతోంది.కృష్ణా, గోదావరి పుష్కరాల సందర్భంగా పూజా ద్రవ్యాలు, సామగ్రి అమ్మకాలను డ్వాక్రా మహిళలకు అప్పగించారు. అదే సమయంలో ఎగ్జిబిషన్లలో ఉచిత స్టాళ్ళను సమకూర్చి మహిళల ఉత్పత్తుల అమ్మకాలకు రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సాహం అందించింది. ఇటీవల జరిగిన గోదావరి పుష్కరాలలో డ్వాక్రా సంఘాలు రూ. 3 కోట్ల విలువైన తమ ఉ త్పత్తులను అమ్మకాలను సాగించడం విశేషం. పాఠశాల్లో మధ్యాహ్న భోజనం, సంక్షేమ హాస్టళ్ళకు కూరగాయలు, పాలు సరఫరా చేసే అవకాశం డ్వాక్రా మహిళలకు కొన్ని ప్రభుత్వ శాఖలు అప్పగించి ఆదాయ వనరులను చూపిస్తున్నాయి. ప్రాథమిక,మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు యూనిఫాం కుట్టి ఇవ్వడానికి అవకాశం ఇచ్చి తోడ్పడుతున్నారు. చిత్తూరు జిల్లాలో అంగన్ వాడీ కేంద్రాలకు డ్వాక్రా సంఘాలు పాల సరఫరా చేస్తున్నాయి. దేవాదాయశాఖ సైతం డ్వాక్రా మహిళల నుంచి కొబ్బరికాయలు, పసుపు, పువ్వులు కొనడమే కాకుండా దేవాలయ పరిసరాల్లో దుకాణాలు ఏర్పాటు చేసుకుని దేవుని ఫోటోలు, ఇతర వస్తువులు అమ్మకాలు సాగించుకునేలా మహిళలకు ఉపాధి కల్పిస్తోంది.

ముఖ్యంగా గ్రామం, మండల, జిల్లాస్థాయిల్లో డ్వాక్రా సంఘాల స్వావలంబన సాధించే రీతిలో మహిళల అక్షరాస్యత పెంపునకు, డిజిటల్ పరిజ్ఞానంలో మెళుకువలు సాధించడానికి, సామర్ధ్య నిర్మాణ కార్యక్రమం అమలుకు ప్రభుత్వం చొరవ చూపుతోంది. రాష్ట్రంలోని 13 జిల్లాస్థాయి సమాఖ్యలు, 644 మండలస్థాయి సమాఖ్యలు, 16,139 గ్రామీణ ప్రాంతాల్లోని 6,80,765 స్వయం సహాయ సంఘాలలోని 69,46,180 సభ్యులు ప్రోత్సహించేందుకు అనేక పథకాలు రూపొందించి తోడ్పాటునందిస్తోంది.

– సి.ఎస్.రామలక్ష్మి, ప్రభుత్వ సలహాదారు

# ఉపాధి హామీ పథకం అమలులో ఏపీ నెం. 1



రాష్ట్ర ప్రభుత్వ పథకాలైన పంటసంజీవని, నీరు చెట్టు, స్వచ్ఛ ఆంధ్రప్రదేశ్, వాడ వాడలా చంద్రన్నబాట వంటి కార్యక్రమాలను ఉపాధి హామీ పథకం క్రింద తీసుకోవటం వంటి నిర్ణయాలు రాష్ట్రాన్ని అగ్రగ్రామిగా నిలిపాయి. ఉపాధి హామీని పథకాన్ని పారదర్శకత, నిబద్ధతతో అమలు చేస్తున్నందుకు ఏపి ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వం పురస్కారం అందజేయనున్నది.

మొన్న విద్యుత్ పొదుపులో ఆంధ్రప్రదేశ్ నెం. 1, నిన్న ప్రపంచ బ్యాంకు సర్వేలో దేశంలో పెట్టుబడులు పెట్టడానికి అనుకూలమైన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్‌కు రెండవ స్థానం, నేడు ఉపాధి హామీ పథకం అమలులో ఏపి నెం.1 ఇలా అన్ని రంగాల్లో ఉన్నత శిఖరాలకు చేరబోతున్నది నవ్యాంధ్రప్రదేశ్.

భారత ప్రభుత్వం అత్యంత ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న మహాత్మాగాంధీ జాతీయ ఉపాధి హామీ పథకం అమలులో ఆంధ్రప్రదేశ్‌కు ప్రథమ స్థానం దక్కటంపట్ల ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సంతోషం వ్యక్తం చేశారు. ఇదే స్ఫూర్తితో అందరం కృషి చేసి 2022 నాటికి దేశంలో మూడు అగ్రగామి రాష్ట్రాలలో ఏపిని ఒకటిగా నిలుపుదాం అన్నారు ముఖ్యమంత్రి.

రాష్ట్రంలో 13 జిల్లాలోని 13,099 గ్రామ పంచాయితీల్లో 47,638 వాడ వాడల్లో ఈ పథకం అమలు జరుగుతుంది. ఈ పథకం ప్రారంభం నుండి ఇప్పటి వరకు కోటి 16 లక్షల మందికి ఉపాధి కల్పించింది. రూ. 156.2 కోట్ల పనిదినాలు కల్పించి రూ. 22.836 కోట్ల విలువైన పనులు చేయటం జరిగింది. మొత్తం పని దినాల్లో ఎస్సీలకు 24.2 శాతం, ఎస్టీలకు 11.8 శాతం పనులు కల్పించారు.

రాష్ట్రంలోని 2,91,031 లక్షల కుటుంబాలకు పూర్తి స్థాయిలో 100 రోజులు ఉపాధిని ప్రభుత్వం కల్పించింది. 15 రోజుల్లోనే కూలీల వేతనాలను 78 శాతం చెల్లించింది. కూలీల ఆధార్ నెంబర్లను 97 శాతం అనుసంధానం చేసి ఉపాధి హామీ పథకం అమలులో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మొదటి స్థానంలో నిలిచింది.

వీటితో పాటు రాష్ట్ర ప్రభుత్వ పథకాలైన పంటసంజీవని, నీరు చెట్టు, స్వచ్ఛ ఆంధ్రప్రదేశ్, వాడ వాడలా చంద్రన్నబాట వంటి కార్యక్రమాలను ఉపాధి హామీ పథకం క్రింద తీసుకోవటం వంటి నిర్ణయాలు రాష్ట్రాన్ని అగ్రగామిగా నిలిపాయి. ప్రతి ఆర్థిక సంవత్సరంలో ప్రతి గ్రామీణ కుటుంబానికి కనీసం 100 పనిదినాలు కల్పించటమే కాకుండా కరువు ప్రాంతాల్లో 50 రోజులు అదనంగా మొత్తం 150 పనిదినాలు కల్పిస్తున్నారు. అంతే కాకుండా కనీస వేతనాన్ని 169 రూపాయిలు నుంచి 185 రూపాయిలకు పెంచారు.

అందుకే ఉపాధి హామీని పథకాన్ని పారదర్శకత, నిబద్ధతతో అమలు చేస్తున్నందుకు ఏపి ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వం పురస్కారం అందజేయనున్నది. కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి బిరేంద్ర సింగ్ చేతులు మీదగా ఫిబ్రవరి 2వ తేదీన ఢిల్లీలో జరిగే కార్యక్రమంలో రాష్ట్ర పంచాయితీరాజ్‌శాఖ మంత్రి అయ్యన్నపాత్రుడు ఈ పురస్కారాన్ని అందుకోనున్నారు.

❖

# జూన్ నాటికి తాత్కాలిక సచివాలయం!



మంగళగిరి సమీపంలోని 6 లక్షల చదరపు అడుగుల్లో రెండు అంతస్తుల్లో తాత్కాలిక సచివాలయ భవన నిర్మాణం జరపనున్నారు. తుళ్లూరు ప్రాంతంలో శాశ్వత భవనాలు నిర్మించే వరకు ఏపీ తాత్కాలిక సచివాలయం వెలగపూడిలోనే ఉంటుంది. ఏపీ తాత్కాలిక సచివాలయం నిర్మాణాన్ని గుంటూరు జిల్లా తుళ్లూరు మండలం, వెలగపూడిలో నిర్మించనున్నారు.

ఏపీ తాత్కాలిక సచివాలయాన్ని జూన్ నాటికి రాజధాని అమరావతి పరిధిలో ఏర్పాటు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం కసరత్తు ప్రారంభించింది. ఇప్పటికే ఏపీ తాత్కాలిక సచివాలయం నిర్మాణానికి సిద్ధమైన సంస్థలు దాఖలు చేసిన టెండర్లను ఫిబ్రవరి 3న సీఆర్డీఏ తెరవనుంది. తాత్కాలిక సచివాలయాన్ని రూ.180 కోట్లతో నిర్మించనున్నారు. వెలగపూడిలో 26 ఎకరాల్లో ప్రి ఫ్యాబ్రికేటెడ్ పద్ధతిలో నిర్మాణాలు చేపట్టనుంది. అంతేకాకుండా 6 లక్షల చదరపు అడుగుల్లో ఆరు బ్లాకుల్లో నిర్మాణాలు చేయనున్నారు. ఈ ఏడాది జూన్ నాటికి పూర్తిచేయాలని నిబంధన పెట్టుకున్నారు. రాష్ట్ర సచివాలయం రాజధాని పరిధిలోనే ఉంటే త్వరలో మొదలు కానున్న ప్రభుత్వ కార్యాలయాల నిర్మాణంపై పర్యవేక్షణ ఉండటంతోపాటు.. ప్రజలకు చేరువగా ఉంటుందని ప్రభుత్వం తలచిన నేపథ్యంలో తాత్కాలిక సచివాలయం నిర్మాణానికి మొగ్గు చూపింది. సచివాలయ నిర్మాణానికి ప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. 6 లక్షల చదరపు అడుగుల నిర్మాణానికి అనుమతిస్తూ సర్కారు జీవో జారీ చేసింది. రూ.300 కోట్లతో తాత్కాలిక భవనాలను నిర్మించాలన్న సీఆర్డీఏ ప్రతిపాదనను సవరించిన ప్రభుత్వం.. రూ.180 కోట్లతో ప్రీఫ్యాబ్రికేటెడ్ నిర్మాణాలు చేపట్టాలని సీఆర్డీఏను ఆదేశించింది. ఇందుకోసం రూ.90 కోట్ల వడ్డీలేని రుణం సీఆర్డీఏకి మంజూరు చేసింది. అంతేకాకుండా మరో రూ.90 కోట్లను హడ్కో నుంచి రుణంగా తీసుకోవాలని సీఆర్డీఏను ఆదేశించింది. ప్రభుత్వం నుంచి వచ్చిన లీజు మొత్తాన్ని హడ్కోకి చెల్లించాలని ఈ సందర్భంగా సీఆర్డీఏకి ప్రభుత్వం సూచించింది. జూన్‌నాటికి తాత్కాలిక సచివాలయం నిర్మించాలన్న ప్రతిపాదనను వాస్తవ రూపం ఇవ్వాలని రాష్ట్ర అధికారులకు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆదేశాలిచ్చారు. సచివాలయంతో పాటు శాఖాధిపతులు కార్యాలయాలను ఏర్పాటు చేస్తారు. ఏపీ తాత్కాలిక సచివాలయం నిర్మాణాన్ని గుంటూరు జిల్లా తుళ్లూరు మండలం, వెలగపూడిలో నిర్మించనున్నారు. టెండర్లు ఖరారు ప్రక్రియ పూర్తవడంతోనే ఫిబ్రవరి మొదటి వారం నుంచి ఏపీ సచివాలయ నిర్మాణం ప్రారంభం కాబోతోంది. ఈ టెండర్లలో పాల్గొనేందుకు పలు అంతర్జాతీయ సంస్థలు ఆసక్తి ప్రదర్శించాయి.ప్రస్తుత టెక్నాలజీతో 2 నెలల్లో సచివాలయం నిర్మాణం పూర్తి చేయొచ్చని మంత్రి నారాయణ పేర్కొన్నారు.

### పూర్తిగా తరలిస్తే 51 లక్షల చదరపు అడుగులు!

ఒక ఉద్యోగి పనిచేయడానికి ఎంత విస్తీర్ణం ఉండాలి, నివాసానికి ఎంత స్థలం కావాలి..అన్న అంశాల ఆధారంగా అధికారులు మొదట్లో గణాంకాలు రూపొందించారు. 33 సెక్రటేరియట్‌విభాగాల్లో 2,656 మంది, సెక్రటేరియట్ వెలుపల ఉండే 101 ప్రభుత్వ విభాగాల్లో 19,124 మంది ఉద్యోగులుండగా, వారికి 45, 640,75 చ.అ. స్థలం కావాలని నిర్ణయించారు. జూన్ నాటికి 134 ప్రభుత్వ విభాగాలను పూర్తిగా తరలించాలనుకుంటే.. 21,780 మంది ఉద్యోగులను, వారు పని చేయడానికి 51,02,900 చ.అ. కార్యాలయ

వచ్చే ఏడాది జూన్ లోపు రాజధాని ప్రాంతంలో 6 లక్షల చదరపు అడుగుల విస్తీర్ణంలో భవన నిర్మాణం పూర్తి చేసి సచివాలయం తరలిస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రకటించారు. జూన్ నుంచి అన్ని ప్రభుత్వ కార్యక్రమాలు అక్కడ నుంచే ప్రారంభమవుతాయని సీఎం పేర్కొన్నారు.

---

స్థలాన్ని సిద్ధం చేయాల్సి ఉంటుంది.

## ప్రాధాన్యక్రమంలో తరలిస్తే 14 లక్షల చదరపు అడుగులు

ఆయా శాఖలను.. ఉద్యోగులను ప్రాధాన్యక్రమంలో తరలించాల్సి వస్తే జూన్ నాటికి అన్ని శాఖల్లో కలిపి 7,313 మంది ఉద్యోగులను తరలించాలని అధికారులు నిర్ణయించారు. ఇందులో 1926 మంది గెజిటెడ్అధికారులు, 5,387 మంది నాన్ గెజిటెడ్అధికారులు ఉండగా, 64 మంది శాఖాధిపతులున్నారు. ఒకవేళ ప్రాధాన్యక్రమంలో తరలించదలచుకుంటే 14,23,568 చదరపు అడుగుల స్థలం అవసరం అవుతుందని నిర్ణయించారు. ఇందులో సచివాలయంలోని ముఖ్యమంత్రి కార్యాలయం, సీఎస్‌కార్యాలయం, మంత్రులు, సలహాదారుల చాంబర్లు, 33 శాఖలు, కామన్ ఏరియా, కామన్ యుటిలిటీస్‌కోసమే 5,38,825 చదరపు అడుగుల విస్తీర్ణం అవసరం అవుతుంది. జూన్‌నాటికి రాజధాని ప్రాంతంలో సచివాలయం పూర్తిస్థాయిలో సిద్ధం కాని పక్షంలో ప్లాన్ బి ప్రకారం.. ఖాళీగా ఉన్న ఇతర భవనాల్లో ఉద్యోగులకు ఆఫీసులు ఏర్పాటు చేసే అవకాశం ఉంది.

## చరిత్ర పుటల్లో వెలగపూడి

నాడు , నేడు చరిత్ర పుటల్లో వెలగపూడి చిరస్థాయిగా నిలవనుంది. చారిత్రాత్మక ప్రదేశంలో తాత్కాలిక సచివాలయం ఏర్పాటుకు ప్రభుత్వం సిద్ధమైంది. తుళ్ళూరు మండలంలో వెలగపూడి రెవెన్యూ పరిధిలోని సర్వే నెంబర్లు 205 నుంచి 208 వరకు, 214లో నిర్మాణం చేపట్టనున్నారు. వెలగపూడి చరిత్రను పరిశీలిస్తే క్రీస్తు శకం 1000 సంవత్సరం నుంచి 1323 వరకు కాకతీయుల రాజుల ఏలుబడిలో ఉన్నట్లు చరిత్ర చెపుతోంది. గణపతిదేవుడు క్రీస్తు శకం 1199 నుంచి 1262 వరకు పాలించినట్టు చరిత్రలో ఉంది. ఆ తరువాత 1262 నుండ 1289 వరకు రాణి రుద్రమ్మదేవి రాజ్యాధినేతగా పాలించింది. కాకతీయుల కాలంలో చెక్కిన శిలాశాసనం వెలగపూడి పక్కనే ఉన్న మల్కాపురం ఉంది. దీనిని బట్టి వెలగపూడి కాకతీయులు పాలించిన చారిత్రాత్మక ప్రదేశమని తెలుస్తోంది. ఇక్కడ నల్లరాతిపై చెక్కిన కాకతీయుల కాలం నాటి శిలాశాసనానికి 150 అడుగుల దూరంలో శివాలయం ఉంది. కాకతీయుల రాజవంశ వర్ణము, గోళకీయమత సాంప్రదాయం మొదలైన విషయాల ప్రస్తావన శాసనంలో ఉంది. గణపతిదేవుడి గురువు విశ్వేశ్వర శంభునకు మందడం గ్రామం వెలగపూడి, లంకను రుద్రమ్మదేవి దానమిచ్చినట్టు చరిత్ర చెపుతోంది. విశ్వేశ్వరాలయం, ప్రసూతి శాల, అన్నసత్రం, స్థాపించి, రెండు గ్రామాలను కలిపి విశ్వేశ్వర గోళకీయమని పేరు పెట్టినట్టు తెలుస్తోంది. వెలగపూడి మందడం గ్రామంలో 120 పుట్ల భూమి ద్రవిడ బ్రాహ్మణులకు కేటాయించినట్టు చరిత్ర తెలుపుతోంది.

భటులకు, మంగళవాయిద్య కారులకు, కొంత భూమిని కేటాయించినట్టు తెలుస్తోంది. మందడం, మల్కాపురం, వెలగపూడి కాకతీయులు ఏలుబడిలో ఉండి చరిత్రకెక్కినట్టు తెలుస్తోంది. ఆ తరువాత శ్రీకృష్ణదేవరాయులు ఈ ప్రాంతాన్ని పరిపాలించినట్టు చరిత్ర చెపుతోంది. ఇటువంటి గొప్ప చరిత్ర ఉన్న ప్రదేశంలో చారిత్రాత్మక తాత్కాలిక కట్టడంను నిర్మించటానికి ప్రభుత్వం నిర్ణయించటంతో స్థానిక గ్రామస్తులు ఆనందం వ్యక్తం చేస్తున్నారు. రాజధాని విజయవాడలో కార్యాలయాలు ఏర్పాటు చేస్తే ఉద్యోగులు తరలిరావడానికి సిద్ధంగా ఉన్నామని ఏపీఎన్జీవో నేత అశోక్‌బాబు వెల్లడించారు.

మంగళగిరి సమీపంలోని 6 లక్షల చదరపు అడుగుల్లో రెండు అంతస్థుల్లో తాత్కాలిక సచివాలయ నిర్మాణం జరపనున్నారు. తుళ్లూరు ప్రాంతంలో శాశ్వత భవనాలు నిర్మించే వరకు ఏపీ తాత్కాలిక సచివాలయం వెలగపూడిలోనే ఉంటుంది.

విభజన దరిమిలా కొన్ని ఏళ్లపాటు రాజధాని అంటే మంగళగిరేనన్న భావన పాతుకుపోయేలా ప్రభుత్వ యంత్రాంగ వ్యవస్థలు ఇక్కడే కొలువుతీరుతున్నాయి. తాత్కాలిక సచివాలయానికి వాస్తు అమోఘంగా ఉందన్న భావంతో ఉత్తర ఈశాన్యంగా తాత్కాలిక సచివాలయ నిర్మాణాన్ని చేపట్టబోతున్నారు.

జూన్ 30లోగా పనులను పూర్తిచేయాలని ఉత్తర్వుల్లో సీఆర్‌డీఏను రాష్ట్ర ప్రభుత్వం ఆదేశించింది. తాత్కాలిక సచివాలయం 2016 జూలై నుంచి ఇక్కడ ప్రారంభం కానుందని... వివిధ ప్రభుత్వ విభాగాలకు సంబంధించి కేటాయించే గదుల విస్తీర్ణాన్ని సీఆర్‌డీఏ లెక్కలోకి తీసుకుని ఆయా శాఖలకు కేటాయించిన సాధారణ బడ్జెట్‌నుంచి అద్దె డబ్బులను వసూలు చేసుకునేలా ప్రభుత్వం ఉత్తర్వులను వెలువరించింది.

వచ్చే ఏడాది జూన లోపు రాజధాని ప్రాంతంలో 6 లక్షల చదరపు అడుగుల విస్తీర్ణంలో భవన నిర్మాణం పూర్తి చేసి సచివాలయం తరలిస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రకటించారు. రాష్ట్రం విడిపోయిన పాలనా యంత్రాంగం ఒక చోట, ప్రజలు మరొక చోట ఉన్నందున కొన్ని సమస్యలు ఉత్పన్నమౌతున్నాయని, అయితే ఎన్ని ఇబ్బందులున్నా వాటిని అధిగమించుకొంటూ ముందుకు పోవాలని ముఖ్యమంత్రి ప్రభుత్వోద్యోగులకు సూచించారు.

అన్ని శాఖల హెచ్‌వోడిలతో సహా ఉద్యోగులంతా తాత్కాలిక సచివాలయానికి తరలి రావాల్సిందే. జూన్ నుంచి అన్ని ప్రభుత్వ కార్యక్రమాలు అక్కడ నుంచే ప్రారంభమవుతాయని సీఎం పేర్కొన్నారు. కొత్త రాజధానికి తరలిరావాలని, ఎవరి వసతిని వారే చూసుకోవాలని ముఖ్యమంత్రి ఇప్పటికే స్పష్టం చేసిన నేపథ్యంలో భాగంగా అనేక శాఖల ఉన్నతాధికారులు విజయవాడలో భవంతులను ఎంపిక చేశారు.

ఉదాహరణకు.. ఎక్సైజ్, వాణిజ్య పన్నులు, రిజిస్ట్రేషన్స్ శాఖల ఉన్నతాధికారులు కొత్త రాజధాని ప్రాంతంలో వసతులు చూసుకుని దానికి సంబంధించిన ప్రతిపాదనలను సిద్ధం చేసుకున్నారు.



# సీసీరోడ్లతో పల్లెలకు రాచబాట

## గ్రామాలకు రవాణాపై సీఎం చంద్రబాబు ప్రత్యేక దృష్టి



ప్రజల జీవన ప్రమాణాల మీద ప్రత్యేక దృష్టి ఉన్న ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు, అవి పెరగాలంటే మౌలిక సదుపాయాల కల్పన అత్యవసరమని భావిస్తారు. ఆ ఆలోచనలో భాగంగానే రాష్ట్రంలో అన్ని పంచాయితీలలో పటిష్టమైన సిమెంటు రోడ్లు ఏర్పాటు చేయాలని ఆయన సంకల్పించారు. ప్రధాన మార్గాల నుంచి సీసీరోడ్ల నిర్మాణంతో ప్రతి పల్లెకి రాచబాట ఏర్పరచాలని, రవాణా సదుపాయాల పెంపుతో గ్రామీణ జీవన ప్రమాణాలు పెంచాలనీ ముఖ్యమంత్రి ధృఢనిశ్చయంతో ఉన్నారు. గ్రామాలలో సిమెంట్ రోడ్ నిర్మాణ పనులను మహిళా స్వయంశక్తి సంఘాలకు అప్పగించే ప్రతిపాదనను పరిశీలించాలని సీఎం అధికారులకు సూచించారు. ఈ ఏడాది రూ.2 వేల కోట్ల రూపాయిలతో 5 వేల కిలోమీటర్ల మేర సిమెంట్ రోడ్ల నిర్మాణాన్ని చేపట్టాం, ఇప్పటికే మంజూరైన రూ.1475 కోట్ల రూపాయిలకు సంబంధించిన పనులు వెంటనే పూర్తిచేయాలని ముఖ్యమంత్రి అధికారులను కోరడం గమనించాల్సిన విషయం. మరో నాలుగేళ్లలో మొత్తం28 వేల కిలోమీటర్ల మేర సిమెంట్ రహదారులను నిర్మించాల్సివుందని చెప్పారు. వీటికోసం స్థానిక సంస్థలకు13 వ,14వ ఫైనాన్స్ కమిషన్ నుంచి స్థానిక సంస్థలకు వచ్చే నిధులకు నాబార్డ్, మహాత్మా గాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ గ్యారంటీ పథకం (నరేగ) నిధులు జోడించి వచ్చే నాలుగు సంవత్సరాలలో గ్రామాలన్నీ చక్కటి రహదారులతో కళకళలాడేలా చేయాలని నిర్దేశించడం రవాణా సౌకర్యం పెరిగితేనే మరింత అభివృద్ధి బాటలు పడతాయని ఆయన విశ్వసిస్తున్నారు.

### కార్యాచరణకి సర్వం సన్నద్ధం: అయ్యన్న

రాష్ట్రంలోని పంచాయితీలలో29,089 కిలో మీటర్ల మేర ఈ సిమెంటు రోడ్లను నిర్మించేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు ఆదేశాలకు అనుగుణంగా పక్కా ప్రణాళికను రూపొందించుకొని కార్యరంగంలోకి దిగుతున్నామని పంచాయితీరాజ్‌శాఖ మంత్రి అయ్యన్నపాత్రుడు పేర్కొన్నారు. సిమెంటు రోడ్ల ఏర్పాటుకు మొత్తం14,544 కోట్ల రూపాయిలు వ్యయం చేయనున్నామన్నారు. ఈ రోడ్ల ఏర్పాటుతో పాటు గ్రామాలలో ప్రతి ఇంటికి మరుగుదొడ్డి నిర్మాణం అయ్యేలా చర్యలు తీసుకుంటున్నారు. 2019 సంవత్సరం నాటికి ఏ గ్రామంలో బహిరంగ మలవిసర్జన లేకుండా చేయాలన్నది రాష్ట్ర ప్రభుత్వ లక్ష్యంగా పెట్టుకుంది. ఈ రెండు కార్యక్రమాల అమలుకు ప్రభుత్వ విభాగాలలోని వివిధ పథకాలను సమన్వయం చేస్తున్నారు. ఈ బృహత్ ప్రణాళిక అమలుకు ప్రభుత్వంలోని వివిధ విభాగాల ముఖ్య అధికారులతో ఉన్నత స్థాయి సమావేశాన్ని నిర్వహించి మార్గ దర్శకాలు రూపొందించారు.

రోడ్ల నిర్మాణానికి అవసరమైన మానవ వనరుల సమీకరణకు జాతీయ ఉపాధి హామి పథకాన్ని అనుసంధానిస్తారు. సిమెంటు తదితర నిర్మాణ

సామాగ్రికి అవసరమైన నిధులను14 వ ఆర్థిక సంఘం నుంచి గ్రాంటు పొందేందుకు ప్రయత్నిస్తున్నారు. యంత్ర సామాగ్రిని స్వయం సహాయక బృందాల నుంచి అద్దె ప్రాతిపదికన పొందేలా కార్యక్రమాన్ని రూపొందించారు. ఈ బృందాలకు యంత్ర సామాగ్రికి కొనుగోలుకు బ్యాంకు రుణం అందేలా ప్రభుత్వం చూస్తుంది. దీని వలన స్వయం సహాయక బృందాలు కూడా ఆర్థిక ప్రగతిని సాధిస్తాయి. ఈ రోడ్ల నిర్మాణాన్ని పంచాయితీరాజ్ ఇంజినీరింగ్ విభాగం పూర్తిగా పర్యవేక్షిస్తుంది. ఎక్కడ ఎలాంటి అవతవకలు లేని, నాణ్యతా ప్రమాణాలకు లోపం లేకుండా ఈ విభాగ అధికారులు చూస్తారు. ఈ నిర్మాణ పనులకు ఇసుక కొరత లేకుండా ఆయా ఆయా జిల్లా కలెక్టర్లు పర్యవేక్షిస్తారు.

రాష్ట్రంలో మొత్తం55,516 కిలో మీటర్ల అంతర్గత రోడ్లుండగా ఇందులో22,083 కిలోమీటర్ల మేర రోడ్డను పీ. ఎం. జీ .ఎస్. వై, నాబార్డ్ , ఏసిడిపి, గ్రామపంచాయితీ, జన్మభూమి నిధులతో నిర్మించారు. ఇంకా33,533 కిలోమీటర్ల రోడ్డును నిర్మించాల్సి ఉంది. ప్రస్తుతం అందుబాటులో ఉన్న 2 వేల కోట్ల రూపాయిల నిధులను ఉపయోగించి మార్చిలోగా4,444 కిలోమీటర్ల మేర అంతర్గత రోడ్డులు నిర్మించాలని ప్రభుత్వం ఆదేశించింది. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో అనుకున్న లక్ష్యం పూర్తియితే , రాబోయే నాలుగేళ్లలో ఇంకా29,089 కిలో మీటర్ల మేర రోడ్ల నిర్మాణం పూర్తి చేయాల్సి ఉంటుంది. ఇందుకోసం14,544 కోట్ల రూపాయిల ఖర్చవుతుందని అధికారులు అంచనా వేశారు.

### నిధుల సమీకరణ

నాబార్డ్ నుంచి సంవత్సరానికి వెయ్యి కోట్ల రూపాయిల చొప్పున నాలుగేళ్లకు రూ.4 వేల కోట్లు, జాతీయ గ్రామీణ ఉపాధి హామి పథకం నుంచి రూ.4 వేల కోట్లు, 14 వ ఆర్థిక సంఘం నుంచి సంవత్సరానికి రూ.500 కోట్ల చొప్పున రూ.2 వేల కోట్లు, స్టేట్ ఫైనాన్స్ కమిషన్ నుంచి సంవత్సరానికి రూ.100 కోట్ల చొప్పున రూ.400 కోట్లు వస్తాయని పంచాయతీరాజ్ శాఖ అధికారులు పేర్కొన్నారు. అంటే నాలుగేళ్లలో 10,400 కోట్ల రూపాయిలు అందుబాటులో ఉంటాయి. ఇవికాక ఇంకా 4,100 కోట్ల రూపాయిల నిధుల కొరత ఉంటుంది. ఈ నిధులను స్మార్ట్ విలేజ్- స్మార్ట్ వార్డ్ పార్టనర్ల, ఎన్ ఆర్ ఐ ల ద్వారా సేకరించే ఆలోచనలో ప్రభుత్వం ఉంది. ఈ రోడ్ల ఏర్పాటు పూర్తయితే రాష్ట్రంలో పక్కా రోడ్డు లేని గ్రామం అంటూ ఉండదన్న భరోసా ఏర్పడుతోంది. గ్రామాల్లో ప్రభుత్వం పెద్దఎత్తున చేపట్టిన సిమెంట్ రోడ్ల నిర్మాణంపై ప్రజల నుంచి సంతోషం వ్యక్తమవుతోంది. వచ్చే మూడు, నాలుగేళ్లలో రహదారుల నిర్మాణం పూర్తి చేయాలని లక్ష్యాన్ని నిర్దేశించుకోవడాన్ని ప్రజలు స్వాగతిస్తున్నారు.

- బత్తినేని మురళీమోహన్ రావు,
ఎమ్మెల్సీ,
పంచాయతీరాజ్‌శాఖ

స్మార్ట్ సిటీ ఛాలెంజ్ పోటీ

## దేశంలో ఎంపికైన 20 స్మార్ట్ సిటిల్లో వైజాగ్, కాకినాడ

స్మార్ట్ సిటీ ఛాలెంజ్ పోటీలో నెగ్గి ఎంపికైన 20 స్మార్ట్ సిటీలలో ఆంధ్రప్రదేశ్ నుంచి వైజాగ్, కాకినాడ ఉండటం విశేషం. స్మార్ట్ సిటీ ఛాలెంజ్ పోటీలో ఎంపికై, కేంద్ర ప్రభుత్వం అభివృద్ధి చేయబోయే 20 స్మార్ట్ సిటీల వివరాలను కేంద్ర పట్టణాభివృద్ధిశాఖ మంత్రి ఎం.వెంకయ్యనాయుడు ఇటీవల వెల్లడించారు. నిరంతర విద్యుత్, నీటి సరఫరా, వేగవంతమైన రవాణా వ్యవస్థ, అవినీతి రహిత సత్వర సేవలు, కాలుష్య రహిత పరిసరాలు వంటి అంశాల ప్రాతిపదికన ఈ పోటీ జరిగింది.

స్మార్ట్ సిటీ ఛాలెంజ్ పోటీలో 100 పట్టణాలు పోటీపడ్డాయి. ఈ పోటిని దృష్టిలో ఉంచుకొని ఆంధ్రప్రదేశ్ ప్రతిపాదనలు రూపొందించడం, దాని ఫిలితంగా వైజాగ్, కాకినాడా నగరాలు- ప్రాధాన్యతా క్రమంలో 8,9 స్థానాలు కైవసం చేసుకోవడం విశేషం. రాష్ట్రంలో రెండు నగరాలు స్మార్ట్ సిటీలుగా ఎంపిక కావడంపై రాష్ట్ర మంత్రి గంటా శ్రీనివాసరావు హర్షం వ్యక్తం చేస్తూ, స్మార్ట్ సిటీ నిబంధనలను తు.చ తప్పక పాటించడం ద్వారా పారదర్శకంగా ప్రతిపాదనలను రూపొందించిన ఫీలితమిదని వ్యాఖ్యానించారు.

పోటీలో పాల్గొన్న నగరాలు, వాటి అభివృద్ధికి రూపొందించిన వ్యూహం, దాని నాణ్యత, స్వచ్ఛ భారత్ మిషన్‌లో సాధించిన ప్రగతి, మున్సిపల్ సిబ్బందికి సకాలంలో జీతాలు చెల్లించటం, సమాచార, సమస్యల పరిష్కార వ్యవస్థ, ఈ-న్యూస్ లెటర్ల ద్వారా సమాచారాన్ని అందించటం- వంటి అంశాలు క్షుణ్ణంగా పరిశీలించారు. ఆర్థికంగా స్వయం సమృద్ధి సామర్థ్యం, సంస్థాగత వ్యవస్థలు - వాటి సామర్థ్యం, ప్రస్తుతం ఉన్న సేవల స్థాయి, మూడేళ్లకు గాను ప్రణాళికా బద్ధమైన చర్యలను పరిశీలించి, ఒక్కో దానికి 25 శాతం చొప్పున మార్కులు కేటాయించారు. సంస్కరణల అమలులో గతంలో ఉన్న అనుభవానికి 15 శాతం, విజన్ డాక్యుమెంట్ నాణ్యతకు 10 శాతం మార్కులిచ్చారు.

కేంద్రం ప్రకటించిన స్మార్ట్ సిటీలు ప్రాధాన్యతా క్రమంలో:

- భువనేశ్వర్ (ఒడిశా)
- పుణె (మహారాష్ట్ర)
- జయపుర (రాజస్థాన్)
- సూరత్ (గుజరాత్)
- కోచి (కేరళ)
- జబల్‌పూర్ (మధ్యప్రదేశ్)
- న్యూఢిల్లీ మున్సిపల్ కౌన్సిల్
- **విశాఖపట్నం (ఆంధ్రప్రదేశ్)**
- **కాకినాడ (ఆంధ్రప్రదేశ్)**
- షోలాపూర్(మహారాష్ట్ర)
- కోయంబత్తూర్ (తమిళనాడు)
- బెళగావి (కర్ణాటక)
- దావణగెరె (కర్ణాటక)
- అహ్మదాబాద్ (గుజరాత్)
- గువహటి (అస్సోం)
- చెన్నై (తమిళనాడు)
- లూథియానా (పంజాబ్)
- భోపాల్ (మధ్యప్రదేశ్)
- ఉదయ్‌పూర్ (రాజస్థాన్)
- ఇండోర్ (మధ్యప్రదేశ్)

❖

# నవ్యాంధ్ర రాజధానికి భారీ ప్రాజెక్టుల నజరాన



నవ్యాంధ్ర రాజధాని చుట్టూ పెద్ద ఎత్తున ప్రాజెక్టులు రానున్నాయి. రింగురోడ్లు, వంతెనలు, ఆస్పత్రులు, ఫ్లైఓవర్లు, ఎయిర్‌పోర్టు టెర్మినళ్లతో అమరావతి చుట్టుపక్కల ప్రాంతం కళకళలాడనుంది.

రాజధానిగా మారిన కృష్ణా,గుంటూరు జిల్లాల్లో ఏడాదిన్నరలో అన్నీ భారీ ప్రాజెక్టులు ప్రాణం పోసుకున్నాయి. ఏళ్ల నాటి ప్రజల కలల సాకారం చేస్తూ తొలి అడుగులు పడ్డాయి. వేలకోట్ల అభివృద్ధి ప్రణాళికలు,పనులు పట్టాలెక్కుతున్నాయి. కొన్ని పనులు సాగుతుండగా మరి కొన్ని టెండర్ల దశలో వున్నాయి. ఈ ప్రాజెక్టులు పూర్తయితే ప్రజల ప్రధాన సమస్యలు పరిష్కారం కానున్నాయి.

### రింగు రోడ్డుకు రూ.20 వేల కోట్లు

నవ్యాంధ్ర రాజధాని అమరావతి కేంద్రంగా విజయవాడ,గుంటూరులను కలుపుతూ బాహ్యవల రహదారిని నిర్మిస్తున్నారు. 200 కిలోమీటర్ల పొడవు 150 మీటర్ల వెడల్పుతో రూ.20 వేలకోట్ల అంచనా వ్యయంతో రింగు రోడ్డును నిర్మిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం దీనికి అవసరమైన భూమి అప్పగించిన వెంటనే పనులు ప్రారంభించి పదేళ్లలో పూర్తిచేస్తామని కేంద్రమంత్రి గడ్కరీ ప్రకటించారు. ఈ రహదారి హైదరాబాద్, చెన్నై, విశాఖపట్నాలకు వెళ్ళే అనుసంధాన మార్గాలకు సులభంగా చేరుకునేందుకు ఉపయోగపడనుంది. ఏపీ క్యాపిటల్ రీజియన్(ఏపీసీఆర్)లో 35 శాతం ట్రాఫిక్‌ను బాహ్య వలయ రహదారిగా వెళ్లనుంది.

### మెట్రో రైల్ నిర్మాణానికి రూ.6,789 కోట్లు

నవ్యాంధ్ర రాజధాని విజయవాడలో అంతకంతకూ తీవ్రమవుతున్న ట్రాఫిక్‌ను నియంత్రించేందుకు మెట్రో రైలు తప్పనిసరి. ఈ పరిస్థితుల్లో మెట్రో రైళ్లు నడపడం ద్వారా రహదారులపై రద్దీ తగ్గించాలని రాష్ట్ర ప్రభుత్వం మెట్రో రైలును ప్రతిపాదించింది. 26.03 కిలోమీటర్ల దూరాన్ని రెండు కారిడార్లుగా ఆరు భాగాలుగా నిర్మించనున్నారు. దీన్ని డిల్లీ మెట్రో రైలు కార్పొరేషన్(డిఎంఆర్సి)ఈ ప్రాజెక్టు ప్రణాళికను రూపొందించింది. మెట్రో రైలు నిర్మాణానికి రూ.6789 కోట్లు ఖర్చు చేయనున్నారు. ఈ ఏడాది ఫిబ్రవరిలో పనులు ప్రారంభించి 2018 డిసెంబర్ నాటికి దీనిని పూర్తి చెయ్యాలని లక్ష్యంగా పెట్టుకున్నది రాష్ట్ర ప్రభుత్వం.

### బెంజిసర్కిల్ పై వంతెన నిర్మాణానికి రూ.1525 కోట్లు

బెంజిసర్కిల్ నుంచి నిర్మలా కాన్వెంట్ వరకు పై వంతెన నిర్మాణం,విజయవాడ-బందరు రోడ్డు విస్తరణ చేపట్టనున్నారు. మొత్తం 622 మీటర్లు ఫ్లై ఓవరు,64 కిలోమీటర్లు 4 వరుసల రహదారి నిర్మించనున్నారు. దీనికి మార్చిలో పనులు ప్రారంభించి 2 ఏళ్లలో పూర్తి చెయ్యాలని లక్ష్యంగా పెట్టుకున్నది రాష్ట్ర ప్రభుత్వం. దుర్గగుడి పై వంతెన ప్రారంభించిన రోజునే దీనికి శంకుస్థాపన జరిగింది. దశాబ్దంపైగా బెంజిసర్కిల్ పై వంతెన కోసం ప్రయత్నాలు జరిగాయి. గతంలో రూ.60 కోట్లతో పై వంతెన నిర్మాణానికి టెండర్ల దశకు చేరుకొని ఆగిపోయింది. ఇప్పటికీ ఈ ప్రాజెక్టు పట్టాలెక్కింది.

### దుర్గ గుడి వంతెన నిర్మాణానికి రూ.447 కోట్లు

విజయవాడ కనకదుర్గగుడి ఫ్లై ఓవర్ నిర్మించాలని రెండు దశాబ్దాల నుంచి ఆందోళనలు జరిగాయి. ఎట్టకేలకు ఫ్లై ఓవర్ నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం నిధులు మంజూరు చేసింది. ఆరు వరుసల పై

వంతెన కింద నాలుగు వరుసల రహదారి నిర్మించనున్నారు. 2.5 కిలోమీటర్ల ఫ్లై ఓవరు,5 కిలోమీటర్ల రహదారి నిర్మిస్తున్నారు. దీనిని ఈ ఏడాది ఆగస్ట్ నాటికి పూర్తిచెయ్యాలని ప్రభుత్వ లక్ష్యం. ఆరు వరుసల పై వంతెనను భవానీపురం నుంచి రాజీవ్ గాంధీ పార్కు వరకు కింది నాలుగు వరుసల రహదారిని భవానీపురం నుంచి రాణి గారి తోట పై వంతెన వరకు 5 కిలోమీటర్ల దూరం విస్తరించనున్నారు.

### మంగళగిరిలో ఎయిమ్స్ నిర్మాణానికి రూ.1618 కోట్లు

అఖిల భారత వైద్య,విజ్ఞాన సంస్థ నిర్మాణానికి పునాదిరాయి పడింది. దీనిని 193 ఎకరాల్లో, రూ.1618 కోట్లు ఖర్చు చేసి 3 ఏళ్లలో దీని నిర్మాణం పూర్తి చేయనున్నారు. మంగళగిరిలోని క్షయ ఆసుపత్రి(టీబీ సానిటోరియమ్) విస్తరించిన ప్రాంతంలో ఏర్పాటు చేస్తున్నారు. దేశంలో వున్న అన్ని ఎయిమ్స్ భవనాల్లో కల్లా ఇది అత్యాధునికమైన డిజైన్. 900 పడకల సామర్థ్యంతో దీన్ని నిర్మిస్తున్నారు. యుజీ,పీజీ వైద్య,విద్య అందుబాటులో వుంటుంది. మెంత్తం 100 సీట్లు వుండనున్నాయి. వచ్చే విద్య సంవత్సరం నుంచే ఇక్కడ వైద్య,విద్య అందుబాటులోకి రానుంది. వైద్య సేవలు,బోధన రెండు ఒకే చోట లభ్యం కావటం వల్ల ఉత్తమమైన వైద్య సేవలు,నాణ్యమైన విద్య అందించనున్నారు.

### వ్యవసాయ విశ్వ విద్యాలయానికి రూ.1505 కోట్లు

గుంటూరు జిల్లా లాంలో ఆచార్య ఎంజీ రంగా విశ్వవిద్యాలయ నిర్మాణానికి పునాదిరాయి పడింది. దీనిని రానున్న ఐదేళ్లలో రూ.1505 కోట్ల ఖర్చుతో పూర్తి చేయనున్నారు. పరిశోధనా సంస్థలు,పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులు,ప్రయోగశాలలు,ఆహార శుద్ధి,విత్తనాభివృద్ధి సంస్థలు ఇక్కడికి రానున్నాయి. రైతులకు ఆధునిక సాంకేతిక పద్ధతులు అందుబాటులోకి వచ్చి తక్కువ ఖర్చుతో అధిక దిగుబడులు సాధించడానికి అవకాశాలు మెరుగుపడనున్నాయి.

### 460 ఎకరాల్లో ఆగిరిపల్లిలో మెగా ఫుడ్ పార్క్

రైతులు పండించే పంటఉత్పత్తులను శుద్దీకరణ చేయటం ద్వారా వాటికి గిరాకీ పెంచాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇందులో భాగంగా ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక సదుపాయాల కల్పన సంస్థ (ఏపీఐఐసీ)అధ్వర్యంలో మెగా ఫుడ్ పార్క్ నెలకొల్పేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు. ఆగిరిపల్లి మండలం తోటపల్లి సర్వే నంబర్ 2/1 లో 400 ఎకరాలను ఏపీఐఐసీ గుర్తించింది. కేంద్రప్రభుత్వం దీనికి ఇప్పటికే రూ.50 కోట్లు మంజూరు చేసింది. ఈ ప్రాంతం గన్నవరం విమానాశ్రయానికి దగ్గరగా వుండటంతో ఇక్కడ ప్రాసెసింగ్ చేసిన ఆహారోత్పత్తులను సులభంగా ఇతర దేశాలకు తరలించే వీలుండటంతో ఈ ప్రాంతాన్ని ఎంపిక చేశారు. ఈ ప్రాంతానికి 50 వరకు ఫుడ్ ప్రాసెసింగ్ యూనిట్లు రానున్నాయి.

### గన్నవరం విమాన టెర్మినల్ భవనానికి రూ.137 కోట్లు

గన్నవరం విమానాశ్రయం నుంచి అంతర్జాతీయ విమాన సర్వీసులు నడపాలంటూ దశాబ్దాలుగా ఈ ప్రాంత ప్రజలు కోరుకుంటున్నారు. నేడు వారి చిరకాల వాంఛ సాకారం కాబోతుంది. అనూహ్యంగా పక్కన రాజధాని ఏర్పాటు కాబోతుండటంతో గన్నవరం విమానాశ్రయానికి ప్రాధాన్యం పెరిగింది. నిత్యం 22 సర్వీసులు తిరుగుతూ 2000 మంది వరకు ప్రయాణికులు రాకపోకలు సాగిస్తున్నారు. విఐపి,వివిఐపిల తాకిడి గత ఏడాదిగా పెరిగింది. విదేశాలకు వెళ్లాలంటే నేటికీ హైదరాబాద్,చెన్నై వంటి నగరాలకు వెళ్ళి అక్కడ మరో విమానం మారాల్సి వస్తుంది. దీంతో అత్యవసరంగా అంతర్జాతీయ టెర్మినల్ నిర్మించాలని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది. వెంటనే కేంద్ర విమానయానశాఖ స్పందించి రూ.137 కోట్లను మంజూరు చేసింది. ఇది అందుబాటులోకి వస్తే గంటకు 500 మంది ప్రయాణికులు రాకపోకలు సాగించే వీలుంది. ప్రస్తుతం ఏడాదికి 1.4 లక్షల మంది రాకపోకలు సాగిస్తుండగా నూతన భవన నిర్మాణం పూర్తయితే 10 లక్షల మంది రాకపోకలు సాగించే అవకాశం వుంది. 2016 డిసెంబర్ నాటికి నూతన భవన నిర్మాణం పూర్తిచెయ్యాలని రాష్ట్ర ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకున్నది.

– పెరుమాళ్ల నాగరాజు
ఎమ్మెల్యే

# నవ్యాంధ్రలో క్రీడావిశ్వవిద్యాలయం ఏర్పాటు



నవ్యాంధ్రప్రదేశ్‌లో అంతర్జాతీయ ప్రమాణాలతో క్రీడా విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయడానికి కృషి చేస్తున్నట్లు ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు తెలిపారు. దావోస్ పర్యటన విజయవంతంగా ముగించుకుని తిరిగి రాష్ట్రానికి చేరుకున్న సందర్భంగా విజయవాడలో ముఖ్యమంత్రిని ఏపీ క్రీడాప్రాధికార సంస్థ ఛైర్మన్ పిఆర్ మోహన్ కలిసి పుష్పగుచ్ఛం ఇచ్చి అభినందనలు తెలిపారు. దావోస్‌లో క్రీడా మైదానాల నిర్మాణం, క్రీడల అభివృద్ధిపై ప్రత్యేకంగా చర్చించినందుకు ముఖ్యమంత్రికి కృతజ్ఞతలు తెలిపారు. ఈ సందర్భంగా ముఖ్యమంత్రి చంద్రబాబు మాట్లాడుతూ రాష్ట్రంలో క్రీడాకారులను మరింత ప్రోత్సహించాలన్న లక్ష్యంతో కొత్తగా క్రీడా విశ్వవిద్యాలయాన్ని నిర్మించేందుకు కృషి చేస్తున్నట్లు తెలిపారు. నూతన రాజధాని అమరావతిలో క్రీడా సముదాయాల కోసం 12 వందల ఎకరాలు కేటాయించామని, తిరుపతిలో రూ.300కోట్ల ఖర్చుతో క్రీడా సముదాయాలు ఏర్పాటు చేస్తున్నామన్నారు.

శాప్ ఛైర్మన్ పిఆర్ మోహన్ మాట్లాడుతూ అంతర్జాతీయ ప్రమాణాలతో దేశంలోనే ప్రప్రథమంగా క్రీడా విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేస్తున్న ఘనత ముఖ్యమంత్రి చంద్రబాబుకే దక్కుతుందని వ్యాఖ్యానించారు.



## అవార్డులు - రివార్డులు

- గణతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకుని కేంద్రం ప్రకటించిన పద్మ అవార్డులు పలువురు తెలుగు ప్రముఖులకు దక్కాయి. ఈనాడు సంస్థల అధినేత రామోజీరావుకు పద్మవిభూషణ్ లభించింది. క్రీడాకారిణులు సానియా మీర్జా, సైనా నెహ్వాల్ లకు, సాహితీవేత్త యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్, ప్రముఖ వైద్యులు డాక్టర్ నాగేశ్వర్ రెడ్డిలకు పద్మభూషణ్ అవార్డులు వచ్చాయి. బాహుబలి దర్శకుడు యస్ యస్ రాజమౌళికి పద్మశ్రీ దక్కింది. ఈ ఏడాది ప్రకటించిన మొత్తం 118 పద్మ అవార్డుల్లో 10 మందికి పద్మవిభూషణ్, 19 మందికి పద్మభూషణ్ అవార్డులు, మిగిలిన వారికి పద్మశ్రీ ప్రకటించారు.
- బాలీవుడ్ నటి ప్రియాంక చోప్రా ప్రతిష్టాత్మక పీపుల్ చాయిస్ అవార్డును అందుకున్నారు. ఈ అవార్డును అందుకున్న మొట్టమొదటి భారతీయ నటిగా ఆమె ఘనత సాధించారు.
- ప్రతిష్టాత్మక రాయల్ ఫొటోగ్రఫిక్ సొసైటీ అవార్డుకు హైద్రాబాద్ కు చెందిన ఫొటోగ్రాఫర్ శ్రీవారి భార్గవ ఎంపికయ్యారు.
- తెలంగాణ ఉప ముఖ్యమంత్రి మహమూద్ అలీకి ప్రపంచ శాంతి శ్రేయస్సు 2016 అవార్డు లభించింది.
- ఫిఫా అందించే ప్రతిష్టాత్మక బాలన్ డిఓర్ అవార్డును అర్జెంటీనా స్టార్ లియోనల్ మెస్సీ ఐదోసారి అందుకున్నాడు.
- ప్రముఖ సినీ రచయిత గూడ అంజయ్య 2016 సంవత్సరపు కొమరం భీమ్ జాతీయ పురస్కారానికి ఎంపికయ్యారు.
- సతీష్ ధావన్ స్పేస్ సెంటర్ (షార్) మాజీ డైరెక్టర్ ఎం.వై.ఎస్.ప్రసాద్‌కు విక్రమ్ సారాబాయ్ అవార్డు లభించింది.
- 2015 లోకమాన్య తిలక్ నేషనల్ జర్నలిజం అవార్డుకు సీనియర్ జర్నలిస్టు శేఖర్ గుప్తా ఎన్నికయ్యారు.
- అల్లురామలింగయ్య కళాపీఠం జాతీయ పురస్కారం 2015ను దర్శకేంద్రుడు కె.రాఘవేంద్రరావు స్వీకరించారు.

## నియామకాలు

- ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మహిళా కమిషన్ చైర్‌పర్సన్‌గా మాజీ ఎమ్మెల్సీ నన్నపనేని రాజకుమారిని నియమిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఐదేళ్ళ పాటు నన్నపనేని రాజకుమారి ఈ పదవిలో కొనసాగనున్నారు.
- ఇజ్రాయెల్‌లో భారత్ రాయబారిగా 1990 బ్యాచ్ ఐఎఫ్ఎస్ బ్యాచ్ అధికారి పవన్ కపూర్‌ను ప్రభుత్వం నియమించింది.
- రాష్ట్ర ప్రభుత్వ కొత్త ప్రధాన కార్యదర్శిగా 1981వ బ్యాచ్ ఐఏఎస్ అధికారి సత్యప్రకాశ్ టక్కర్ నియమితులు కానున్నారు. ప్రస్తుత ప్రభుత్వ కార్యదర్శి ఐ.వై.ఆర్. కృష్ణారావు పదవీ విరమణ సందర్భంగా ఆయన స్థానంలో ప్రణాళిక శాఖ ప్రత్యేక ప్రధాన కార్యదర్శిగా పని చేస్తున్న టక్కర్‌ను నియమించాలని ప్రభుత్వం నిర్ణయించింది.
- ఆంధ్రప్రదేశ్ పోస్టల్ సర్కిల్ చీఫ్ పోస్ట్ మాస్టర్ జనరల్‌గా ఉత్తరప్రదేశ్‌కు చెందిన వైపీ రాయ్ నియమితులయ్యారు.
- తెలంగాణ మెడికల్ కౌన్సిల్ చైర్మన్‌గా డా.రవీందర్ రెడ్డి నియమితులయ్యారు.

### ఫిబ్రవరిలో ముఖ్యమైన రోజులు

| | |
|---|---|
| తపాలా, బీమా, కోస్ట్‌గార్డ్ దినోత్సవం | 1 |
| దామెర్ల రామారావు వర్ధంతి | 6 |
| ఘంటసాల వర్ధంతి | 10 |
| జాతీయ ఉత్పాదక దినోత్సవం | 12 |
| సరోజిని నాయుడు జయంతి | 13 |
| దామోదరం సంజీవయ్య జయంతి | 14 |
| పాలగుమ్మి పద్మరాజు వర్ధంతి | 17 |
| రామకృష్ణ పరమహంస జయంతి | 18 |
| అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం | 21 |
| మాడపాటి జయంతి | 22 |
| చంద్రశేఖర్ ఆజాద్ వర్ధంతి | 27 |
| మాండలిన్ శ్రీనివాస్ జయంతి | 28 |

- తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు చెందిన ఎస్ఎంఈ చాంబర్స్‌కు సలహాదారుగా అజయ్‌కుమార్ అగర్వాల్ నియమితులయ్యారు.

## రాష్ట్రీయం

- రాజమండ్రి పేరును రాజమహేంద్రవరంగా మారుస్తూ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం గెజిట్ విడుదల చేసింది. రాజరాజనరేంద్రుడు పరిపాలన కాలంలో ఏర్పడిన రాజమహేంద్రవరం బ్రిటిష్ పాలనలో రాజమండ్రిగా మార్పు చెందింది.
- అధునాతన సౌకర్యాలున్న అమరావతి బస్సు సర్వీసుల్ని విజయవాడలోని పండిట్ నెహ్రూ బస్ స్టేషన్ నుంచి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రారంభించారు.
- కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ, కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం సంయుక్తంగా నిర్వహించిన మూడు రోజుల సదస్సులో మొత్తం 328 అవగాహన ఒప్పందాలు కుదిరాయని, తద్వారా రూ. 4.67 లక్షల కోట్లు పెట్టుబడి పెట్టడానికి ఇన్వెస్టర్లు ఆసక్తి చూపించారని ప్రభుత్వం ప్రకటించింది.
- రాష్ట్రంలో ఫిబ్రవరి 1 నుంచి కొత్త మైనింగ్ పాలసీని అమలులోకి తీసుకొస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. అర్హత ఉన్నవారందరికీ గనుల లీజులు ఈ సందర్భంగా మంజూరు చేయనున్నట్లు ప్రకటించింది.
- సర్టిఫికెట్లు, డాక్యుమెంట్లపై ఇక నుంచి గెజిటెడ్ అధికారుల ధ్రువీకరణ అవసరం లేదు. కేంద్ర ప్రభుత్వం పరిపాలన సంస్కరణల్లో భాగంగా చేసిన సూచనల మేరకు రాష్ట్ర ప్రభుత్వం కూడా గెజిటెడ్ ఆఫీసర్ల ధ్రువీకరణ విధానాన్ని తొలగించింది. ఈ క్రమంలో స్వయం ధ్రువీకరణ పత్రాలు సమర్పిస్తే సరిపోతుందని నిర్ణయం తీసుకుంది.
- పర్యాటక రంగంలో చిత్తూరు జిల్లాకు మొదటి ర్యాంకు వచ్చింది. దేవాలయాలు, సాంస్కృతిక కేంద్రాలు, పర్యాటక ప్రదేశాలకు వచ్చిన వారి సంఖ్య ఆధారంగా ప్రభుత్వం ఈ ర్యాంకులు కేటాయించింది. 2015లో చిత్తూరు జిల్లాకు అత్యధిక పర్యాటకులు రాగా, తూర్పుగోదావరి జిల్లా రెండో స్థానంలో నిలిచి రెండో ర్యాంకును సాధించింది. మూడో స్థానంలో కృష్ణా, నాలుగో స్థానంలో విశాఖ జిల్లాలు నిలిచాయి.
- బోధనాంశాలు, శిక్షణ వ్యవహారాలలో పరస్పరం సహకరించుకోవాలని ఆచార్య ఎన్జీ రంగా వ్యవసాయ విశ్వ విద్యాలయం, అమెరికాలోని కాన్సాస్ విశ్వ విద్యాలయాలు నిర్ణయించాయి.
- హోంగార్డుల గౌరవ వేతనాన్ని రోజుకు రూ.400 పెంచుతున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఈ పెంపుదల ఏప్రిల్ నెల నుంచి అమలులోకి వస్తుంది.
- రాష్ట్రంలో ఫైబర్‌నెట్ వర్క్ ప్రాజెక్టు పూర్తయిన తరువాత ప్రతి గ్రామ పంచాయతీలో ప్రతిరోజూ గంటపాటు ఉచితంగా వైఫైను అందుబాటులో ఉంచనున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది.
- జనవరి 16 నుంచి హెల్త్ కార్డులపై ఉద్యోగులకు పరిమితి లేని వైద్యం అందించాలని ప్రభుత్వం ఆదేశించింది.
- గుంటూరు జిల్లా వెలగపూడిలో తాత్కాలిక సచివాలయ నిర్మాణం చేపడుతున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. వెలగపూడిలోని 205,206,207, 208, 214 సర్వే నెంబర్లలో తాత్కాలిక సచివాలయం వస్తుందని, 26 ఎకరాల్లో ఆరు లక్షల చదరపు అడుగుల్లో సచివాలయ నిర్మాణం చేపట్టనున్నట్లు ప్రకటించింది.
- ప్రభుత్వ స్థలాలను ఆక్రమించి ఇళ్లు కట్టుకున్న వారికి గరిష్టంగా 500 గజాల వరకు

క్రమబద్ధీకరించాలని ప్రభుత్వం సూత్రప్రాయంగా నిర్ణయించింది. 2014 జనవరి ఒకటో తేదీని కటాఫ్ తేదీగా నిర్ణయించింది. అంటే 2014 జనవరి ఒకటో తేదీ నాటికి ప్రభుత్వ స్థలాల్లో నివాసాలు ఏర్పాటు చేసుకున్న వారికి మాత్రమే ఇది వర్తిస్తుంది.

- పదవీ విరమణ సమయంలో ఉద్యోగులకు చెల్లించే గ్రాట్యుటీ పరిమితిని రూ. 12 లక్షలకు పెంచుతూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.
- ఇకపై కొనుగోలు చేసే కొత్త వాహనానికి నేరుగా శాశ్వత సంఖ్య (పర్మనెంట్ నంబర్) రానుంది. టెంపరరీ నెంబర్ ఇచ్చే విధానానికి రవాణా శాఖ స్వస్తి పలకనుంది. ఫిబ్రవరి నుంచి కొత్త విధానాన్ని అమల్లోకి తీసుకురానున్నట్లు రవాణా శాఖ ప్రకటించింది.
- రాష్ట్రంలో కొత్తగా నాలుగు వైద్య కళాశాలలు ఏర్పాటు కానున్నాయి. ఇవన్నీ ప్రయివేటు వైద్య కళాశాలలే. వీటిలో చిత్తూరు జిల్లాలో రెండు, విశాఖపట్నం జిల్లాలో ఒకటి, కృష్ణా జిల్లాలో ఒక కళాశాల ఉంది. ఒక్కో కళాశాలకు గరిష్ఠంగా 150 ఎంబీబీఎస్ సీట్ల చొప్పున అనుమతి లభించింది. అయితే వీటిని భారతీయ వైద్య మండలి బృందం పరిశీలించి అనుమతించాల్సి ఉంది. నాలుగు కొత్త కళాశాలల వల్ల రాష్ట్రంలో 600 ఎంబీబీఎస్ సీట్లు రానున్నాయి.
- రాష్ట్రంలో ప్రతి ఇంటికి వీడియో కాన్ఫరెన్సు సౌకర్యం కల్పించాలన్న లక్ష్యంతో పని చేస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. దీనికోసం రూ. 500 కోట్లు ఖర్చు చేయనున్నట్లు ప్రకటించింది.
- ప్రభుత్వం ఫ్లెమింగో పక్షుల పండుగను రాష్ట్ర ప్రభుత్వ పండుగగా గుర్తించింది.

## వార్తలు.. విశేషాలు

- మద్యం సేవించి వాహనం నడపలేని స్థితిలో ఉన్నవారిని ఇంటి వద్ద సురక్షితంగా దించేందుకు ఉద్దేశించిన మిషన్ స్మార్ట్ డ్రైవ్ కార్యక్రమాన్ని తెలంగాణ ప్రభుత్వం ప్రారంభించింది.
- తెలంగాణ మెడికల్ కౌన్సిల్ ఏర్పాటైంది.
- మెదక్ జిల్లా ములుగు మండల కేంద్రంలో రూ. 1,823 కోట్ల వ్యయంతో నిర్మించే హార్టికల్చర్ యూనివర్శిటీకి జనవరి 7న శంకుస్థాపన జరిగింది.
- చిరుజీతగాళ్ళయిన సుమారు రెండు వేల మంది ఆరోగ్యమిత్ర ఉద్యోగులను ప్రభుత్వం తొలగిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది.
- త్వరలో ప్రభుత్వాసుపత్రులకు అడ్మినిస్ట్రేటర్లు లేదా మేనేజర్ల పేరుతో ప్రయివేటు పాలకులు రానున్నారు. ఎంబీఏ కనీస విద్యార్హతగా తొలి దశలో 16 ఆస్పత్రులకు వీరిని తీసుకోవాలని సర్కారు నిర్ణయించింది.
- విశాఖలో వైద్య పరికరాల ఉత్పత్తి కేంద్రం (మెడికల్ డివైజెస్ టెక్నాలజీ మాన్యుఫాక్చరింగ్ పార్క్) ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం నిర్ణయించింది.
- విశ్వంలో ఉన్న ఇతర గ్రహాల అన్వేషణ కోసం అమెరికా అంతరిక్ష పరిశోధన సంస్థ నాసా ప్రయోగించిన కెప్లర్ హ్యోమనౌక కొత్త గ్రహాలను కనుగొంది. వేరే నక్షత్రాల చుట్టూ తిరుగుతున్న 100కు పైగా గ్రహాలను తన రెండో దశలో కెప్లర్ (కె2 మిషన్) గుర్తించింది.
- ప్రకాశం జిల్లాలో 200 ఏళ్ళ కిందటి నాటి తాళపత్ర గ్రంథాలు లభించాయి. జిల్లాలోని కనిగిరి ప్రాంతంలో ఇవి లభించాయి.
- గాయకుడిగా 50 ఏళ్ళు పూర్తి చేసుకున్న ప్రముఖ గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యంను ప్రధాని ఢిల్లీలో సత్కరించారు.
- బోయకొట్టములు పండ్రెండు రచయిత కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై కన్నుమూశారు.
- బీజేపీ సీనియర్ నేత, సిక్కిం మాజీ గవర్నర్ వి.రామారావు(80) హైద్రాబాద్‌లో అనారోగ్యంతో కన్నుమూశారు.
- డీఈడి మొదటి సంవత్సరం పరీక్షల సవరణ షెడ్యూలును ప్రభుత్వం ప్రకటించింది. ఈ పరీక్షలు ఫిబ్రవరి 3వ తేదీ నుంచి 8వ తేదీ వరకు జరుగుతాయని ప్రకటించింది.
- భాషా పండితులు, వ్యాయామ ఉపాధ్యాయుల పోస్టులను దశల వారీగా అప్‌గ్రేడ్ చేయాలని ఆర్థిక శాఖ ఆమోదం తెలిపింది.
- సాంకేతిక సర్టిఫికెట్ కోర్సు పరీక్షల షెడ్యూల్‌ని ప్రభుత్వం ప్రకటించింది. ఈ పరీక్షలను ఫిబ్రవరి 24 నుంచి 27వ తేదీ వరకు నిర్వహించడానికి నిర్ణయించింది.
- ఉపాధ్యా నియామకాలకు (డీఎస్సీ2014) సంబంధించి ప్రభుత్వ సాధారణ పరిపాలనా శాఖ విద్యా శాఖకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. డీఎస్సీ 2014 నోటిఫికేషన్‌లో పేర్కొన్న 10113 పోస్టుల్లో 8086 పోస్టుల భర్తీకి మార్గం సుగమమైంది.
- ప్రముఖ మెసేజింగ్ యాప్ వాట్సాప్‌ను ఇక ప్రపంచ వ్యాప్తంగా ఉచితంగా వాడుకోవచ్చు. ఏడాదికి వసూలు చేస్తున్న ఒక డాలరు ఫీజును రద్దు చేస్తున్నట్లు ఆ సంస్థ ప్రకటించింది.
- ఖాళీగా ఉన్న మండల విద్యా శాఖాధికారి, డైట్ లెక్చరర్ పోస్టులను గ్రేడ్2 ప్రధానోపాధ్యాయులతో తాత్కాలికంగా భర్తీ చేయడానికి న్యాయశాఖ అనుమతి ఇచ్చింది.
- పఠాన్‌కోట్ ఉగ్రదాడికి బాధ్యులుగా భావిస్తున్న మోస్ట్ వాంటెడ్ ఉగ్రవాది, జైషే మహమ్మద్ చీఫ్ మౌలానా మసూద్ అజర్, అతని సోదరుడు రెహ్మాన్ రవూఫ్‌లను పాకిస్తాన్ ప్రభుత్వం అరెస్టు చేసింది.
- జమ్ము కశ్మీర్ ముఖ్యమంత్రి ముఫ్తీ మొహమ్మద్ సయీద్ (79) న్యూఢిల్లీలో అనారోగ్యంతో కన్నుమూశారు.
- మన పాలపుంత కంటే వెయ్యిరెట్లు పెద్దదైన ఓ భారీ పాలపుంత సమూహాన్ని శాస్త్రవేత్తలు గుర్తించారు. బిగ్ బ్యాంగ్ సంభవించిన దాదాపు 3.8 బిలియన్ సంవత్సరాలకు ఈ పాలపుంత ఏర్పడి ఉండవచ్చని భావిస్తున్నారు.
- విద్యారంగం అభివృద్ధికి ఏకంగా రూ. 27,514 కోట్లు విరాళమిచ్చిన విప్రో అధినేత అజీమ్ ప్రేమ్‌జీ(70) వరుసగా మూడో ఏడాది కూడా భారతీయ దానకర్ణుల్లో అగ్రస్థానంలో నిలిచారు.
- ప్రజాకవి, ప్రముఖ సాహిత్య విమర్శకుడు డాక్టర్ అద్దేపల్లి రామ్ మోహనరావు(80) కన్నుమూశారు.

## జాతీయం

- ప్రపంచ ప్రతిభా పోటీతత్వ సూచీలో భారత్‌కు 89వ స్థానం లభించింది.
- పారామిలటరి దళాలైన సెంట్రల్ రిజర్వ్ పోలీస్ ఫోర్స్ , సెంట్రల్ ఇండస్ట్రియల్ సెక్యూరిటీ ఫోర్సుల్లో కానిస్టేబుల్ స్థాయి నియామకాల్లో ఇకపై మహిళలకు 33 శాతం రిజర్వేషన్ కల్పించనున్నారు.
- కొద్ది కాలంగా విమర్శల పాలవుతున్న సెన్సార్ బోర్డును సంస్కరించేందుకు ప్రసిద్ధ సినిమా దర్శకుడు శ్యామ్ బెనగల్ నేతృత్వంలో ఓ కమిటీని ప్రభుత్వం ఏర్పాటు చేసింది.
- జలాంతర్గామి విధ్వంసక నౌక ఐఎన్ఎస్ కద్మత్ నౌకా దళంలో చేరింది. అత్యంత ఆధునిక పరిజ్ఞానంతో కూడిన సిగ్నల్ వ్యవస్థ దీనిలో ఉంది.
- అతివృష్టి, అనావృష్టి, అకాల వర్షాలు, కరవులతో తల్లడిల్లుతున్న రైతాంగానికి ఊరటనిచ్చే ఉద్దేశంతో ఫసల్ బీమా యోజన పథకాన్ని కేంద్రం ప్రకటించింది. ఈ పథకం కింద ఖరీఫ్ ఆహార ధాన్యాలు, నూనెగింజల పంటలకు బీమా కంపెనీలు నిర్ణయించిన ప్రీమియంలో రైతులు కేవలం రెండు శాతం చెల్లిస్తే సరిపోతుంది.
- నూతన రాజధానికి తరలి వెళ్ళే ఉద్యోగులతో పాటు ఇతరులు, వారి పిల్లలకు స్థానికత కల్పించేందుకు కేంద్ర హోం మంత్రిత్వ శాఖ గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. ఇంజనీరింగ్ విద్యకు ఐఐటీ మాదిరిగా, ఫార్మా విద్యకు ప్రధాన విద్యాసంస్థగా ఉన్న నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫార్మా ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్‌ను విశాఖలో ఏర్పాటు చేయనున్నట్లు కేంద్రం ప్రకటించింది.

– దాసరి దుర్గాప్రసాద్

# మహిళా సాధికారత మరింత చేరువ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మహిళా సాధికారత దిశగా అడుగులు వేస్తోంది. పేదరిక నిర్మూలన లక్ష్యంలో మహిళలను చైతన్యపరచడం ద్వారానే సాధ్యమని రాష్ట్రప్రభుత్వం భావిస్తోంది. ముఖ్యంగా అణగారిన సామాజిక వర్గాలు అన్ని విధాలుగా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, మానసిక అవరోధాల నుంచి బయటపడినప్పుడే మహిళా సాధికారత, పేదరిక నిర్మూలన సాధ్యమవుతుందని భావన వ్యక్తమవుతోంది. అందుకు వేదికగా స్వయం నిర్వహణ సంస్థలుగా స్వయం సహాయక (డ్వాక్రా) సంఘాలకు రూపకల్పన చేశారు.

## రాష్ట్రంలో స్వయం సహాయక సంఘాల స్వరూపం

| | | |
|---|---|---|
| స్వయం సహాయక సంఘాలు | : | **8,73,423** |
| సభ్యులు | : | **86,79,129** |
| గ్రామ నిర్వహణా సంఘాలు | : | **27,893** |
| బస్తీ స్థాయి సమాఖ్యలు | : | **6456** |
| మండల సమాఖ్యలు | : | **695** |
| పట్టణాల సమాఖ్యలు | : | **135** |
| జిల్లా సమాఖ్యలు | : | **13** |
| డ్వాక్రా మహిళల కార్పస్ ఫండ్ | : | రూ. **5500** కోట్లు |



- అమలు చేస్తున్న సంస్థ : ఆంధ్రప్రదేశ్ మహిళా సాధికారతసంస్థ
- చంద్రన్న చేయూత : డ్వాక్రా మహిళలకు పెట్టుబడి నిధిని చంద్రన్న చేయూత పథకం కింద చేయూతనందిస్తున్నారు. ఇందుకుగాను రాష్ట్ర ప్రభుత్వం రూ. 8400 కోట్లు కేటాయించింది. ఈ మొత్తం మూలంగా రాష్ట్రంలోని 84 లక్షల మంది డ్వాక్రా మహిళలు ప్రయోజనం పొందుతారు. ఫలితంగా ఒక్కో మహిళకు వారి వద్ద ఉన్న కార్పస్ ఫండ్ కు తోడు మరో రూ. 10,000 పెట్టుబడి నిధి సమకూరుతుంది.
- విడుదలైన మొత్తం : పట్టణ, గ్రామ ప్రాంతాల్లోని మొత్తం 81,25,283 డ్వాక్రా మహిళలకు మొదటి దశలో పెట్టుబడి నిధి కింద రూ. 2,423.35 కోట్లు అందించనున్నారు.
- వడ్డీ మాఫీకి నిధుల కేటాయింపు : రాష్ట్రంలోని 6,20,956 స్వయం సహాయక సంఘాలకు 2014 ఫిబ్రవరి నుంచి 2015 ఏప్రియల్ వరకు రూ. 1338.83 కోట్లు చెల్లించారు.
- మొత్తం పెట్టుబడి నిల్వ : రూ. 10,298.63 కోట్లు.





# డిజిటలైజేషన్ దిశగా పోలీసులు

నవ్యాంధ్రలో ఒక్కో ప్రభుత్వ విభాగం డిజిటలైజేషన్ వైపు అడుగులు వేస్తున్నాయి. ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుకు గతంలోనే హైటెక్ సీఎంగా గుర్తింపు ఉంది. ఆయన మళ్ళీ అధికారం చేపట్టిన నాటి నుంచి అన్ని ప్రభుత్వ శాఖల్లో విధివిధానాలను, దైనందిన పనులను ఆధునికీకరించే దిశలో చర్యలు తీసుకుంటున్నారు. స్వయంగా మంత్రివర్గ సమావేశాల్లో కాగితం రహితంగా ట్యాబ్ లను వినియోగిస్తూ ఆయా శాఖల సమాచారాన్ని తెలుసుకుంటూ సమీక్షలు నిర్వహించడంలో దేశంలోనే మొదటిస్థానాన్ని ఆక్రమించారు.

రవాణా శాఖలో అంతా ఆన్ లైన్ వ్యవహారాలు నిర్వహిస్తూ ప్రజలకు అవినీతి రహిత, వేగవంతమైన, మెరుగైన సేవలు అందిస్తున్నారు. పౌర సరఫరాల శాఖల్లో సైతం నిత్యావసర సరకుల పంపిణీలో ఈపోస్ విధానాన్ని ప్రవేశపెట్టడంతో ఖచ్చితమైన లబ్దిదారులకు సరకులు అందడమే కాకుండా అవినీతికి అడ్డుకట్ట పడింది. ఏపీ ప్రభుత్వం నిర్వహిస్తున్న పలు పథకాల అమల్లో పింఛన్ల పంపిణీ తర్వాత పోలీస్ శాఖ పని తీరు బాగుందని రాష్ట్ర ప్రణాళికా శాఖ సర్వేలో వెల్లడైంది. 60% కుపైగా పోలీసుల పనితీరుపై సంతృప్తిని వ్యక్తం చేశారు. అయితే పోలీసు వ్యవస్థను మరింత సమర్థంగా, నేర్పుగా వ్యవహరించేలా తీర్చిదిద్దడానికి, ఆధునిక సాంకేతిక, డిజిటల్ విధానాన్ని వాడుకలోకి తెస్తున్నారు. అందులో భాగంగా రాజధాని విజయవాడలో పోలీసులు డిజిటైజేషన్ దిశగా అడుగులు వేస్తున్నారు. పోలీస్‌శాఖలో ఉన్నతస్థాయి అధికారుల నుంచి కింది స్థాయి సిబ్బంది వరకు మొత్తం 299 ట్యాబ్లెట్ల(ట్యాబ్)లను అధికారులు, సిబ్బందికి పంపిణీ చేశారు. పోలీస్ శాఖకు సంబంధించిన ఆరు రకాల అప్లికేషన్లను ట్యాబ్లెట్లలో ఏర్పాటు చేశారు. వీటి ద్వారా ఎఫ్ఐఆర్ స్టేటస్ నుంచి జైల్ రిలీజ్ వరకు, పాస్‌పోర్ట్ వెరిఫికేషన్ సమాచారాన్ని వేగంగా పంపొచ్చు. పాస్‌పోర్టు వెరిఫికేషన్ చేపట్టే కానిస్టేబుళ్లు, ఎస్సై 2జీ డేటా, సీఐ, ఏసీపీ, ఏడీసీపీలకు 3జీ డేటా, ఐపీఎస్ అధికారులకు 4జీ డేటా సౌకర్యాలను కల్పించడానికి డీజీపీ జె. వి.. రాముడు చర్యలు తీసుకున్నారు. అందరికీ త్వరలో 3జీ సౌకర్యాన్ని కల్పించనున్నారు.

### అనేక సౌకర్యాలు..

పోలీస్ శాఖకు అందజేసిన ట్యాబ్లెట్ల ద్వారా వెహికల్ ఎక్‌నాలెడ్జ్‌మెంట్ సిస్టమ్‌ను ఆపరేట్ చేయొచ్చు. చోరీకి గురైన వాహనాల చాసిస్, ఇంజన నంబర్లను ఉపయోగించి ఏ ప్రాంతానిది, ఎక్కడ దొరికింది వివరాలను వెంటనే తెలుసుకోవచ్చు. ఏపీ పోలీస్ శాఖకు సంబంధించిన ఈ మెయిళ్లను పంపుకోవడం, అందరికీ ఒకే మెయిల్ ద్వారా సమాచార మార్పిడి చేసుకోవచ్చు. ఈ పాస్‌పోర్టు అప్లికేషన్ ద్వారా పాస్‌పోర్టు వెరిఫికేషన్ వెంటనే పూర్తవుతుంది. కేంద్ర ప్రభుత్వం సూచనల మేరకు అమల్లోకి తెస్తున్న సెంట్రల్ క్రైమ్ ట్రాకింగ్ నెట్‌వర్కింగ్ సిస్టమ్(సీసీటీఎన్ఎస్), ఈ కాప్ అప్లికేషన్లను కూడా భవిష్యత్తులో ట్యాబ్లెట్‌లలోకి తీసుకురానున్నారు. జైల్ రిలీజ్ మానిటరింగ్ సిస్టమ్(జేఆర్ఎమ్ఎస్) ద్వారా సమాచారం అందరికీ చేరుతుంది. ఈ అభయం, వాస్, ఎఫ్ఐఆర్ స్టేటస్ వంటి ఇతర అప్లికేషన్ల ద్వారా ఫిర్యాదులకు సంబంధించిన అన్ని వివరాలను తెలుసుకోవచ్చు. క్రైమ్ ఆక్యురెన్సు అండ్ డిటెక్షన్ ఇన్ఫర్మేషన సిస్టమ్(కోడిస్) ద్వారా నేరాలకు సంబంధించిన సమస్త సమాచారాన్ని ఒకే అప్లికేషన్ కిందకు తీసుకొచ్చారు.

### శిక్షణ కార్యక్రమాలు..

ఇప్పటికే ఒకరోజు ప్రాథమిక శిక్షణ పూర్తి చేశారు. కమిషనరేట్‌లోని ఐటీ కోర్ టీమ్ ఆధ్వర్యంలో ట్యాబ్లెట్లు తీసుకున్న సిబ్బంది, అధికారులకు మరోసారి శిక్షణ ఇవ్వనున్నారు. సిబ్బందికి అందజేసిన ట్యాబ్లెట్లలో కేవలం పోలీస్ అప్లికేషన్లు మాత్రమే పని చేసేలా చేశారు.



# స్వరాజ్యమైదానంలో సారస్వతా సౌరభం

## విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ – 27వ పుస్తక మహోత్సవం



పిల్లలు యువతీ యువకులు ఒక అలవాటుగా విజయవాడ స్వరాజ్య మైదానంలో జరిగిన 27వ పుస్తక మహోత్సవానికి వచ్చారు. నాగరికులను, మేధావులను ఒక చోట చేర్చి ఆ నాలుగు గంటలూ పాత, కొత్త పుస్తకాల సుగంధం వెదజల్లిన 27వ పుస్తక మహోత్సవం మరో ఏడాదిపాటు కచ్చితంగా గుర్తుంటుంది.

ఇది మరొక సారి పుస్తకాల పండగ, మరొకసారి అక్షరసాక్షాత్కార యోగం. ఈ 27వ పుస్తక మహోత్సవం విజయవాడ స్వరాజ్య మైదానం (పీడబ్ల్యూడీ గ్రౌండ్స్) లో జనవరి 1 నుండి 11వ తేదీ వరకు వైభవంగా జరిగింది. అంటే కనకాభిషేకాలూ, మంత్రాలూ కనబడే... వినబడే దేవాలయం వాతావరణం కాదుకానీ అలాటిదే. ఈ సారి 235 స్టాల్సులో పుస్తకాల దేవతలు కొలువై ఉండగా ప్రతిరోజూ 7 గంటలు, ఒకొక్కసారి 9 గంటలు మౌనంగా ఆ దేవతల్ని చూస్తూ, కాస్త ఎండ తగ్గే సరికి సాహితీ మూర్తులను స్మరించుకొనే సభలు చూస్తూ, పుస్తకాల భక్తులు గౌరవంగా తలదించుకొని వాగ్దేవీ ప్రసన్నం కోసం మౌన ముద్రలో తన్మయులై మైదానంలో జ్ఞాన విహారం చేశారు.

తల్లిదండ్రుల తర్వాత తెలిసి ఉన్న ఒకే ఒక మిత్రుడు పుస్తకమే కదా! అధ్యాపకుడి తర్వాత – 'ఇలా వెళ్ళాలి నాయనా! ఇది ఒక బాట! ఇది ఒక రాచబాట' అని చెప్పేది పుస్తకమే కదా! తెలుగుతో సహా ఆంగ్ల పుస్తకాలు, పెద్ద బాలశిక్ష నుండి చిరు చిట్కాల వరకు గల పుస్తకరాజాలు, సభ తీర్చి ప్రతి పది అడుగుల మందిరం లాంటి స్టాలులో మీకే తెలిసిన నవ్వుతో పలకరిస్తుంటే ఉత్సవమే. మీతోటి, మీరు పేజీలు త్రిప్పుతూ చూస్తున్న పుస్తకం తోటి చిత్రమైన మౌన సంభాషణలో మురిసిపోవటం ఒక యోగమే.

అలాటి వాతావరణం ఒకే చోట ఒకే ఊరిలో– విజయవాడలో 27 వ సారి కూడా వ్యాపించడం అపూర్వం. ఎవరికీ కనబడకుండా ఉండి, కార్యకర్తలు అలా నిర్వహించగలగటం కూడా అపూర్వమే. ఇలా ప్రతిరోజూ 10 వేల నుండి, రద్దీగా ఉన్న రోజులలో 50 వేల మంది వరకూ– అదొక పవిత్రయాత్రలా, విజ్ఞాన యాత్రలా, ఆత్మీయ పురస్కారంగా ఆ మైదానంలో తిరగాడారు. ఏ సంవత్సరం వదలకుండా సందర్శిస్తున్న నా బోటి పుస్తక ప్రియులకెందరికో ఇది ఒక పులకింత.

ఏ ఆర్భాటమూ కనబడకుండా లోతైన విషయాలు పరిచయం చేసిన సాహిత్య సభలూ అంత విలక్షణంగా ప్రతి ఏటా జరుగుతాయి. ఈ సారి బుచ్చిబాబు శతజయంతి సభ జరిగింది. ఆయన భార్య శివరాజు సుబ్బలక్ష్మి గారు బెంగుళూరు నుండి రాలేకపోయారు. కానీ బుచ్చిబాబు రచించిన ఆంగ్లనాటక కర్త షేక్స్పియర్ పరామర్శ పుస్తకం గురించి డా.స.శ్రీ, బుచ్చిబాబు నాటకాల గురించి వల్లూరి శివప్రసాద్ ప్రసంగించారు. బుచ్చిబాబు అంత లోతుగా ఈ ఆంగ్లనాటక కర్త గురించి ఏ ప్రాంతీయ భాషలోనూ రచించి ఉండరని సశ్రీ అన్నారు. ఇప్పటికీ ప్రదర్శనకు పనికివచ్చే నాటకాలను బుచ్చిబాబు రచించారని వల్లూరి వివరించారు. మరొకరోజు గురజాడ 150 వ జయంతి సందర్భంగా ఏర్పాటయిన సభలో గురజాడ సమగ్ర రచనలను వెలువరించిన కాళిదాసు పురుషోత్తంగారు తన కృషిలో తారసపడిన అమూల్యమైన విషయాలను ముచ్చటించారు. ఆయన దినచర్యల రికార్డులలో భద్రమైనా, చదవటానికి కష్టమయిన విషయాలను, పూర్వ పరిశోధకుల అభిప్రాయాలను పునర్ మ్యూల్యాంకన చేయవలసిన అవసరాన్ని వివరించారు.

పుస్తక ప్రదర్శన సంఘం తరపున ఆకాశవాణి విజయవాడ కేంద్రం 17 మంది చేత హాస్యగల్పికలను చదివించింది. ఆరు నిమిషాల నిడివిలో ఎంతో వైవిద్యభరితమైన, నవ్వించే అంశాలపై హాస్య రచయితల తమ ఊహా ప్రతిభను కనపరిచారు. గొల్లపూడి మారుతీ రావు, శ్రీరమణ, శంకరనారాయణ గార్లతో బాటు గోవిందరాజు మాధురి, పాలవర్తి జ్యోతిష్మతి వంటి కొత్త హాస్యరచయిత్రులు పాల్గొని నాణ్యమైన రచనలు చేయటం, ఎంతోమంది శ్రోతలు నిలబడి విని

ఆనందించటం మంచి పరిణామం.

ఇక ప్రతిరోజూ రెండు మూడు పుస్తకాల విడుదల సరంభం సరేసరి. ఆయా రచయితలు వారి ప్రచురణ కర్తలు నిర్వహించుకున్న ఈ సభలకు సహితం ఎంతో మంది శ్రోతలు కాస్త సేదదీరుతూ కూర్చొనటం ఆనందకరమే.

పుస్తకమహోత్సవాన్ని గౌరవ మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు మొదటి రోజు ప్రారంభించారు. ప్రారంభోత్సవ సభలో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత రాచపాలెం చంద్రశేఖరరెడ్డి ప్రసంగించగా, ముగింపు సభలో కేంద్ర అకాడమీ పురస్కారం అందుకోనున్న ఓల్గా తనని కృష్ణా, గుంటూరు జిల్లాల సాంస్కృతిక నేపథ్యం, వామపక్ష పుస్తకాభిమానం ఎలా తీర్చిదిద్దినదో గుర్తు చేసుకున్నారు. అమరావతిలో కూడా ఇటువంటి ప్రదర్శన ఏర్పాటు చేస్తే మరింత ఘనంగా సదుపాయాలు కల్పిస్తామన్నారు ముగింపు సభలో మాట్లాడిన విజయవాడ నగర కమీషనర్.

ఈ పదకొండు రోజులలో రెండు శనివారాలు, ఆదివారాలు కలిసి వచ్చి పుస్తక విక్రేతలుగా నిజమైన పండుగ అనిపించింది. ఆ రోజుల్లో 50 వేల మంది సందర్శకులయినా వచ్చి ఉంటారు. భద్రత కారణాల వల్ల స్వరాజ్య మైదానంలోని సగం స్థలంలోనే బుక్ ఫెస్టివల్ నిర్వహించుకోవల్సి రావడం, స్టాళ్లు కూడా సగానికి కుదించుకు పోవడం వల్ల ఈ సారి అమ్మకాలు తగ్గినట్టు చెబుతున్నారు పరిశీలకులు. కాబట్టి, అమ్మకాల వలన విక్రేతలు మొత్తం ధనం సంపాదించారో అంచనా వేయడం కష్టం కాని, అతి తక్కువ పుస్తకాలు ప్రదర్శించిన స్టాలు రూ 3వేల నుండి రూ 15వేల వరకు ఆయా రోజులను బట్టి అమ్మకాలు జరుపగా, ప్రసిద్ధమైన ప్రచురణకర్తలు రూ 30వేల నుండి రెండున్నరలక్షల రూపాయల వరకు ఆయా రోజుల్లో సందర్శించిన ప్రజలను బట్టి అమ్మగలిగారు. ఆరకంగా వ్యాపార రీత్యా ప్రదర్శన ఒక మంచి నమూనా. కళాశాలలూ, గ్రంథాలయ నిర్వహకులు పుస్తకాలు ఒక్కసారిగా కొనుగోలు చేయడానికి ఈ ప్రదర్శన ఆంధ్రప్రదేశ్ జిల్లాలలో ఒక ముఖ్య కేంద్రంగా నిల్చడటం మంచిదే. ఈ సంవత్సరం పిల్లలకు పోటీలు నిర్వహించే వేదిక కనబడలేదు. అయినా పిల్లలు యువతీ యువకులు ఒక అలవాటుగా ఈ మహోత్సవానికి వచ్చారు. నాగరికులను, మేథావులను ఒక చోట చేర్చి ఆ నాలుగు గంటలూ పాత, కొత్త పుస్తకాల సుగంథం వెదజల్లిన 27వ పుస్తక మహోత్సవం మరో ఏడాదిపాటు కచ్చితంగా గుర్తుంటుంది.

– పన్నాల సుబ్రహ్మణ్య భట్టు



# బుక్ ఫెయిర్

ఈ తోటలో
ఒక్కో చెట్టు ఠీవిగా నిలబడి
జ్ఞానఫలాల్ని తీసుకు పొమ్మంటుంది
బాటసార్లు ఏ పండుని ముట్టుకున్నా
ఒక గురూపదేశం వినబడుతుంది
ఔను ప్రతి పుస్తకం ఒక జ్ఞానఫలం
జ్ఞానఫలాన్ని కొరికినప్పుడే కదా
ఎరుక ద్వారా కోరికలు రేగి
మనిషి తన విలువ తెలుసుకునేది
నడిచొచ్చిన ప్రపంచం దార్లన్నీ కనుపాప మీద
తెరుచుకునేది
వికాసపూర్వ ఆదిమానవ భావ వైశిష్ట్యం నుండి
చారిత్రిక సంధ్యా సమయాల రక్తపాతాలు
యుద్ధోన్ముఖమైన మానవ మనుగడ భయోత్పాత
బీభత్సాలు
అంబరం గర్భాన్ని చీల్చుకొని అంగారకం మీద
కాలిడిన క్షణాల వరకు
నా పూర్వీకుడి నుండి నా వరకు జరిగిన ప్రయాణ
మర్మమంతా
పుస్తకమై నా దోసిలి నిండుతుంది
అంతేకాదు
బహుశ మనిషి తను పారేసుకున్న ఆత్మల్ని
పుస్తకాలు ఏరుకొని కౌగిలించుకొని భద్రపరుస్తాయేమో
అందుకే పుస్తకం మనిషి వాసనేస్తుంటుంది
మనిషిని ప్రేమించినందుకు ద్వేషించినందుకు
పుళ్ళుబడ్డ జీవితాలు
కరిగి నీరై కన్నీరై ఆవిరైన బతుకులు
ప్రపంచంతో తగాదా పడ్డ ఎన్నెన్నో హృదయాలు
అందరూ అన్నీ చేరే వైద్యశాల పుస్తకమే
గాయపడ్డ గుండెలకి చెదిరిన మనసులకి
ఆప్తవాక్యం పుస్తకమే

తెరిచిన కొత్త పుస్తకం
పాపాయి బుగ్గల సుగంధమేయొచ్చు
ఒక పాత పుస్తకాన్ని ముట్టుకుంటే
పుట్టినరోజునాడు కుంకుడుకాయ పులుసుతో
తలంటుపోస్తూ అమ్మ పాడే పాటలోని
అమ్మ కడుపు చల్లదనం తగలొచ్చు
నాన్న చిటికెన వేలందుకున్న ధైర్యం రావొచ్చు
కూలిన కలల చప్పుళ్ళని వినిపించటమే కాదు
ఎగిసే కెరటాల సవ్వడినీ పుస్తకం మోగిస్తుంది
కత్తి కొసల నెత్తుటిచుక్కలే కాదు
నమ్మకంగా విరబూసే ఇంద్రధనుస్సుల్నీ పుస్తకం
స్పర్శిస్తుంది

నన్ను నేను తప్పిపోయినప్పుడల్లా
పుస్తకమే నన్నెతికి తిరిగి నాకిచ్చింది
మనిషిమీద కోపం వచ్చినప్పుడల్లా
పుస్తకమే తిరిగి మనిషితో సంధి కుదిర్చేది

అదిగో
ఆ పుస్తకాల గూటిలోకి వెళ్ళొస్తాను
నన్ను నేను దొరకపుచ్చుకోవాలి



అరణ్యకృష్ణ


రాణి శివశంకర శర్మ

# ప్రొఫెసర్ అంతరంగం

– రాణి శివశంకర శర్మ

ప్రొఫెసర్ యింటికి నేను యించుమించు రోజూ వెళ్ళేవాణ్ణి. అది వీధి చివర వుండేది. పొద్దు గుంకితే చాలు ఆ భవంతి అవతలి ప్రాంతం చీకటిలో మునిగిపోయేది. నిజానికి ఆ భవంతిని ఆనుకొని విశాలమైన మైదానం వుంది. ఆ మైదానంలోనే జాగింగ్ చేస్తుండగా డిఎస్‌పి ఆగ్నిని నక్సలైట్లు కాల్చిచంపారు.

నేను ప్రతిరోజూ సాయంత్రం ఠంచనుగా ప్రొఫెసర్ మార్కండేయని కలిసేవాణ్ణి. అదొక వ్యసనం అంతే, ఆ భవంతి పైభాగంలో ప్రొఫెసర్‌తో సుదీర్ఘ సంభాషణలు సాగేవి. నిజానికి అన్ని రకాల సంభాషణలకి ముగింపులాంటి వాడు ప్రొఫెసర్ మార్కండేయ. తన గంభీరమైన గొంతుతో దేనికైనా భరత వ్యాక్యం పలికేవాడు. ఆయన మాటే చివరది అన్నమాట. అది తిరుగులేని తీర్పు.

నిజానికి ప్రొఫెసర్ ఒంటరివాడిలాగే కనిపిస్తాడు కాని లోపలికి అడుగుపెట్టగానే వొక అందమైన స్త్రీ గోడమీద నుంచి పలకరిస్తూ వుంటుంది. నిజానికి ప్రొఫెసర్ యింటికి అంత ఠంచనుగా హాజరు కావడానికి ఆ స్త్రీరూపమే కారణం కావచ్చు. ఆమె యెంతగా నన్ను ఆకర్షించిందంటే ఆమె నా కలల్లోకి అనేక సార్లు వచ్చింది. నేను రోజూ ప్రొఫెసర్ యింటికి వెళ్ళేవాణ్ణి. ఆమె రోజూ నా కలల్లోకి వచ్చేది. వొక రోజు కలలోకి వచ్చి సుమధుర గీతం ఆలపించింది. నిద్ర లేచాక ఆ గీతంలో వొక్కచరణమూ గుర్తు లేదు.

ప్రొఫెసర్ మార్కండేయ వొకరోజు అననే అన్నాడు "నీచూపులు అనుమానాస్పదంగా తచ్చాడుతున్నట్లుంటాయి" అన్నాడు, "నువ్వు తక్కువగా మాట్లాడ్తావు యెక్కువగా గమనిస్తుంటావు" అని కూడా అన్నాడు. ఆ తర్వాత నా చూపుల్ని దాచుకోవాలని ప్రయత్నించాను కాని సాధ్యం కాలేదు. "ఎవరు ఆవిడ?" అని అడగనే అడిగేశాను. "నాభార్య" అన్నాడు గంభీరంగా ఆ సమయంలో తన చేతికర్రను నేలకి తాటిస్తూ శబ్దం చేస్తున్నాడు.

ప్రొఫెసర్ మార్కండేయకి వొక కాలు లేదు. అందుకే ఆయన వస్తున్నాడన్న దానికి చిహ్నంగా చేతికర్ర చప్పుడు వినిపిస్తూ వుండేది. కాని మార్కండేయ స్ఫురద్రూపి అనడంలో సందేహం లేదు.

ఆయన గంభీరమైన పోకడ చూసి మరో ప్రశ్న వేయలేదు నేను. కాని ఆవిడ గురించి మరింత సమాచారం ప్రొఫెసర్ గారి కారు డ్రైవర్ సుమన్ ద్వార తెలిసింది. ఆ ముఖ్యమైన వివరాలు చెప్పేముందు ప్రొఫెసర్ మార్కండేయతో జరిగిన కొన్ని సంభాషణల్ని ముందుగా చెప్పాలనుకొంటున్నాను దానికి ముఖ్యకారణం అంటూ యేమీ లేదు.

వొకరోజు ప్రొఫెసర్ యింటికి వొక ప్రముఖ లాయర్ వచ్చాడు. మేము భవంతి పైభాగంలో కూర్చుని మందు తాగడం మొదలుపెట్టాం. వొక విడాకుల కేసు గురించి లాయర్ చెప్పడం మొదలుపెట్టాడు. తన వాదనా పటిమతో పిల్లలు భర్తకే చెందుతారని జడ్జిని వొప్పించానని, దాంతో సున్నిత మనస్కురాలైన ఆ స్త్రీ ఆత్మహత్య చేసుకొందని అతి మామూలు విషయంలా చెప్పేశాడు లాయర్. అతనిలో కించిత్తు కూడా బాధ తొంగి చూడలేదు. అదే సందర్భంలో "మీకేసు కూడా వాదించి గెలిపించింది నేనే కదా" ప్రొఫెసర్ అని గర్వంగా అన్నాడు లాయర్. అదేం కేసో నాకు అర్థం కాలేదు. యితరుల సంభాషణల్లోకి అసందర్భంగా చొచ్చుకుపోయే లక్షణం నాకు వుందని ప్రొఫెసర్ ఆరోపించేవాడు. దాన్నే మరోసారి నిజం చేస్తూ నేను వొక ప్రశ్న అడిగాను: "లాయర్ జీ! న్యాయవాదులకు సంబంధించి వృత్తిపరమైన నైతిక విలువలు అంటూ యేమైనా వున్నాయా? వుంటే అవి యేమిటి?"

ప్రొఫెసర్ మార్కడేయ కుర్చీలో అసహనంగా కదులుతూ తన చేతికర్రని నేలకేసి టిక్ టిక్ మనిపించాడు. ప్రొఫెసర్ తన చేతికర్ర ద్వారా చాలా వుద్వేగాల్ని వ్యక్తం చేస్తుంటాడు. లాయర్ మాత్రం నిశ్చలంగా సమాధానం చెప్పాడు "మా క్లయింట్లు పట్ల విశ్వాసంగా ప్రవర్తించడం; వాళ్ళని గెలిపించడానికి సకల శక్తులూ వుపయోగించడం, వాళ్ళు యెటువంటి వాళ్ళైనా మాకనవసరం. మా వృత్తి ధర్మం మేం నిర్వహిస్తాం" అన్నాడు లాయర్. "సైనికులూ... పోలీసుల్లాగే" అని

గొప్ప కవులు... రచయితలు ఎవరైనా ఆ జాతికి యాంటిన్నా వంటి వారని అంటారు. యాంటిన్నా ఏ విధంగా అయితే సంకేతాలను ముందే గ్రహించి మనకు అందించినట్టు, ఆ రచయితలు కూడా క్రాంతదర్శనం చేసి మనకు ప్రదర్శిస్తారు. తెలుగు సాహిత్యంలో అటువంటి అరుదైన ముందుయుగం రచయితలలో రాణి శివశంకర శర్మ ఒకరు. '...అనల వేదికముందు అస్రనైవేద్యం..' అన్న శ్రీశ్రీ కవితావాక్యానికి ఉదాహరణగా శర్మ రచనావ్యాసాంగాన్ని చూడొచ్చు. అక్షరాగ్ని కీలలకి తనని తాను సమర్పించుకున్న శర్మ కవి, రచయిత, విమర్శకుడు మాత్రమే కాదు, ఒక తాత్వికుడు అని ఆయన సంచలనాత్మక, ఆలోచనాత్మక గ్రంథాలు– 'ది లాస్ట్ బ్రాహ్మిన్', 'పురాణ వేదం', 'అమెరికనిజం', 'గ్రహాంతర వాసి'– నిరూపిస్తాయి.



ముక్తాయించాడు ప్రొఫెసర్ మార్కండేయ.

యీ సంభాషణ జరిగిన కొన్ని రోజులకే డిఎస్‌పి అగ్నిని నక్సలైట్లు కాల్చిచంపారు. అప్పట్లో వార్తలు ఆలస్యంగా తెలిసేవి, టీవీ లేదు మరి, న్యూస్ పేపర్లే గతి. ఆ రాత్రి ప్రొఫెసర్ యింటి వెనుక మైదానం వెల్తుర్తో నిండిపోవడమే కాక పోలీసు సంచారం కనబడ్తోంది. నేను ప్రొఫెసర్ని అడిగాను 'యేం జరిగింది' అని. అప్పుడు తెలిసింది. ఉదయం జాగింగ్ కి వచ్చిన డిఎస్‌పి అగ్నిని పాడుపడిన బిల్డింగ్ లోంచి కాల్పులు జరిపి నక్సలైట్లు చంపేశారు. యింతకీ ఆ డిఎస్‌పి మా బాబయ్యే.

నేను వెంటనే మా పిన్నిని వెళ్ళి కలిశాను. పిన్ని నన్ను తిట్టిపోయడం మొదలుపెట్టింది. "నానా చెత్త రచనలు చేస్తుంటావు. ఆ ఆదిత్యతో కలిసి తిరుగుతుంటావు యిప్పటికైనా కళ్ళు చల్లబడ్డాయా?" అని యేడవడం మొదలు పెట్టింది. "ఆదిత్యే ఆయన్ని చంపించాడు" అని కూడా అంది.

"పిన్ని నీ ఆలోచన తప్పు, ఆదిత్య పౌరహక్కుల సంఘం నాయకుడు చట్టం ప్రకారం పనిచేస్తుంటాడు. ఆయనొక మేధావి. ఆయన చేయించాడని నువ్వెందుకనుకొంటున్నావు? నీ బాధ నేను అర్థం చేసుకోగలను కాని..."

'నోర్ముయ్' అని అరిచింది పిన్ని. "అందరూ చట్టం చట్టం అంటారు చేసేవన్నీ హత్యలు... యెటు వంటి కుటుంబం నీది. ఆదిత్యతో నీ స్నేహం ఏమిటి?"

పిన్ని నన్ను అలా నిలదీసింది కాని, ఆదిత్య కన్నా నన్ను యెక్కువ ప్రభావితం చేసింది ప్రొఫెసర్ మార్కండేయే. ప్రొఫెసర్ మార్కండేయ నా అంతశ్చేతన వంటివాడు.

ఆ రోజుల్లో ఆదిత్యతో కలిసి తిరిగేవాణ్ణి అనేది నిజమే. ఆయన ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా యిచ్చి పూర్తి కాలం పౌరహక్కుల కోసం పనిచేసేవాడు. జనాన్ని కూడగట్టేవాడు, ఆయన వెంట నిజనిర్ధారణ కోసం నేనూ వూళ్ళు తిరుగుతుండేవాణ్ణి. యేనాటికైనా విప్లవం విజయవంతమై సమసమాజం యేర్పడ్తుందని ఆయన దృఢంగా చెప్పేవాడు. చైనా రష్యా విప్లవాల గురించి సాధికారికంగా మాట్లాడేవాడు. మేధావిగా కూడా మంచి గుర్తింపు వుండేది ఆయనకి. ఆయన ప్రవచించే యుటోపియా, ప్రొఫెసర్ భార్యకంటే యెక్కువగా నన్ను ఆకర్షించే మాట నిజమే కాని అది తాత్కాలికమే.

ఆ రోజుల్లో ఆ స్వప్న సుందరి ఆ గోడకి అతుక్కుపోయిన పటం నుంచి దిగి వచ్చి కళ్ళ ముందు తచ్చాడేది. కలకీ వాస్తవానికి మధ్య దూరాన్ని చెరిపేసేది. అసలే నాలో కొంత వున్మాదస్థితి వుంది. దాంతో పట్టపగలు కూడా కళ్ళ ముందు తచ్చాడడం మొదలు పెట్టింది. ఆమెతో నేను ఏకాంతంలో సంభాషించడం కూడా మొదలుపెట్టాను. కోరిక తీవ్రమైనపుడు చేతనా చేతనాల మధ్య భేదం తొలగిపోతుందని కాళిదాసు అంతటి కవే చెప్పాడు మరి!

కాని కల చెరిగిపోయింది. ఆదిత్య కల చెరిగిపోయింది. సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైంది. లెనిన్, స్టాలిన్ విగ్రహాల్ని కూలదోసి

నడి వీధిలో యీదుస్తున్నపుడు ఆదిత్య కళ్ళ నీళ్లు పెట్టుకున్నాడు 'యిది నిజమేనంటావా!?' అని నన్ను అడిగాడు.

"నిజమేనంటావా!?" అని రెట్టించి అడిగాను ప్రొఫెసర్ కారు డ్రైవరు సుమన్ ని. ప్రొఫెసర్ మార్కండేయ తన భార్యను చంపేశాడని సుమన్ చెప్పాడు. "ఎందుకు, ఎందుకు?" అని నేను ఆవేదనగా అడిగాను, నా స్వప్న సుందరి యెప్పుడో చనిపోయిందని మొదటి సారిగా తెలుసుకొన్న వుద్విగ్నతలో వున్నాను నేను. "ఔను నిజమే ఆయనే చంపేశాడు. 'నిన్ను నేను ప్రేమిస్తున్నాను' అని వొక్కసారి చెప్పమని వేడుకొనేవాడు ఆవిణ్ణి ప్రొఫెసర్ మార్కండేయ. కాళ్ళుపట్టుకొనేవాడు. లాభం లేదు. ఆమె పెదాలు మూసుకుపోయేవి. ప్లాస్టర్ వేసి అతికించినట్లు అతుక్కుపోయేవి ఆమెకి యేమాత్రం సాధ్యం అయ్యేది కాదు. దాంతో భయపెట్టేవాడు. గర్జించేవాడు. తన గంభీరమైన గొంతుతో హెచ్చరించేవాడు. వొక్కసారి...వొక్కసారి...నన్ను ప్రేమించానని చెప్పు అని హింసించేవాడు. సిగిరెట్లతో కాల్చేవాడు. అయినా అది సాధ్యమయ్యేది కాదు. ఆమె పెదాలు అప్రయత్నంగా మూత పడిపోయేవి". సుమన్ కళ్ళలో నీళ్ళు. "యిదంతా నీకెలా తెలుసు? నీకెవరు చెప్పారు" అని అడిగాను నేను. "ఆమె చెప్పింది. ఆమె స్వయంగా చెప్పింది" అన్నాడు. సుమాన్ "నువ్వొక కారు డ్రైవర్‌వి. నీకెలా చెప్పింది?" అని ప్రశ్నించాను. "నేను తప్ప యీ విశాల భవంతిలో యెవరున్నారు చెప్పుకోవడానికి? యీ భవంతి వెనక పెద్ద మైదానం యెడారిలా పరుచుకొని వుంది. జాగింగ్‌కి వచ్చే పోలీసు బూట్లు టక టకలు తప్పయేమీ వినబడవు. యే యితర శబ్దాలూ కూడా యిక్కడ వినబడవు. ఆ కుంటి ప్రొఫెసర్ కర్ర చప్పుడు తప్ప"అన్నాడు సుమాన్ "ప్రొఫెసర్ యెందువల్ల కుంటివాడయ్యాడు?" అని అడిగాను. "యెవరో వివాహితస్త్రీతో సంబంధం పెట్టుకుంటే కాలునరికేశారట" అన్నాడు సుమన్.

"యే స్త్రీయైనా యితన్ని యెలా ప్రేమించింది? యెలా సంబంధం పెట్టుకొంది" అని నేను ఆశ్చర్యంగా అడిగాను. "అందమైన డిక్టేటర్లని అందరూ ప్రేమిస్తారు" అని మెట్లు దిగి చీకట్లో మాయమయ్యాడు సుమన్.

స్టాలిన్ డిక్టేటర్ అంటూ ఆదిత్య విమర్శించడం మొదలుపెట్టాడు. నియంతృత్వం కాదు సోషలిస్టు ప్రజాస్వామ్యం అవసరం అని ఉపన్యాసాలు యివ్వడం మొదలు పెట్టాడు. మనిషిని అతని సబ్ కాన్షియస్‌నెస్ శాసిస్తోందని, అతని చైతన్యం కాదని ఫ్రాయిడియన్ సైకాలజీని ప్రస్తావించడం మొదలుపెట్టాడు. కనబడే మనిషిని కాదు, కనబడని మానవ ప్రవృత్తిని అర్థం చేసుకోవాలంటున్నాడు. చెదిరిపోయిన సమసమాజ స్వప్నం అతన్ని స్వప్న విశ్లేషకుడిగా మార్చేసిందా?

నా కల కూడా చెదిరిపోయింది. ఆ చిత్రపట సుందరి యేనాడో మరణించింది. దిక్కులేని చావు చచ్చింది. ఆమె ఆ రాత్రి అరచిన చావు కేకలు, ఆ మృత్యు మైదానంలో యింకిపోయాయి.

నేను భవంతిలో కూర్చుని మెరిసే బండల్లోకి గుచ్చి గుచ్చి చూస్తున్నాను "ఏమిటి చూస్తున్నావు" అని అడిగాడు ప్రొఫెసర్ ఎక్కడైనా నెత్తురు, కిరోసిన్, పెట్రోలు మరకలైనా, కనీసం ఆమె కేశాలైనా ఆ బండల్లో యెక్కడైనా దాగి కనబడ్తాయని చూస్తున్నాను. యెక్కడా పగుళ్ళు లేకపోవడమే కాదు అద్దాల్లా నునుపైన ఆ బండలపై యెటువంటి మరక కూడా లేదు.

"యీ బండలు నిన్ను బాగా ఆకర్షిస్తున్నట్లున్నాయి. యీ దర్పణాల్లాంటి బండల్లో నువ్వు యెన్ని ప్రతిబింబాలుగా చీలిపోయావో చూశావా? యివి చాలా విలువైన పాషాణాలు. యివి చెక్కు చెదరవు. మాయవు. శాశ్వతంగా వుంటాయి. యెవరైనా యిక్కడ చచ్చిపోవచ్చు. యీ బండలకి మాత్రం చావులేదు. వాటికి అమరత్వం సిద్ధించింది," అన్నాడు ప్రొఫెసర్ మార్కండేయ. నునువుగా గట్టిగా పురుషాంగంలా వున్నాయి ఆ బండలు. ప్రేమ-హింస కలగలసిపోయిన మానవ ప్రకృతిలా వున్నాయి ఆ బండలు. నిజానికి ఆ స్త్రీ పటం కాదు, యీ బండలే నన్ను యింతకాలం ఆకర్షిస్తూ వచ్చాయా? తమవైపు గుంజుతూ వచ్చాయా? "యివి చాలా విలువైనవి," అని ఆ బండలని తన కాలి వేళ్ళతో రాస్తున్నాడు ప్రొఫెసర్ యేవైనా మరకలు మిగిలితే తుడిపేస్తున్నాడా? ఆ లాయర్ ఆ రోజు వాదించానని చెప్పిన కేసు యిదేనా? డిఎస్‌పి అగ్ని కూడా ప్రొఫెసర్‌కే సహకరించాడా? ఎన్నో ప్రశ్నలు ఆ బండల్లో సమాధియై పోయాయనిపించింది వొక్కక్షణం.

ఆదిత్య విప్లవోద్యమాల పర్యవసానాలకి భయపడ్తున్నాడని, పూర్వపు సాహసం నశించిందని కొందరు వాదించడం మొదలుపెట్టారు. ప్రపంచాన్ని ప్రపంచ పరిణామాల్నీ అధ్యయనం చెయ్యడంలో విఫలమైన వాళ్ళే యిలా మాట్లాడ్తున్నారని ఆదిత్య వాదిస్తున్నాడు. కమ్యూనిష్టు ఉద్యమాల్లోని నియంతృత్వ ధోరణుల్నీ మితిమీరిన హింసనీ బయలుపెడ్తూ వ్యాసాలు రాశాడు.

ప్రొఫెసర్ మార్కండేయ మర్నాడే ఫిలాసఫీ కాన్ఫరెన్స్‌లో తాను మాట్లాడ్తున్నానని చెప్పాడు. మా సంభాషణ తత్వశాస్త్రం వైపుకి మళ్ళింది.

"కాంట్ వస్తుగత సత్యం వుందంటాడు. కాని మనిషి దాన్ని యెప్పుడూ తెలుసుకోలేడని, అందుకోలేడని అంటాడు. యింద్రియాలూ, పరిమితబుద్ధీ యివే వస్తుగత సత్యాన్ని తెలుసుకోవడానికి అడ్డంకిగా నిలుస్తాయి. యెప్పుడూ మనిషి చేతినుంచి జారిపోయేదే ప్రపంచం, సత్యం," అన్నాను నేను "నోర్ముయ్... నువ్వు నోర్ముయ్ బాస్టర్డ్" అని అరిచాడు ప్రొఫెసర్. నిలబడి వున్నప్రొఫెసర్ కర్రని యిటూ అటూ తాటిస్తూ వూగిపోతున్నాడు. అతడు పడిపోతాడేమోనని భయపడ్డాను. అతని వుగ్రస్వరూపం చూసి దరిజేరడానికి భయపడ్డాను.

"సత్యాన్ని నేను యిలా చేతుల్తో పట్టుకొని బంధిస్తాను. యేదీ దాంకోడానికి వీలులేదు. నన్ను తప్పించుకు పోవడానికి వీల్లేదు. ఆ కాంట్ పెద్ద స్టుపిడ్, వాణ్ణి పెట్రోలు పోసి కాల్చిపారేస్తాను. సత్యం చేతికందదంటాడా? దృశ్యంలోని అసలు దృశ్యాన్ని నాకు అందకుండా మిస్ చేస్తాడా? నా బుద్ధి పరిమితమంటాడా? నా ఆలోచన స్థల కాలాలలో బందీ అంటాడా? నాలోని స్థలకాలాలని ఛేదించి పారేస్తాను. సిగిరెట్‌తో కాలుస్తాను. నాకు అందనిదేదీ వుండకూడదు. నాకు అందిందే సత్యం నా చేతిలోనిదే ప్రపంచం. బియింగ్ యిన్ యిట్ సెల్ఫ్ అంటూ యేదీ లేదు బియింగ్ ఫర్ మై సెల్ఫ్. వరల్డ్ ఫర్ మై సెల్ఫ్. అలా దొంగ చూపులు చూడకురా బాస్టర్డ్ నీ చూపుల్ని నేను క్షణంలో ఛేదించేస్తాను" అంటూ రొప్పుతూ పడక కుర్చీలో కూలబడ్డాడు.

"మీరెందుకు ప్రొఫెసర్ తో స్నేహం చేస్తున్నారు" అని అడిగాడు సుమన్. 'నువ్వెందుకు ఆయనకి డ్రైవర్ గా వున్నా'వని యెదురు ప్రశ్న వేశాను. "పొట్టకూటికోసం" అన్నాడు సుమన్. "కార్లో రేప్ జరుగుతున్నా అంతేనా?" అని అడిగాను. అతడేమీ సమాధానం చెప్పలేదు. నావైపు వొక నవ్వు నవ్వి వెళ్ళిపోయాడు. ఆ మృత్యుమైదానం, ఆ వొంటరి భవంతీ, ఎన్నో రహస్యాల్ని దాచుకొని కూడా పారదర్శకంగా వున్నట్లు ఫోజిచ్చే ఆ నునుపైన బండలూ, ఆ సుందరి చిత్రపటం, సిగిరెట్ వెలిగించిన ఆ ప్రొఫెసర్ గంభీర రూపం నన్ను యీనాటికీ ఆకర్షిస్తూనే వున్నాయి. నా అడుగులు అటు పడ్తూనే వున్నాయి.

❖

# ఆయనకు నచ్చింది జనం చూశారు జనం మెచ్చిందే ఆయన తీశారు

ఇల్లరికం, పరివర్తన, చరణదాసి, జయంమనదే, మా బాబు, మైనర్ బాబు, పిచ్చిపుల్లయ్య, పల్లెటూరు, నిరుపేదలు వంటి ఎన్నో చిత్రాలు డైరెక్టు చేసిన తాతినేని ప్రకాశరావు – ప్రజానాట్య మండలిలో వుండి, సినిమాలకు వచ్చారు. ఎల్.వి ప్రసాద్ గారి దగ్గర ద్రోహి, షావుకారు, మన దేశం మొదలైన చిత్రాలకు సహాయకుడిగా పనిచేసి, దర్శకత్వంలోని విషయాలు గ్రహించారు. 'షావుకారు'కి విజయా సంస్థలో పనిచేసి, 'పాతాళభైరవి'కి కూడా కె.వి.రెడ్డిగారి దగ్గర పని చేశారు ప్రకాశరావు. ముఖ్యంగా ఆ సినిమాలో వచ్చిన పోరాటాల రిహార్సల్స్ ఆయనే చేయించారు. సినిమా చివర్లో తోటరాముడికి (ఎన్.టి.ఆర్) మాంత్రికుడికీ (ఎస్.వి రంగరావు) జరిగిన పోరాటంలో ఎక్కడా 'డూప్' లు లేరు. వాళ్లే ఫైటింగ్ చేశారు. రోజూ ఉదయం ఆరు గంటలకి మొదలయే ఫైటింగ్ రిహార్సల్సుకి ప్రకాశరావు కూడా హాజరై పర్యవేక్షించేవారు. 'పాతాళభైరవి' లో ఒక దృశ్యంలో రెండు భూతాలు కనిపిస్తాయి. అందులో ఒక భూతం పాత్రని ప్రకాశరావు గారే ధరించారు. దర్శకుడిగా ఆయన తొలిచిత్రం 'పల్లెటూరు' (1952) – ఎన్.టి రామారావు, సావిత్రి ముఖ్యజంట. ఈ సినిమాని ఎంత సహజంగా చిత్రించారో, అంత సహజంగానూ చిత్రీకరించారు 'నిరుపేదలు' (1954) నాగేశ్వరరావు రిక్షావాడిగా, జమున అతని భార్యగా ఎంత సహజంగా కనిపిస్తారో! ఆర్థికంగా బలపడకపోయినా, మంచి అభిరుచిగల దర్శకుడిగా బలపడ్డారు – ప్రకాశరావుగారు. ఎన్.టి రామారావుతో పరిచయం వుండడం వల్ల, ఆయన నిర్మించిన 'పిచ్చిపుల్లయ్య' ప్రకాశరావు గారి చేత డైరెక్టు చేయించారు. 'అన్నాచెల్లెళ్ళు' నాటకం (పినిశెట్టి శ్రీరామమూర్తి రచన) ఆధారంగా తీసిన 'పరివర్తన' ఘనమైన విజయం సాధించింది. ఇందులో రామారావు పాత్ర అహంకార పూరితమైన పాత్ర. నాగేశ్వరరావు బస్ కండక్టరు. 'ఎమోషనల్' దృశ్యాలతో ఈ సినిమా ప్రేక్షకాదరణ పొందింది. ఇక, రెండు భాషల్లో తీసిన 'చరణదాసి' ఘనవిజయం సాధించింది. ఇందులోనూ రామారావు, నాగేశ్వరరావులిద్దరూ నటించారు. ఎన్.టి.ఆర్.తో తీసిన 'జయం మనదే' జానపదం. ఇదీ హిట్టే.



తాతినేని ప్రకాశరావు

ప్రకాశరావు గారు తమిళంలో కూడా జానపదాలు, సాంఘికాలూ తీశారు. తమిళ చిత్రాలు 15 వరకూ వుంటాయి. శివాజిగణేశన్ తో తీసిన 'ఉత్తమపుత్రన్' ఎమ్.జి రామచంద్రన్ తో తీసిన 'పడగోటి' చిత్రాలు, సినిమా భాషలో 'సూపర్ డూపర్'లు! ఈ రెండు చిత్రాలూ తెలుగులోకి అనువదింపబడి, విజయసాధన చేశాయి. ఇక "ఇల్లరికం". ఈ సినిమా ఆయన్ని మరింత ఉన్నత స్థాయికి తీసుకెళ్లింది. ఎన్నో చోట్ల ఉత్సవాలు జరుపుకున్నది. ప్రకాశరావు గారికి ప్రజల నాడి తెలుసు. కథాగమక విధానం తెలుసు. ఆయన తీసిన ప్రతి సినిమా, కుటుంబ సమేతంగా చూడదగ్గదే. ఎమోషనల్ దృశ్యాలు, హాస్య దృశ్యాలూ అలరించేలా వుంటాయి. 'ఇల్లరికం'లోని హాస్యం గురించి, ఇప్పటికీ ఎందరో చర్చించుకుంటూనే వుంటారు. తర్వాత తరంలో మంచి దర్శకులు అనిపించుకున్న ప్రత్యగాత్మ, తాతినేని రామారావు – ప్రకాశరావు దగ్గర పనిచేసిన వారే.

"పల్లెటూరు, నిరుపేదలు లాంటి చిత్రాలు తియ్యడమంటే నాకు ఎంతో ప్రీతి. కాని, మన ప్రేక్షకులు సహజమైన కథలకి, పాత్రలకీ అలవాటు పడలేరు. హీరో, హీరోయిన్లు ధనవంతులై వుండి, గ్లామరస్ గా వుండాలి. అంచేత అలాంటి కథలు ఎన్నుకోవాల్సి వస్తుంది. సినిమా తియ్యడం ఏ కొద్ది మంది కోసమో కాదు. అందరికోసం అందరూ చూడాలి, ఆనందించాలి, మెచ్చుకోవాలి. ఆ ధోరణిలోనే ఆలోచిస్తాను" అని ఒక సందర్భంలో చెప్పారు ప్రకాశరావు.

1959లో విడుదలైన "ఇల్లరికం"లో కొసరాజు గారు రాసిన పాట– "నిలువవే వాలుకనుల దానా, వయారి హంసనడక దానా" (సంగీతం: టి. చలపతిరావు) పాట హిట్టు. ఈ పాట దాదాపు చిత్రం చివరిలో వస్తుంది. నాయకుడు (అక్కినేని) నాయిక (జమున)ని వెంటాడుతూ వెక్కిరించేపాట. "ఈ పాట అసందర్భంగా వుంది. అప్పటికే నాయిక ఇష్టపడింది. ఈ టీజింగ్ పాటకి అర్థం వుండదు. జనం చూడరు, లేచి వెళ్ళిపోతారు. ఈ పాట తీసేయండి" అని అక్కినేని, చెబుతూ వచ్చారు. విడుదల కాబోతున్న సమయంలోనూ ఆమాటే అనే వారట అక్కినేని. కాని, ప్రకాశరావు గారికి ధైర్యం– ఆ పాట హిట్ అవుతుందనీ, బోరు అనిపించదనీ, ఐతే, ఆ రోజుల్లో హీరోలు సలహా ఇస్తారుగాని, ఈనాటి హీరోల్లాగా శాసించరు. అంచేత, ఆపాటని హీరో సలహా ప్రకారం తీసేయలేదు. అలాగే వుంచారు. సినిమా విడుదలైన మొదటి రోజునే ఆ పాటకి గొప్ప స్పందన వచ్చిందన్న విషయం తెలుసుకున్న నాగేశ్వరరావు గారు ? "ప్రకాశరావు గారి అంచనా గొప్పది. నేను ఊహించినది వేరు, ఆయన అనుకున్నది వేరూ. ఆ పాట అంతగా ఆకర్షిస్తుందన్న ప్రకాశరావు గారి ఆలోచనకి హేట్స్ ఆఫ్" అన్నారు అక్కినేని. ప్రకాశరావుగారు తెలుగు, తమిళ భాషల్లోనే కాకుండా, హిందీలోనూ చిత్రాలు డైరెక్టు చేశారు. బాలల చిత్రాల కమిటీలో వుంటూ బాలలకి ప్రత్యేకంగా చిత్రాలు నిర్మించాలి – అనే వారు. ఆయనే, 1978 లో "గంగా భవాని" అనే బాలల చిత్రం తీశారు – అవార్డులు కూడా తెచ్చుకుంది.

సినిమాలు తియ్యాలనుకునే వాళ్లకి –ఆనాటి చిత్రాలు మంచి పాఠాలు చెబుతాయి. కథలో ఎంత బలం వుంటే ప్రజలు హర్షిస్తారో చెబుతాయి. తాతినేని ప్రకాశరావు గారి సినిమాలు చూస్తే నేర్చుకోవలసిందీ, తెలుసుకోవలసిందీ ఎంతో వుంటుంది.

– రావి కొండలరావు

# చరిత్ర రచనా చక్రవర్తి
## పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

దేశ చరిత్రల రచన కత్తిమీది సాము. దాన్ని సుసాధ్యం చేసిన 'చరిత్రరచనా చక్రవర్తి' పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య దేశచరిత్ర రచనలకు కొత్తవొరవడి దిద్దారు. దేశీయులు చేయెత్తి జైకొట్టేలా వారిలో దేశభక్తిని నింపగలిగారు. గతమెంతో ఘనకీర్తిని చాటిచెప్పగలిగారు.

1898 జూలై 1న రత్నమాంబ, వెంకన్నలకు ఘంటసాలలోనే జన్మించిన పండిత వెంకట సుబ్బయ్య జీవిత చరిత్రల బహుగ్రంథ కర్తగా తెలుగు పాఠకలోకానికి సుపరిచితుడు. జాతీయ వాది. ఉప్పు సత్యాగ్రహకాలంలో 9 నెలల కారాగారవాస శిక్ష అనుభవించారు. జాతీయోద్యమకార్యకర్తగా ఖద్దరు ప్రచారం చేశారు. 1933లో కృష్ణాజిల్లాబోర్డు సభ్యులుగా జమీందారీ రద్దుకు పాటుపడ్డారు. 'గ్రంథాలయ సర్వస్వము' పత్రికా సంపాదకవర్గంలో ఒకరుగా గ్రంథాలయోద్యమానికి పాటు పడ్డారు. జీవిత చరిత్రల రచనకు కొత్త ఒరవడి తెచ్చారు. జీవిత చరిత్రలు వ్రాస్తే వెంకట సుబ్బయ్య గారే వ్రాయాలి అన్నంత ప్రసిద్ధిని పొందారు.



తతిమ్మా కృష్ణాజిల్లా గ్రామాలతో పోలిస్తే ఘంటసాల గ్రామంలో ప్రజల ఆలోచనా తీరులోకొంత భిన్నత్వం కనిపిస్తుంది. అది, అలనాటి ప్రాచీన నౌకా కేంద్రం కావటంతో యోధులూ, సాహసికులు, జ్ఞానసంపన్నులైన నావికుల వారసత్వం ఈనాటికీ ఘంటసాల స్థానికులలో తొణికిసలాడుతూనే ఉంటుంది. గొర్రెపాటి వారు, గొట్టిపాటి వారూ, వేమూరి వారూ ఘంటసాలకు వన్నెతెచ్చిన ప్రసిద్ధ వంశీకులు. అక్కడపుట్టిన చివురు కొమ్మైనా చేవ...అన్నట్టు అస్పృశ్యతా నివారణకు కృషి చేసిన అగ్రహారికుడు ఘంటసాల సీతారామయ్య లాంటి అభ్యుదయవాదులు పుట్టిన నేల అది!

ఘంటసాలలో రైతుపెద్ద, స్వాతంత్ర్య సమరయోధుడూ మరో గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారు ఉన్నారు. అందుకని, ఆయనను కిసాన్ వెంకట సుబ్బయ్య అనీ, వీరిని పండిత వెంకట సుబ్బయ్య అనీ జన వ్యవహారం. పండిత వెంకట సుబ్బయ్య గారు ఎర్రగా దానిమ్మపండు రంగులో వుండేవారు. అందుకని 'తెల్ల వెంకట సుబ్బయ్య' అనికూడా అనేవారు. 'గొ వెం సు' ఆయనపొట్టిపేరు.

ఎందరి జీవితాలనో చరిత్రగా మలచిన వెంకట సుబ్బయ్యగారు స్వీయచరిత్ర కూడా వ్రాసుకున్నారు. కానీ, అందులో తన చుట్టూ ఉన్న లోకం గురించి తప్ప, తన గురించి చెప్పుకున్నది తక్కువ. "స్వీయచరిత్రలో కుటుంబ విషయాలు తగ్గించి, సమకాలీనవిషయాలను పేర్కొంటూ, దేశాభివృద్ధికి బలియయిన వారు ఘనకార్యాలు చేసినవారు వ్రాసుకుంటే లోకం హర్షిస్తుంది" అంటారాయన. అందుకే,అడపాదడపా ఆయన ప్రస్తావించిన విషయాల్లోంచే ఆయన వ్యక్తిగత వివరాలు ఏరుకోవాలి.

"మొదటి నుండి నేను నోరులేని వాడినే! క్రియా రహితుడను, ఉపేక్షా శీలిని, ముప్పై యేళ్ళు వచ్చాక కూడా సన్యసించాలని అనుకునే వాడిని, నేను నిరీశ్వరవాదిని గాను, ఈశ్వరభక్తునీ గాను! దేవుడు ఈ నరక కూపంలో పడేశాడని ఆయన్ని స్మరించితే గానీ, ముక్తి లేదని నేను నమ్మలేను" అని రాసుకున్నారొకచోట.'నా సాహిత్య కృషి' పుస్తకంలో ఆయన కొతా శ్రీరామశాస్త్రి ఆయన కుమారులు రామమోహనశాస్త్రి, ఆనందమోహన శాస్త్రి, చెరుకువాడ వేంకట నరసింహం, ఇలా ఎందరో ప్రముఖుల సాహిత్య కృషినీ వివరిస్తారు జీవిత చరిత్రలను చిత్రించటం అంటే ఆయనకు ప్రాణం. బహుశా ఆ విద్యలో ఎవరైనా వెంకట సుబ్బయ్య గారి తరువాతే!

బందరు నోబుల్ కళాశాల హైస్కూల్ శాఖలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారూ ఒకే గదిలో వుంటూ చదువుకున్నారు. ఆయన ఫోర్తుఫారం, వెంకట సుబ్బయ్య గారు థర్డ్ ఫారం. ఫోర్త్ ఫారంలో ఉండగా వందేమాతరం ఉద్యమ ప్రభావంతో, బెంగాలీ

నేర్చుకోవాలనిపించిందాయనకు.బందరులోశ్రీ కౌతా శ్రీరామశాస్త్రిగారిని ఆశ్రయించి బెంగాలీ నేర్చుకున్నారు.

బెంగాలీరావటంవలనశరత్సాహిత్యాన్నిమూలభాషలో చదివేఅవకాశంకలిగింది. స్కూల్ ఫైనల్ చదివేందుకు కలకత్తా వెళ్ళారు. కానీ, సీటు దొరకలేదు. ఇంటర్మీడియట్ చదవాలని,నాగపూర్ వెళ్ళారు. కానీ, ఆరోగ్యం దెబ్బతినటంతో తిరిగివచ్చి, ఇంట్లోనే అధ్యయనం ప్రారంభించారు.

"ఆదికవి వాల్మీకి శోకంతో రామాయణరచన ప్రారంభమైనట్టు,1915లో పెద్దక్క సీతమ్మ స్వర్గస్థురాలైన దుఃఖంలో"సీతాచరితం"పేరుతో ఆమె చరిత్ర వ్రాశాను..." అని చెప్పుకున్నారు. ఆయన రచనలన్నీ ఇంచుమించుగా జీవిత చరిత్రలే! రాజారామ్మోహనరాయ్, కేశవ చంద్రసేన్, ఇలా చాలామంది జీవితాలమీద వ్యాసాలు వ్రాశారు.

"శరత్ చెప్పినట్టు, 'యౌవనదశలో కవిత్వం వ్రాయి, వృద్ధాప్యంలో విమర్శ వ్రాయి' అనేది నాకు బాగా నచ్చింది." అంటారాయన. తొలి రచనల్లో పద్య కవిత్వం ఉన్నప్పటికీ ఆయన సాహితీ వ్యాసంగం అంతా పరిశోధనాత్మక వచనంగానే సాగింది.

1922లో గాంధీమహాత్ముని నిర్బంధం, 1936లో గీతాభూమిక, 1940లో "భట్టుమూర్తి రామరాజ భూషణుడా?" పుస్తకాలు ప్రచురించారు. 1942లో పిల్లల పుస్తకం "నవ్వులు-పువ్వులు" పేరుతో పాతపాటలు, కొత్తపాటలు అనే రెండు విభాగాలు వ్రాసి, తెలుగు బిడ్డలకు అంకితం ఇచ్చారు.1961లో 'ప్రహ్లాద చరిత్రము' వ్రాశారు. 1944లో 'మన జమీందారీలు', 1946లో 'ప్రజానాయకుడు ప్రకాశం', "హంపీ పిలుపు" గ్రంథాలు వ్రాశారు. 1947ఘంటశాల చరిత్ర వ్రాసి, 1966లో పెంపు చేసి మళ్ళీ వ్రాశారు.

1946లో 'ప్రజానాయకుడు ప్రకాశం', 1948లో ఆచార్య రంగా (జీవిత చరిత్ర)నీ, 'మన రైతుపెద్ద' పేరుతో గొట్టిపాటి బ్రహ్మయ్య గారి జీవిత చరిత్రనీ వ్రాశారు. పిల్లల పుస్తకం "గాంధీ తాత" కూడా అదే సంవత్సరంలో వ్రాశారు. 1949లో బాల సాహిత్య బహుమతి పొందిన "సరోజినీ దేవి" గ్రంథం. 1951లో వల్లభాయి పటేల్ జీవిత చరిత్ర, 1967లో "పంజాబు కేసరి లాలాలజపతిరాయి", 1969లో "కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు గారి జీవితము-సాహిత్యము ", 1971లో "కిసాన్ వెంకట సుబ్బయ్య" పుస్తకాలు వ్రాసి ప్రచురించారు.

1952లో అక్షరాభిషేకం, "శరత్ జీవితం" గ్రంథాలు వెలువరించారు. శరత్ జీవితం గ్రంథాన్ని గదర్ వీరుడు దరిశి చెంచయ్య గారికి అంకితం ఇచ్చారు.1955లో 'శరత్ జీవితం', 'శరత్ సాహిత్యమూ' కలిపి శరద్దర్శనం పేరుతో పెద్దపుస్తకంగా తెచ్చారు. వెంకట సుబ్బయ్య గారి కుమార్తె శకుంతల, అల్లుడు శివరామకృష్ణలు నెలకొల్పిన 'దేశి కవితామండలి' సంస్థ శరత్ సంపూర్ణ సాహిత్యాన్ని ప్రచురించింది. 'దేశి కవితామండలి' అంటే శరత్ సాహిత్యం, శరత్ సాహిత్య మంటే దేశికవితా మండలి అనే నానుడి పుట్టింది...." అని ఆ సంస్థ పట్ల వెంకటసుబ్బయ్య గారు తన సంతృప్తిని వ్రాసుకున్నారు.

"1958లో 'చలం జీవితం-సాహిత్యం' గ్రంథాన్ని చలం జీవితంలో అనేక మార్పులకు కారణమైన చింతా దీక్షితులకు అంకితమిచ్చాను. "చలం గొప్ప శిల్పి ఆయన జీవితానికీ రచనలకు సంబంధమున్నట్టే, ఆయన కళలకు, జీవితానికీ సంబంధమున్నది. "There is no such thing as a moral or an immoral book, Books are well written or badly written. That's all అనే ఆస్కార్ వైల్డ్ మాటలు చలం రచనలకు వర్తిస్తాయి" అంటారాయన. చలం పుస్తకాన్ని ప్రచురించినప్పుడు. "శరత్"ని వ్రాసిన చేత్తో చలాన్ని వ్రాస్తారా...?" అన్న వారు కూడా లేకపోలేదని వ్రాసుకున్నారు.

1959లో రెండో అమ్మాయి సుగుణ పోయినప్పుడు 'వేదన' అనే కావ్యం వ్రాసిన తరువాత తనకు హృదయ భారం తగ్గిందని వ్రాసుకున్నారాయన. ఆ సంవత్సరమే "మాట-మన్నన" పుస్తకాన్ని తెచ్చారు. "మాటంటే మనసు, మనసంటే మాట, మనసులు కలిసేటట్టు నేర్పు గలిగి మాట్లాడాలి" అంటారాయన. సంజీవదేవ్ గారికి ఈ పుస్తకాన్ని అంకితం చేశారు. తన మిత్రుల సామాజిక కృషిని విశ్లేషిస్తూ 1970లో 'మిత్రులూ-నేనూ" గ్రంథాన్ని వ్రాశారు.

శరత్‌బాబు, చలం, కవిరాజు(త్రిపురనేని రామస్వామి చౌదరి) ఈ ముగ్గురినీ ఆయన 'ఆధునిక కవిత్రయం' అంటారు. "నాకు తెలిసినంతవరకూ మన తెలుగులో మొట్టమొదటి స్వీయ చరిత్రను వ్రాసుకున్నది ఏలూరు వాస్తవ్యులు ప్రథమ ఆంధ్ర చరిత్రకారుడు కావలి బుర్రయ్య. అనంతరం ఇంగ్లీషు పద్ధతిలో తెలుగులో స్వీయచరిత్రను 1910లో చక్కగా వ్రాసుకున్నది వీరేశలింగం. ముదిగొండ జగ్గన్నశాస్త్రి వ్రాసిన "వీర సావర్కరు" ఒక గొప్ప కావ్యము. దాని ప్రభావము పెక్కురుపైన బడినది. కోమాండూరు శఠగోపాలాచార్యులు వ్రాసిన జీవిత చరిత్రలలో తాతాచార్య చరిత్రము గొప్పది. రమణారెడ్డి గారి కవికోకిల చరిత్ర ఒక కావ్యముగా వెలసినది..." ఇలాంటి సమాచారం నూతన పరిశోధకులకు గొప్ప సహాయకారి.

ముట్నూరి కృష్ణారావు గారిగురించి వెంకట సుబ్బయ్యగారు చేసిన వర్ణన ముమ్మూర్తులా ఆయన్ని సాక్షాత్కరిస్తుంది:"కృష్ణరాయనిది గుండ్రని ముఖం, విశాలమయిన కాటుక కండ్లు, కోటేరు వంటి ముక్కు, విశాలమయిన వక్షస్థలం, దీర్ఘ బాహువులు, పండువంటి శరీరఛ్ఛాయ... ఆ దివ్య సుందర విగ్రహానికి తగిన తెల్లని పారాడే పంచెకట్టు, చీలమండల వరకూ వ్యాపించిన బారు లాల్చీ, రాజఠీవిని ధిక్కరిస్తూ కోణాలు తీరిన ధవళ శిరో వేష్టనమూ, నల్లని ఆకు చెప్పులు, చేతికర్రను ధరించిన ఆ నిండైన విగ్రహాన్ని చూచి, ఆయనను "ఎవరు ఈ మహానుభావుడు" అనుకునేవారు. ఆయన ఈ లోకపు మనిషి కాదు. దివ్య లోకమునుండి అవతరించిన మహానుభావుడు" ఇలా సాగుతుందా వర్ణన.

యన్ జి రంగా జీవిత చరిత్ర చదువుతుంటే ఆయన గురించి మాత్రమే కాదు, ఆయన సమకాలికులతో పాటు, జమీందారీ ఉద్యమాన్ని, విద్యార్థి ఉద్యమాన్నీ స్వాతంత్ర్యోద్యమాల గురించి తెలుస్తుంది. అలాగే ఆయన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు చరిత్ర చదువుతుంటే, ఆంధ్రదేశపు చరిత్ర, ఆంధ్రోద్యమం, స్వాతంత్రోద్యమం తొలినాళ్ళ సంగతులెన్నో గ్రహిస్తాం."మిత్రులూ-నేనూ" గ్రంథంలోసాహితీ సామాజిక మిత్రుల్ని వరుసగా పరిచయంచేస్తూ, తన భార్యను కూడా మిత్రుల జాబితాలో ఒకరుగాపరిచయంచేస్తారు.

పండిత వెంకట సుబ్బయ్య గారి చరమ ఘడియల్లో విషాద సంఘటనలెన్నో చోటు చేసుకున్నాయి. తుమ్మల కృష్ణాబాయిగారు ఆయనను నాన్నగారూ అని పిలిచేవారు. ఆనాటి పరిస్థితిని ఆమె ఇలా వ్రాశారు: "చదువుతూ చదువుతూ సుగుణ పోయింది. ఎంతో కృషితో పైకి వస్తున్న అల్లుడు శివరామకృష్ణ అనుకోకుండా నడివయసులో కన్ను మూశారు. తనకు పక్షవాతం వచ్చింది. అయినా కన్నీరు వత్తుకుంటూ సహధర్మచారిణిని ఓదార్చారు.

మిత్రదర్శనం రచనా వ్యాసంగం ఎప్పటిలాగానే ...రాను రానూ మాట గొణుగుపడినా నవ్వు చెరగలేదు. అవయవాలు అశక్తత ప్రకటించినా తపన తీరలేదు. పురమాయింపులు ఆగలేదు. ... అనారోగ్యం బాగా కృంగ దీస్తున్నప్పుడు - ఇంక విశ్రాంతి తీసుకోవచ్చుగదా అంటే, రాయగలిగినంత వరకూ రాయనీయమ్మా...నాకు అదే తృప్తి...' అన్నారు."

కష్టాలొచ్చినప్పుడు కూడా తొణకని స్థిత ప్రజ్ఞతతో ఎనభై నాలుగేళ్ళపాటు వెలిగిన ఆ సాహితీ జ్యోతి 1982జూలై 1న ఆరిపోయింది.

- డా. జి వి పూర్ణచందు

# కిడ్స్ కార్నర్



## బిందువుని... సింధువుని!

పిల్లలూ.... నేనొక నీటి చుక్కని. ఒక్క నీటిబొట్టునని నిర్లక్ష్యంగా చూడొద్దు. సముద్రానికి కూడా నేనే మూలం. భూమికి కూడా నేనే ఆధారం. ఈ గ్రహింపు వల్ల తరిగిపోతున్న నీటి వనరుల పట్ల అవగాహన కలుగుతుంది, ఆ  అవగాహనవల్ల నీటి సంరక్షణ పట్ల బాధ్యత పెరుగుతుంది. అప్పుడెప్పుడో 500 కోట్ల క్రితం సూర్యుడి నుంచి రాలిపడిన భూమి ఒక అగ్నిగోళంలా మండి నప్పుడు, అ అత్యధిక ఉష్ణోగ్రతల్లో, రెండు హైడ్రోజన్ పరమాణులు ఒక ఆక్సిజన్ పరమాణువుతో కలిసి అణురూపంగా ఉన్నాను. అలా ఏర్పడ్డ నీటి అణువులు ఆవిరి రూపంలో ఉండేవి. ఇవి భూమిచుట్టూ మేఘూలుగా చేరాయి. మేఘూలు చల్లబడి వర్షించేవి. ఇలా లక్షలాది సంవత్సరాలు వర్షాలు కురవడం వల్ల బూమి చల్లబడి ఘనరూపంలోకి మారింది. భూమిపైనున్న పల్లపు ప్రదేశాలన్నీ జలమయమై మహాసముద్రాలుగా మారిపోయాయి. ఇప్పటికీ భూ ఉపరితలంపై నాలుగింట మూడొంతులు నీరు ఆక్రమించి ఉంది. 97.2 శాతం ఉప్పునీరుగా సముద్రాల్లో ఉంది. 2 శాతం ధృవాల దగ్గర పర్వతాలపై మంచు రూపంలో ఉంది. కాబట్టి, కేవలం ఒక్క  శాతం మాత్రమే మీకు అందుబాటులో వుండి, మీ దాహం తీరుస్తున్నాను. నేను బిందువునే కాదు, సింధువు- అంటే సముద్రాన్ని కూడా. మరి నన్ను జాగ్రత్తగా కాపాడుకునే బాధ్యత మీదే కదా!



దారి కనుక్కోండి

## చిన్నారి 'చిత్రం'





**అక్షిత పాకనాటి**
1వ తరగతి
సెయింట్ ఫ్రాన్సిస్ స్కూల్, బెంగళూర్

చిన్నారుల పెయింటింగ్స్‌ను
apchiefeditor@gmail.com కు
ఈ మెయిల్ చేస్తే ప్రచురిస్తాం.

రంగులు వేయండి






చుక్కలు కలపండి



# దైవానుగ్రహం ఎందుకు?



పసిపిల్లలు తీవ్ర అసౌఖ్యానికి లోనయ్యి గుక్కపెట్టి ఏడుస్తుంటారు. తమ అసౌఖ్యానికి కారణమేమిటో వారికి తెలియదు. దానికి పరిష్కారమేమిటో వారు చెప్పలేరు. వారెందుకు ఏడుస్తున్నారో తల్లి తక్షణమే గుర్తిస్తుంది. వారికి ఆకలయ్యింది. వారికి పాలివ్వగానే కేరింతలు కొడుతూ ఏడవడం మానివేస్తారు. కొంచెం వయస్సు పెరగగానే పిల్లలు తమ భౌతిక అవసరాలు తాము గుర్తించగలుగుతారు. భౌతికంగా ఏ ఇబ్బంది కలిగినా దానిని పరిష్కరించుకోగల సామర్థ్యాన్ని క్రమంగా అందరూ అందిపుచ్చుకోకల్గుతారు.

వయస్సు పెరుగుతున్నప్పుడు ప్రతి ఒక్కరూ తమ వైన స్వంత నిర్ణయాలు తీసుకోవలసి వుంటుంది. ఏ నిర్ణయం ఏ పరిణామాలకు త్రోవ తీస్తుందో ఖచ్చితమైన అవగాహన వుండదు. ఒక సమస్యను ఎలా ఎదుర్కోవాలి? ఎలా పరిష్కరించాలి? తాము కోరిన రీతిలో పరిష్కరించితే తరువాత ఏయే సమస్యలు తలెత్తవచ్చు? వాటినెలా ఎదుర్కోవాలి? చిన్నప్పుడు ఆకలయ్యి ఏడిస్తే తల్లి వచ్చి తమ సమస్యను పరిష్కరించినట్లు, జీవితాంతం తాము ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించే వారెవరయినా వుంటే చాల బాగుంటుందని అత్యధిక శాతం మంది భావిస్తుంటారు. ఇలా అభిలషించే చాలా మంది దైవాన్ని ఆశ్రయిస్తారు. తాము ప్రగాఢంగా విశ్వసించే, రోజూ ఆరాధించే దైవమే తమ సమస్యలను పరిష్కరిస్తుందని నమ్ముతుంటారు.

వందల కిలోమీటర్ల దూరం నుండి అనేక వ్యయప్రయాసల కోర్చి వచ్చి, ఒక ప్రసిద్ధ దేవాలయంలో దైవ దర్శనం కోసం క్యూలో నిల్చొన్న వారి మనోగతాన్ని పరిశీలించితే ఆశ్చర్యం వేస్తుంది. సుమతి తన తల్లి తండ్రులతో కలిసి దైవ దర్శనానికి వచ్చింది. ఆమె ఒక సాఫ్ట్‌వేర్ ఉద్యోగి. ఆమె బలవంతం చేసి అందరినీ అక్కడకు తీసుకువచ్చింది. ఆమె తనతో పని చేస్తున్న ఒక యువకుడిని ప్రేమించింది. అతని కులం వేరు. తమ కులం వేరు. అతను ఈమెను వివాహమాడడానికి తన కుటుంబ సభ్యుల్ని ఒప్పించాడు. ఈమె మాత్రం తన తల్లి తండ్రులతో అసలీ విషయమే చెప్పలేదు. తాను చెబితే వారు అంగీకరించరని, తనను దూషిస్తారని, ఇంట్లో పెద్ద గొడవ అవుతుందని అమె భయపడుతోంది. దేవుని దయవలన వారు చిరు నవ్వుతో తమ వివాహానికి అంగీకరించితే బాగుంటుందని ఆమె భావిస్తోంది. తాను తల్లితండ్రులతో చెప్పాలి. వారు ముందుగా అంగీకరించరు. వారిని ఒప్పించాలి. వారి భయాలు పోగొట్టాలి. తన అభిప్రాయాన్ని మార్చుకొనేది లేదని దృఢంగా చెప్పాలి. వారు అంగీకరించక తప్పని స్థితి కలిగించాలి. ఇదంతా క్లిష్టమైన, ఇబ్బందికరమైన, ఎంతో ధైర్యాన్ని కూడగట్టుకొని చేయాల్సిన కార్యక్రమం. ఇందుకు సన్నద్ధం కాలేక, దేముడే తన సమస్యను పరిష్కరిస్తే బాగుండునని సుమతి అమాయకంగా కోరుకొంటోంది.

సుమతి కుటుంబం వెనుక సురేష్ అనే యువకుడు నిలబడి వున్నాడు. అతనికి 30 ఏళ్ళ వయసు. ఇంజనీరింగ్ పూర్తయ్యింది. తన గ్రామంలోనే నివసిస్తూ, ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడు. ఉద్యోగం వస్తే తప్ప అతనికి పెళ్ళి కాదని, అతను జీవితంలో స్థిరపడడని, అతని తల్లితండ్రులు నిరంతరం చెబుతుంటారు. ఏదో ఒక ఉద్యోగం తనకు లభించాలని, అందుకై దేముడు సహాయపడాలని అతను అభిలషిస్తున్నాడు. అతను ఇంజనీరింగు పాసయ్యి అప్పుడే అయిదేళ్ళయ్యింది. ఎక్కడా ఉద్యోగం చేయకపోవడం వలన అతనికెటువంటి అనుభవమూ చేకూరలేదు. పైగా గ్రామంలో వుండడం వలన ఉద్యోగావకాశాలు ఎక్కడ వున్నాయో, వాటిని అందిపుచ్చుకోవడానికి ఏయే ప్రయత్నాలు చేయాలో అతనికి తెలియదు. తమ గ్రామానికి చెందిన కొందరు పట్టణాల్లో ఉద్యోగాలు చేస్తున్నారు. వాళ్ళు వచ్చినప్పుడు కలవడానికి వారికి ఎక్కడైనా ఉద్యోగవకాశాలు వుంటే తెలియజేయమని కోరడానికి ఇతని ఉద్యోగ ప్రయత్నాలు పరిమితమయ్యాయి. ఇతని స్థితిలో వున్న యువకులు, ఎవరో ఒకరి ఆసరాతో పట్టణానికి వెళతారు. అక్కడ ఏదో ఒక ఉద్యోగంలో చేరతారు. తరువాత మరో ఉద్యోగంలో, మరో ఉద్యోగంలోకి మారలేరు. ఎంతో అనుభవం సంపాదించి చివరకు ఒక ఉద్యోగంలో స్థిరపడతారు. అలా కాకుండా, సురేష్ లాగా తన ఇంట్లో తాను కూర్చుంటే వచ్చే ఉద్యోగం ఏదీ వుండదు. ఉద్యోగం కాకుండా, ఏదో ఒక వ్యాపారం ద్వారా తన జీవనోపాధి చూసుకోగల సామర్థ్యం సురేష్ కు లేదు. తమ సామర్థ్యాన్ని పెంపొందించుకుంటూ, నిరంతర ప్రయత్నం వల్లనే ఉద్యోగం లభిస్తుందే తప్ప దైవానుగ్రహం వలన ఉద్యోగం లభించదు.

సురేష్ వెనుక రామారావు తన కుటుంబ సభ్యులతో పాటు నిల్చొన్నాడు. రామారావు ఒక చిరువ్యాపారి. ఒక చిన్న పట్టణంలో అతనికి ఒక కిరాణా దుకాణం వుంది. అతని వయస్సు 50 సంవత్సరాలు. అతనికి ఇద్దరు పిల్లలు. వాళ్ళు సరిగా చదువుకోవడం లేదు. భార్య ఎప్పుడూ అతన్ని సాధిస్తుంటుంది. అన్నింటికి మించి అతని ఆరోగ్యం ఏ మాత్రం బాగోవడం లేదు. ఎప్పుడూ నీరసంగా వుంటోంది. తమకు దగ్గరలో వున్న వైద్యుడ్ని అతను ఎప్పటికప్పుడు సంప్రదిస్తూనే వున్నాడు. అతనిచ్చిన మందులన్నీ క్రమం తప్పకుండా వేసుకొంటున్నాడు. అయినా అతని ఆరోగ్యం ఏ మాత్రం మెరుగుపడలేదు. దైవదర్శనం చేసుకొంటే తమ కష్టాలన్నీ వైదొలిపోతాయని అతను ఆశిస్తున్నాడు. తమ ఇరుకు ఇంట్లో పిల్లలు ప్రశాంతంగా చదువుకోగల వాతావరణం లేదు. పిల్లలను హాస్టళ్ళలో జేర్పించితే, వాళ్ళు తమ సమయాన్నంతటినీ చదువుపై కేంద్రీకరించగల అవకాశం లభిస్తుంది. తమకు దగ్గర్లో వున్న పాఠశాలలో పిల్లల్ని జేర్పించాడే తప్ప, మంచి పాఠశాల ఎక్కడ వుందని అతనెప్పుడూ ఆలోచించలేదు. తమకు దగ్గర్లో వున్న ఒక చిన్న వైద్యుడి దగ్గరే అతను వైద్యం చేయించుకుంటున్నాడే తప్ప మంచి వైద్యశాలలో, అన్ని రకాల వైద్య పరీక్షలు చేయించుకొని, తన ఆరోగ్య సమస్యను నిర్ధారించుకోవడానికి అతనెన్నడూ ప్రయత్నించలేదు. అసలు సమస్యను నిర్ధారించుకొని, అందుకు తగిన మందులు వాడితే అతని ఆరోగ్యం పూర్తిగా కుదుటపడుతుంది. అలాగే తన భార్యలో అసంతృప్తి ఎందుకు వుందో, తనను నిరంతరం ఎందుకు వేధిస్తుందో అతనికి అవగతం కాదు. ఆమెను ఇబ్బంది పెట్టే అంశాలను గుర్తించి, వాటిని పరిష్కరించడానికి ప్రయత్నిస్తే ఆమెలో వేదన, నిస్సహాయత, ఆగ్రహం తొలగిపోయేవి. దైవానుగ్రహం వలన తమ సమస్యలు తొలగిపోతాయని రామారావు అమాయకంగా విశ్వసించడం వలన ప్రయోజనం ఏముంది?

ఆకలయ్యి, తమకు అసౌఖ్యం కలిగినప్పుడు పిల్లలు ఏడ్చినట్లు, తాము పరిష్కరించుకోగల అతి సులభ సమస్యలను నేరుగా పరిష్కరించుకోకుండా దైవాన్ని ఆశ్రయించడం వలన ప్రయోజనమేముంటుంది?

– సి నరసింహారావు
మనోవైజ్ఞానిక విశ్లేషకులు

# యార్డ్ డ్యూటీ



గాలి వాటుకి మిడతల దండొచ్చి
వాలినట్లు
ఒక్క సారిగా  అన్ని వైపుల్నించీ
బడి పచ్చికలోకి పరుగెత్తుకొస్తారు పిల్లలు
వీళ్లకు తోక లొక్కటే తక్కువ
కాదు కాదు- తోకలు మరీ ఎక్కువ
అందుకే కామోసు
ఇనుప ఊచల మీద తల క్రిందులుగా
వేళ్లాడుతూనే కనిపిస్తారెప్పుడూ
అజమాయిషీల చేతికర్రలు లేని
అమెరికా ఇది
మధ్యాహ్నపు పహారా
ఉద్యోగంలో
పిల్ల కోతులెన్ని కుప్పిగంతులేసినా
మందలించడానిక్కూడా
మర్యాద పూర్వకమైన
స్వరం కావాలిక్కడ
అబద్ధపు మెచ్చుకోలు పదాలు,
అన్నిటికీ నవ్వాల్సిన పెదాలు కావాలిక్కడ
ఒక చిన్న బుడతడు
తల పైకెత్తి ఆకాశంలోకి చూస్తున్నట్లు
ముఖంలోకి అమాయకంగా చూస్తూనే
సవాలక్ష యక్ష ప్రశ్నల్తో
పెను మస్తిష్కాన్నైనా చిత్తు చేస్తాడు
ఒక రెండో తరగతి గడుగ్గాయి
కనుసన్నల్లోంచి
తుర్రుమని తప్పించుకునే మార్గాల్లో
అప్పటికే పండిపోయి ఉంటాడు
అయిదో తరగతి
ముదురు టెంకాయి
నిర్లక్ష్యపు చూపుల్తో
ప్రపంచాన్ని ఎదిరించడానికైనా
సిద్ధమన్నట్లుంటాడు
పిల్లలు ఎన్ని కోతిపన్లు చేసినా
ఊచల మీద వేళ్లాడేవన్నీ మృదువైన
తురాయి పూలే
చిన్నారుల చిలిపి కళ్లల్లో దాగున్నవన్నీ
అందమైన బాల్యాలే
అటూ ఇటూ పరుగులిడుతూనే
చెక్కుకున్న  మోకాలుతోనూ
విరగ్గొట్టుకున్న ముంజేయితోనూ
ఏడుస్తూ వచ్చే
పసి పిల్లల్ని చూడగానే
గుండె ఆగి కొట్టుకుంటుంది
అప్పటికప్పుడు భుజాన
మోసిన కడుపు తీపి జ్ఞప్తికి వస్తుంది
ఏ పసిహృదయంలోనూ
మొలకెత్తనివ్వని దు:ఖాన్ని
గుండె అతి భారంగా మోస్తుంది
నిమిషానికొక సారి ఊదే
విజిల్ శబ్దం వెనక
అప్పటికప్పుడు ఆటమానిపించి
కూచోబెట్టి లెక్కింపజేసే
రెండొందల అంకెల చాటున
జాలితో మూలిగే
హృదయమొకటి-
జారుడు బల్ల మీద
తల కిందులుగా జారే వాడూ-
మెడ మీద పాకే
చీమని కొట్టుకోకుండా
ఏడుపు లంకించుకునే చిన్నదీ-
రెండు చేతులూ వదిలేసి
ఊస మీద నిరాధారంగా
నిలబడే సాహసీ-
పరుగెత్తుకొచ్చి
గభాలున ఢీకొట్టుకుని
దులుపుకుని పారిపోయే బండోడూ-
పిల్లల తోడి లోకం
అత్యుత్తమ ప్రపంచమై
లోలోపల ఆనందతాండవం చేసే చోట
మధ్యాహ్నపు
పహారా ఉద్యోగంలో
"యార్డ్ డ్యూటీ" అన్న పిలుపు తప్ప
పేరులేని  పర్యావరణంలో
ఎటు చూసినా
మిడతల వడగళ్ళన్నీ
తుంపరల సీతాకోకచిలుకలై
రెప రెపలాడుతూ వాలతాయి
బడి ప్రాంగణంలో
అందమైన ఆరు రెక్కల
మంచుపూలలా
ఆహ్లాదంగా గింగిరాలు కొడ్తూ
ఆకాశం నించి
మిరుమిట్లు గొల్పుతూ
ప్రత్యక్షమవుతాయి



కె.గీత, కాలిఫోర్నియా

# ఆశ... ఆశయం... ఆదర్శం!

చదువనివాడజ్ఞుండగు, చదివిన సదసద్వివేక చతురత కలుగున్;
చదువగవలయును జనులకు, చదివించెద ఆర్యులొద్ద చదువుము తండ్రి!



ఈ మాటలన్నది హిరణ్యకశిపుడు; తన కుమారుడైన ప్రహ్లాదుడితో! ఏ తండ్రైనా తన సంతానాన్ని చదివించాలని కోరుకుంటాడు. ఏ విద్యను అభ్యసించాలి?

లోకంలో సుఖంగా జీవించటానికి అవసరమైన చదువేనా? మానవజన్మ ఎత్తినందుకు, పాపభీతి, సంఘనీతి, దైవప్రీతి కలిగి ఉత్తమ మానవుడుగా జీవించటానికి అనువైన మార్గం సూచించే చదువునా?

లోకవిద్య, భోగాన్ని, పారలౌకిక విద్య యోగాన్ని ప్రసాదిస్తాయి.

లోకవిద్య, ప్రపంచంలో ఉన్న వస్తువుల గురించిన విషయాన్ని పరిచయం చేస్తుంది.

దీనికి భిన్నంగా, ఆత్మవిద్య, వస్తువుల మూలాన్ని ఆవిష్కరించి, వ్యక్తిని సంపూర్ణ మానవుడిగా తీర్చిదిద్దుతుంది. విద్య వివేకాన్ని, విచక్షణను, సహజ ఆనందాన్ని, నిత్యతృప్తిని, మానవతను అనుగ్రహించగల దివ్య సాధనం.

సహజీవన సౌందర్యాన్ని, శీలనిర్మాణాన్ని, సహనాన్ని, ప్రజ్ఞను కలిగించి వ్యక్తిత్వ వికాసాన్ని కలిగించగల శక్తి విద్యకు మాత్రమే ఉన్నది. మానవుడు మానవుడుగా జీవించటానికి విద్యే ఆధారం.

కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలను గమనించుకుని వాటి స్థానంలో సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస, దయలను నింపుకోగల అవకాశం విద్య కల్పిస్తుంది.

నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక స్థితులను సాధించుకోవటానికి విద్యే ఆధారం. సత్యము నుండి ధర్మము, ధర్మము నుండి అర్థము, అర్థము నుండి కోరదగిన దానిని కోరి, పొందవలసిన దానిని పొందినపుడు ఆనందము, శాంతి లభించి చివరకు పవిత్రమైన దివ్య ప్రేమ వైపు వ్యక్తిని విద్య నడిపిస్తుంది.

గతించిన కాలం నుండి స్ఫూర్తిని పొందాలి.

వర్తమానాన్ని స్పష్టంగా అనుభవించాలి.

భవిష్యత్తును స్వర్ణమయంగా తీర్చిదిద్దుకోవాలి. దీనికి విద్య తప్ప మరొక మార్గం లేదు.

మార్కులు మాత్రమే ఇచ్చే చదువు కాక, జీవితంలో రిమార్కు ఇవ్వని చదువును అభ్యసించాలి. విలువలను ఆచరించాలి.

ఆకార మానవ స్థితి నుంచి ఆచార మానవ స్థితిలోకి ప్రయాణం కొనసాగించాలి.

స్వీయ సంస్కరణకు ప్రతి వ్యక్తీ శ్రీకారం చుట్టాలి. స్వీయ లోపాలను ఎరగాలి. వాటిని సమూలంగా పెకలించాలి. అదే అసలు విద్య. అకుంఠిత దీక్షతో అచ్చ తెలివిని సంపాదించుకోవాలి.

విద్య వినయాన్ని ఇస్తుంది. నిస్వార్థ సేవను విద్యే నేర్పుతుంది.

ఒక శాస్త్రం మీదనో, విషయం మీదనో అధికారం సంపాదించటం అంత కష్టం కాదు. తన మీద తనకు స్పష్టమైన అవగాహన, నియంత్రణ సాధించటమే కష్టం. దానికై విస్తృత గ్రంథ పఠనం, శ్రవణం, ధ్యాస, సజ్జన సాంగత్యం, మహాత్ముల సమాశ్రయం, నిశ్చితభావం... వంటి వాటికై నిరంతరం తపించాలి. ప్రతి విజయాన్ని సమాజపరం చేసి సమాజాభివృద్ధిలో పాలు పంచుకోవాలి.

మానవతా పరిమళంతో జీవితాన్ని స్పష్టంగా జీవించాలి.

జీవించటం ఎట్లాగో తెలుసుకోవాలంటే రామాయణం చదవాలి.

నొప్పింపక, తానొవ్వక జీవితాన్ని సమతులంగా జీవించటం కోసం భారతం చదవాలి.

జీవిత పరమార్థం తెలుసుకోవాలంటే, భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వ, ముక్తులను ఎరుకపరచే భాగవతం చదవాలి.

దేహభావం వలన కలిగే ప్రతి సందేహానికి సమాధానం కావాలంటే భగవద్గీత చదవాలి.

చదవటం తొలిదశ; ఆచరించటం మలిదశ; అనుభవించటం అసలు దశ.

ఆచరణకు నోచని చదువులన్నీ వ్యర్థమే.

అనుభవం తెలియని ప్రజ్ఞలన్నీ ఓటి కుండలే.

ఆచరించి, అనుభవించి, అనుభూతిని పొంది, విభూతి స్థాయికి చేరుకోవటమే విద్య అందించే పరమార్థం.

అతివేగంగా మారుతున్న సమకాలీన సమాజం ఈ విషయాన్ని గుర్తించి వర్తించకపోతే పరిణామాలు దు-స్తరంగా ఉంటాయి. ఆ కారణంగా జాతి తన ఔన్నత్యాన్ని కోల్పోతుంది. ఎవరికి వారే ఈ పరిస్థితిని గమనించి ప్రవర్తించాలి.

తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్యార్థి కలిపితే ఒక అద్భుతకోణం.

వీరి మధ్య సమన్వయం లోపిస్తే వ్యవస్థ పతనమౌతుంది.

తల్లితండ్రులు తమ బిడ్డ ఉత్తమ మానవుడు కావాలని కోరుకోవాలి. ఆశలకంటే ఆశయాలు గొప్పవని గుర్తించాలి. బాతురెక్కలతో ఆకాశంలోకెగిరే ప్రయత్నం చేయకూడదు. గగనంలోకి దూసుకుపోవాలంటే గరుడ పక్షి రెక్కలుండాలి. పరిమితిని ఎరిగి తమ బిడ్డలు సక్రమంగా ఎదిగేలా చూడాలి.

ఉపాధ్యాయుడు నిత్య విద్యార్థి వలె ఉండాలి. జీవన విలువలను తన జీవన విధానం ద్వారా ఆచరించి బోధించాలి. అట్టివారే ఆచార్యులు.

ఇక విద్యార్థి ఎలా ఉండాలో, ప్రహ్లాదుడి గురించి భాగవతం ఏమన్నదంటే...

తనయందు అఖిల భూతములయందు ఒక భంగి
సమహితత్వంబున జరగువాడు,
పెద్దల పొడగన్న, భృత్యుని కైవడి చేరి నమస్కృతుల్
సేయువాడు,
కన్నుదోయికి అన్యకాంతలడ్డంబైన మాతృభావము చేసి
మరలువాడు,
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను దీనులను కావ
చింతించువాడు, సఖులయెడ సోదర స్థితి జరుపువాడు,
దైవతములంచు గురువుల తలచువాడు,
లీలయందును బొంకులు లేనివాడు,
లలిత మర్యాదుడైన ప్రహ్లాదుడధిప!

ప్రత్యేకించి వ్యాఖ్యానం అక్కరలేని పద్యమిది.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు,

అంతరంగముకన్న అధ్యాపకుడు లేడు,
అరయ కాలమె మీకు పరమ గురువు,
గ్రంథరాజమగును ప్రత్యక్షలోకమే,
ఎవడు స్నేహితుండు? ఈశ్వరుండె! అంటారు.

భవిష్యత్తంతా యువతదే! విశ్వమంతా విద్యార్థిదే! అచ్చ తెలివి అనుగ్రహించే ఆనందంతో ప్రతి విద్యార్థి ప్రహ్లాదుడు కావాలి. అంటే సంపూర్ణమైన ఆనందస్వరూపుడుగా వెలగాలి.

– వి.యస్.ఆర్. మూర్తి
ఆధ్యాత్మిక శాస్త్రవేత్త

# ఆకులూ... అలములూ

అరణ్యాలలో ఏ ఋతువులో తిరిగినా తినడానికి ఏదో ఒకటి– కందమో మూలమో, ఆకో పువ్వో, కాయో పండో దొరుకుతాయి. కాని చాలమందికి– తెలియని మొక్కను నోట్లో పెట్టుకునే ధైర్యం ఉండదు. కనీసం ముందుగానే ఆయా మొక్కల వివరాలు తెలిస్తే భయాందోళనలకు తావు ఉండదు. కొత్త ప్రదేశాలలో చిక్కుకున్నప్పుడు– అక్కడ దొరికే ఏయే కందలూ మూలాలూ, ఆకులూ అలములూ, కాయలూ పండ్లూ, తదితరాలూ తిని కొన్ని రోజులన్నా ప్రాణాలు నిలుపుకోవచ్చునో తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉంది. ముఖ్యంగా దేశ సరిహద్దులను యెల్లవేళల కాపాడే వీర సైనికులకు. ఆ విషయం పక్కన పెడితే– ఇప్పుడు తినడానికి పనికివచ్చే కొన్ని మొక్కలను రెండు మూడు దఫాలుగా పరిచయం చేస్తాను. మొదటి వంతుగా ఇవిగో...

ముద్ర బెండ (అబ్యుటిలన్ ఇండికం): దీనికి తుత్తురు బెండ, కంగి, దువ్వెన కాయ అనే పేర్లు కూడ ఉన్నాయి. దీని పువ్వులు తింటారు.

సిర్రాకు (అమరాంథస్ పాలిగేమస్): ఆకులు కూర వండుకుంటారు.

నమ్మ దుంప (ఎపొనజిటాన్ నేటన్స్): దుంపలు ఉడకబెట్టి తింటారు. పచ్చివీ తినవచ్చు.

కుంటి గచ్చా (అర్డిసియా సొలనేసియా): పండ్లు తింటారు. ఆకుల్ని కూర చేసుకుంటారు

జేవుటొ(అర్టొకార్పస్ లకూచ): పండ్లు తింటారు. ఇది పనస ప్రజాతికి చెందినది. పుల్లగా ఉంటాయి.

తెల్ల పురుగుడు(సెకురినిగా ల్యూకోపైరా): పండ్లు తింటారు.

ఆదొండ(కపరిస్ జెలానిక): పండ్ల గుజ్జు తింటారు.

మల్లేరు బద్దు (సెలాస్ట్రస్ పానిక్యులేటా): పూలు కూర వండుకుంటారు.


పాలగడ్డ తీగ


తెల్లపురుగుడు


నమ్మదుంప


రామబాణం

కాకిదొండ (కాక్సినియా గ్రాండిస్): లేత ఆకును కూర వండుకుంటారు.

కొండ గోగు(కక్లోస్పెర్మం రిలిజియోజం): లేత ఆకు కూర వండుకు తింటారు.

బంక నక్కెర (కార్డియా డైకాటమా): లేత ఆకు, పూలు కూర వండుకుంటారు.

చిమిలీ కుడ(క్రిప్టోకొరైన్ రెట్రొస్పైరాలిస్): ఆకులు, వేరు–దుంప కూర వండుకుంటారు.

బైచాంది (డయోస్కోరియా హిస్పిడా) : దుంపను ఉడకబెట్టి తింటారు. చక్రాల్లా కోసి , ఉడికించి, యెండబెట్టి నూనెలో వేపి తింటారు.

నార తేంగ (డయోస్కోరియా అపోజిటిఫోలియా): దుంపలు కాల్చుకుని తింటారు.

చెంచు గడ్డ (డయోస్కొరియా పెంటాఫిల్లా): దుంపలను ఉడకబెట్టి తింటారు.

కుకుర్ ఆలూ (డయోస్కోరియా ప్యూబర్): దుంప ఉడకబెట్టి తింటారు.

తెల్ల వార్జము (ఎరిథ్రినా ఇండికా): గింజలు ఉడకబెట్టి తింటారు.

పెద్ద బిక్కి (గార్డెనియా లేటిఫోలియా): పండ్లు తింటారు.

బొంత కూర (గ్రైనస్ లోటాయిడిస్): ఆకులు కూర వండుకు తింటారు.

ఇసుక దుగ్గలకూర (గ్రైసెకియా ఫార్నసియాయిడిస్): ఆకు కూర వండుకుంటారు.

గొలుగు(గ్లైకాస్మిస్ పెంటాఫిల్లా ): పండ్లు తింటారు.

రాముడి బాణం (లేత ఆకులు(ఫ్రాండ్స్) కూర వండుకుతింటారు.

పాల గడ్డ తీగ (హోలస్టెమ్మా ఏన్యులేర్): పూలు పచ్చివి తింటారు. కూరకూడ చేసుకుంటారు. వేరు వలుపు తింటారు.

– కొప్పుల హేమాద్రి

# పల్నాటి రాతిలో శిఖామణి!

## 'దేవ బందానమ్మ...స్వామి బందానో...
## దేవర దేవ 'శిఖామణి' బందానో...'





భారతరత్న స్వర్గీయ భీమ్ సేన్ జోషి, హిందూస్తానీలో గానం చేసిన ఆ కీర్తనను లక్షలాది మంది యూట్యూబ్‌లో వీక్షించారు. అంతకంటే ఎక్కువ మంది నిత్యజీవితంలో ఆలపిస్తున్నారు, ఆలకిస్తున్నారు. అన్నమయ్యను అన్నగా భావించిన ఆయన సమకాలీనుడు, కర్నాటక సంగీత పితామహునిగా కన్నడిగులు ఆరాధనోత్సవాలు జరుపుకుంటోన్న పురంధరదాస విరచిత కీర్తనల్లో 'దేవబందానమ్మ' ఒకటి. బౌద్ధం ప్రభావం శ్రీ వైష్ణవంపై ఉంది అనడానికి గల అసంఖ్యాక కారణాల్లో 'శిఖామణి' అనే పదమూ ఒకటి! అమరావతి శిల్పంలో ఒక శిఖామణి ఉన్నారు. రెండు చేతులు జోడించి తేజస్సుతో ఉట్టిపడే వ్యక్తి సిగలో మణి ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. కుడివైపున ఛత్రం పట్టుకుని నాగవంశీయ రాజు, ఆయన అంతేవాసి, ఎడమవైపు చామరం పట్టుకున్న స్త్రీ, మరొక సేవిక ఆ శిల్పంలో ఉంటారు. 167.7 సెంటీ మీటర్ల ఎత్తు -110.6 సెంటీమీటర్ల వెడలు - 9 సెంటీమీటర్ల మందం, కలిగిన పల్నాటి రాతిలో వినమ్రంగా నిలుచున్న ఆ తేజోమూర్తి పేరు 'చక్రవర్తి'! క్రీ.శ. 1816 సెప్టెంబర్ 4న అమరావతి (ధరణికోట)లో ఆ శిల్పాన్ని మెకంజీ బృందం చూసింది. ముందుగా డ్రాయింగ్ రూపంలో రికార్డు చేసారు. అసలు శిల్పం తర్వాత కాలంలో మెడ్రాస్ మీదుగా బ్రిటిష్ మ్యూజియం చేరింది.

ఒకనాటి రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యపు రాజధానిలో ఉన్న ఆ చక్రవర్తి ఎవరు? అనేకమంది రాజులను సామంతులుగా కలిగిన మహారాజు చక్రవర్తి అనే అర్థం ఈ చక్రవర్తికి వర్తించదు! ఈయన 'చక్రాన్ని వర్తింప చేసిన వ్యక్తి, చక్రానికి 'వర్తన' అంటే కదలిక ఇచ్చిన వ్యక్తి. ఆయన ఏ చక్రాన్ని తిప్పారు? జింకలు స్వేచ్ఛగా విహరించే ఉద్యానవనంలో ఇప్పటి సారానాథ్ లో 'ధర్మచక్ర పరివర్తన' చేసారు. అదే సమయంలో అమరావతిలో 'కాలచక్ర'ను పరివర్తితం చేసారు. ధర్మచక్రం లేదా కాలచక్రం రెండూ ప్రతీకలే! వ్యక్తులు-సమాజం, కదిలే దిశను బట్టి అవి ప్రభావం చూపుతాయి. నిస్తేజమైన సమాజంలో అవి లేనట్లే ఉంటాయి. మనం పోగొట్టుకున్న బౌద్ధ ధర్మ గ్రంథాలు, టిబెట్, చీనా, జపాన్ దేశీ-యులు అనువాదం చేసుకున్న గ్రంథాలు, వాటి ఆంగ్ల అనువాదాల ప్రకారం శిల్పంలోని చక్రవర్తి గురించి కొన్ని విశేషాలు:

ఈ చక్రవర్తి అత్యున్నత శక్తి వంతుడు

నలువైపులా ధర్మచక్రాన్ని ప్రవర్తింపచేస్తాడు

గజతురగపదాతి దళాలను

సకల సంపదలను సమస్తాన్నీ సమర్పించి

విజేతలందరూ ఇతనికి శరణులవుతారు

ఈ చక్రవర్తి ప్రవచించే ఆరోగ్యసూత్రను పాటిస్తే

సన్నవారు తగినంత లావవుతారు

లావెక్కినవారు తగినంత సన్నబడతారు

ఈ చక్రవర్తి ప్రవచించే సంపదసూత్ర వింటే

పేదలకు లేమి ఉండదు

ధనికులకు చోర భయం ఉండదు

ఈ చక్రవర్తి నిద్రాసూత్ర పాటిస్తే:

గ్రహీతలు నిదురలో బెదరరు - మెలకువలో చెదరరు

ఈ చక్రవర్తి రాజ్యంలో లేని ఎల్లలు ఏవి?

పొలిమేరల్లో, కొండకోనల్లో

సమస్త వేదనాస్వరాలను ఆలకిస్తాడు

జీవుల సుఖసంతోషాల కోసం కంటిపై రెప్పవేయని బోధిసత్వులకు

తన శిరస్సు ముడివిప్పి చక్రవర్తి శిఖామణినిస్తాడు

అది అన్ని దుర్వాసనలనూ దూరం చేసే జ్ఞాన పుష్పం

**-పున్నా కృష్ణమూర్తి**

(క్రీ.శ. 5వ శతాబ్ది)

# విష్ణుకుండిన గోవింద వర్మ తుమ్మలగూడెం శాసనం

శ్రీ పర్వత – విజయపురి నుంచి పాలించిన ఇక్ష్వాకుల తరువాత, కృష్ణా – నర్మదా నదుల మధ్య ప్రాంతాన్ని విష్ణు కుండినులనే రాజులు పాలించారు. శాసనాధారాల ప్రకారం మొదటి గోవిందవర్మ క్రీ.శ 420 ప్రాంతంలో సింహాసనమెక్కి విష్ణుకుండిన రాజ్యాన్ని స్థాపించాడు. ఇతడు సంయక్సం బుద్ధుని మార్గాన్ని అనుసరిస్తూ, బౌద్ధ భిక్షువులకు, బ్రాహ్మణులకు, నిస్సహాయకులకు, యాచకులకు, రోగులకు, బాధితులకు అవసరాలు తీర్చటానికి ఎన్నో గ్రామాలను, భూములను, బంగారాన్ని, ఏనుగులను, గుర్రాలను, గోవులను, ఎడ్లను, శయనాసనాలను వాహనాలను, ఆహారపానీయాలను, వసతి, బట్టలు, కన్యలు, దాసదాసీజనులను దానం చేశాడు. అంతేకాదు, తన రాజ్యమంతటా, విహారాలు, ఆలయాలు నిర్మించి, చెరువులు తవ్వించి, తోటలు పెట్టించి వాటిని నిర్వహించటానికి, తన రాణి నిర్మించిన పరమమహాదేవి హారం మరమ్మతులకోసం ఎన్మదల, ప్రేలకపణు అనే గ్రామాలను తన 37వ రాజ్య సంవత్సరం, వైశాఖ పున్నమి నాడు దానం చేశాడని పేర్కొంటున్న ఈ శాసనం, ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యూం. 2, పేజీలు 9–14 లో ప్రచురించబడింది. సంయక్సంబుద్ధ వందనంతో ప్రారంభమైన ఈ శాసనంలో బుద్ధుడి గుణగణాలను, బౌద్ధ ధర్మాన్ని శ్లాఘించటంతో పాటు అన్ని జీవరాసుల నిఖిల దారిద్ర్య, దు:ఖానికి ఉపశమనం కలగించేది బుద్ధ ధర్మమేనని పేర్కొనటం విశేషం. మొత్తం సంస్కృత భాషలోనూ, బ్రాహ్మీ లిపిలో సాగిన ఈ శాసనంలో అక్షరాలు కానుకొల్లు నందివర్మ శాసనాక్షరాల కంటే కొద్దిగా భిన్నంగా ఉండటం, యకారం, అపుడే ఇప్పటి రూపాన్ని సంతరించుకోవటం గమనించాల్సిన విషయం.

**మొదటి రేకు-రెండో వైపు**



1. స్వస్తి జితం భగవతా తేన సంబుద్ధేన కృపాత్మనా నిర్వాణ ప్రాప్తయే యేన సద్యోమార్గ: ప్రదర్శిత: !! సత్వసత్య
2. త్యాగా భిజన నయ వినయోత్సాహాది గుణగణ సంపదా స్వయమధిగత రాజ్యాణం సమ్యక్ప్రజాపాలనాత్ప్ర
3. ధి తావదాత పృథు యశసాం రాజ్ఞాం విష్ణుకుణ్డీనా మమల విపుల సకల కుల తిల
4. కేన శ్రీ మహారాజేన్ద్ర వర్మ సత్పౌత్రేణ మహారాజశ్రీ మాధవవర్మణ: సుపుత్రేణ స్వతయ
5. భుజబలోత్సాహ ప్రభావానురాగా వాప్త స్వరాజ్యేనశౌర్య ధైర్య ప్రతాపానుభావా ద

**రెండో రేకు – మొదటి వైపు**



6. న్య సామన్తాక్రాన్త రాజ్యాన్తరేణ దానమానాదిభి రనురక్త వర్ణాశ్రమ స్వజన పరిజనేన గ్రామక్షేత్ర
7. హిరణ్య ద్విరద తురగ గో బలీవర్ద శయనాసన యాన పానభోజన భాజన భవన వసనాభరణ కన్యా
8. దాసిదాస సహస్రాణాం దాత్రా అనేక దేవాయతన విహార సభా ప్రపాత దోక్రోనుపానా
9. రామ ప్రతి సంస్కార పూర్వకరణేనాలంకృత సకల దిగన్తరేణ భిక్షుద్విజానాథ యాచక వ్యా
10. ధిత దీన కృపణజనోపభుజ్యమాన న్యాయాధిగత విభవ ధన సముదయేనా సకల సకుత్స-ర్వ
11. స్వత్యాగినా సకల శాస్త్రార్థ శ్రవణ పరిజ్ఞానాదిహ పరత్రచా నన్యచక్షుషా దిద్ధిచ్చూర మహా

**రెండో రేకు-రెండో వైపు**

12. కులీనజన సమాశ్రయేణ సకల సత్వధాతూత్రాణాయోత్పాదితి మహాబోధి విన్తేన మహారాజశ్రీ



13. గోవిన్దవర్మణా ఆత్మన: ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరేస ప్త్రింశత్మే వైశాఖే పూర్ణమాస్యాం భగ
14. వతో దశబలబలిన: చతుర్వైశారద్య విశారదస్యాష్టాదశవేణిక బుద్ధధర్మ సమలంకృ
15. త మర్తేద్వా త్రింశన్మహాపురుషలక్షణ వరోపలక్షితస్య జాతి జరా మరణ శోకాదిషు బహు
16. సంసార దు:ఖ నిమగ్న సర్వ సత్వోత్తారణా యానేక కల్పోసంజ్ఞయోపవీత పుణ్యజ్ఞాన సంభారభార
17. స్యా విగత రాగద్వేష మోహా జనన మరణ దు:ఖస్యా ప్రతిహతష్టావరణ సకలజ్ఞేయ జ్ఞానా

**మూడో రేకు – మొదటి వైపు**



18. స్సమ్యక్సంబుద్ధస్య బుద్ధస్య మార్గమభిప్రపన్నం నిర్వద్విరాగశీలా శిక్షా ధృ (ధ్రు) తగుణాధ్యయన శ్రవణ...
19. న్లన భావనా ధ్యాన సమాధి సమాపత్యాదిభి ర్గుణగణోరనుత్తరం పుణ్యక్షేత్రం త్రియానయాయినం చాతుర్ద
20. శ మార్యసఙ్ఘముద్దిశ్య త్యాగ పరిభోగాన్వయ మోపధిక (చో) పుణ్యక్రియా వప్పభి నిర్వర్త
21. యిష్యతా మాతాపిత్రో: సర్వ సత్వానావో నిఖిల దారిద్ర్య దు:ఖోపశమహేతో: స్వస్యా అగ్ర
22. మహిష్యా పరమ మహాదేవ్యా విహారస్య దీప ధూప గన్ధ పుష్ప ధ్వజ పాన భోజన శయనాసనగ్రాస
23. భైషజ్యచేణ్డ స్ఫుదితి శీర్ణ సంస్కారాది కుశల మూలానువచ్ఛేదార్థం ద్వావేన్మ్మదల పేణ్కపణ

– డా ఈమని శివనాగిరెడ్డి – స్థపతి

## ఎన్టీఆర్ తపన




ఎన్టీఆర్ తన సొంత చిత్రాల నిర్మాణంలో వీలైనంత వరకూ సహజత్వానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు. 'శ్రీనాథ కవి సార్వభౌమ' చిత్రంలో శ్రీనాథ పాత్రధారి ఎన్టీఆర్ కథానుగుణంగా జొన్న అన్నం తినాలి. పంచభక్ష్యపరమాన్నాలకు అలవాటు పడిన శ్రీనాథుడు అటువంటి దుస్థితికి లోనయ్యాడని చెప్పడానికి దర్శక రచయితలు (బాపు – రమణ) ఆ సన్నివేశాన్ని రూపొందించారు. ఎన్టీఆర్ ఆ దృశ్యంలో జొన్న అన్నం తినడానికి ఇబ్బంది పడతారేమోనని సహాయ దర్శకుడు అదే రంగులో ఉండేలా గోదుమనూకతో ఉప్మా చేయించి, ఆ సంగతి ఆయనకు చెప్పారు. ఎన్టీఆర్ అందుకు ఒప్పుకోలేదు. వంటమనిషిని పిలిపించి, జొన్న అన్నం ఎలా చేయాలో అతనికి వివరించి, ఆ సన్నివేశంలో నిజంగా అదే తిన్నారు!.

అలాగే కప్పం కట్టనందుకు శ్రీనాథుణ్ణి శిక్షించే సన్నివేశాల్లో – ఎన్టీఆర్ ను బంధించడానికి తోలు గొలుసులు చేయిస్తే, అవి వద్దని ఇనుప గొలుసులు ఉపయోగించారు. రాళ్ళపల్లి కొరడాతో కొట్టే సన్నివేశాలు కూడా ఉన్నాయి. ఆ దృశ్యాలలో మోహమాటపడకుండా, దెబ్బలు గట్టిగా తగిలేలా కొట్టమని, నిజంగా అలా కొట్టే వరకు ఎన్టీఆర్ పూరుకోలేదు. అదే ఆయన ప్రత్యేకత!

## వినోదంలో విషాదం

విజయవంతమైన కామెడీ చిత్రాలు తీసిన దర్శకుడు ఇవివి సత్యనారాయణ. కానీ ఆయన విజయం వెనక ఉన్న విషాదం, గెలుపు కోసం ఆయన పడ్డ పాట్లు ఈనాటి యువతరానికి స్ఫూర్తిగా నిలుస్తాయి. ఒకప్పుడు బాగా వెలిగిన రైతు కుటుంబం ఇవివిది. 19వ ఏట ఆయనకు వివాహం జరిగింది. రెండేళ్లకు – రాజేష్, ('అల్లరి') నరేష్ పుట్టిన తర్వాత – పరిస్థితులు చూస్తే–పంటలు పండక అప్పటికే ఆస్తులన్నీ పోయాయి. అంతకు ముందే మార్వాడి దగ్గర తాకట్టు పెట్టిన భార్య గాజుల్ని అమ్మేసి, ఆ వచ్చిన డబ్బులో యాభైరూపాయలు ఇంట్లో ఇచ్చి, తక్కిన ఎనభైరూపాయలతో సినిమా రంగంలో తన అదృష్టాన్ని పరీక్షించుకోడానికి ఇవివి మద్రాసు బయల్దేరారంటే, అది ఎంత పెద్ద అడ్వంచరో ఆలోచించండి! ఎనిమిది సంవత్సరాలపాటు దర్శకత్వశాఖలో అష్టకష్టాలూ పడుతూ పనిచేశాక దర్శకుడిగా ఇవివి తొలిచిత్రం 'చెవిలోపువ్వు' విడుదలై ఫ్లాప్ అయింది. దాంతో అంతకు ముందు 'మాకు సినిమాలు తీయండి' అని వచ్చిన పదకొండుమంది నిర్మాతలు ఇచ్చిన అడ్వాన్సులు తిరిగి తీసుకుని వెళ్లిపోయారు! అప్పుడాయన పరిస్థితి ఎలా ఉంటుంది? ఐనా, ఇవివి ఆత్మవిశ్వాసాన్ని కోల్పోలేదు. అప్పుడు ప్రముఖ నిర్మాత డి.రామానాయుడుగారు –'ప్రేమఖైదీ' చిత్రానికి సినిమా స్క్రిప్టును 17 వెర్షన్లు రాసి ఇచ్చాక – అప్పుడు అవకాశం ఇచ్చారు. అది 'హిట్' అయిన తర్వాతే ఇవివి




సత్తాను చిత్ర పరిశ్రమ గుర్తించింది. ఆ తర్వాత ఎన్ని 'హిట్స్' ఇచ్చినా, ఇవివి తన గడ్డురోజులను మాత్రం ఎప్పుడూ మరిచిపోలేదు!

## అజరామరం మార్లిన్ మన్రో బ్రాండ్

మార్లిన్ మన్రో (1926–62) కన్ను మూసి సుమారు 55 ఏళ్లు. అయినా, 'నువ్వు లేవు నీ పాట ఉంది.... ఇంటి ముందు జూకామల్లె తీగల్లో అల్లుకుని... లాంతరు సన్నని వెలుతురులో క్రమ్ముకుని... నా గుండెల్లో చుట్టుకుని...' అని ప్రపంచవ్యాప్తంగా విషాదించే అభిమానులు నేటికీ కోకొల్లలు. ప్రపంచ సినీ చరిత్రలో ఓ సినిమా నటి అలా చనిపోయిన తర్వాత




కూడా సంవత్సరానికి సుమారు 36 కోట్ల రూపాయల చొప్పున ఆమె వారసులకి ఆర్జించి పెట్టడం ఓ 'రికార్డు' సృష్టించింది. 'శృంగార దేవత'గా పేరుపొందిన మార్లిన్ ఫోటోలు, ఆమె ధరించిన దుస్తులు, వాల్ పోస్టర్లు మొదలైన వాటిపై, ఆమె వారసులకు వచ్చే ఆదాయాన్ని బట్టి, భౌతికంగా లేకున్నా అంత డబ్బును ఆర్జిస్తున్న ఏకైక మహిళగా ఆమె పేరు తెచ్చుకుంది! పదిహేనేళ్ల సినీ జీవితంలో మార్లిన్ మన్రో నటించిన చిత్రాల సంఖ్య ముప్ఫై దాటలేదు. ఐనా, అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ ఏదో రకంగా వివిధ వివాదాలతో ఆమె వార్తల్లోకి వస్తూనే ఉంది. 'ఆమె ఇక లేదు' అనే విషాదాన్ని తట్టుకోలేక ప్రపంచ వ్యాప్తంగా 24 మంది ఆమె అభిమానులు ఆత్మహత్యలు చేసుకున్నారంటే, ఆమె ప్రభావం వాళ్లపై ఎంత గాఢంగా ఉందో అర్థమౌతుంది. ఇంతటి విశేష ప్రజాదరణ చూరగొన్న మార్లిన్–అంత అర్థాంతరంగా ఎందుకు తనువు చాలించాల్సి వచ్చింది? అది అసలు ఆత్మహత్యేనా? లేక ఎవరో పన్నిన కుట్ర వల్ల ఆమె 'హత్య'కు గురైందా? అన్నది ఇప్పటికీ తేలని మిస్టరీ!

## పద్మనాభం తీసిన భానుమతి సినిమా

చిత్రరంగంలోకి రాకముందు ప్రముఖ హాస్యనటుడు పద్మనాభం– ప్రసిద్ధనటి భానుమతిని విశేషంగా అభిమానించే వారు. అప్పట్లో ఆమె నటించిన 'కృష్ణప్రేమ' చిత్రాన్ని నలభైసార్లు చూసినట్లుగా చెప్పేవారు. ఆ తర్వాత సినిమా రంగంలోకి ప్రవేశించి, నటుడు, దర్శక నిర్మాతగా రాణిస్తూ, ఎప్పటికైనా




భానుమతిగారితో ఓ సినిమా తీయాలని కలలు కనేవారు పద్మనాభం. చివరికి పరిస్థితులు అనుకూలించాయి. భానుమతి కూడా తన అభిమాని కోరికను మన్నించి, ఆయన తీసిన 'మాంగల్యభాగ్యం'లో నటించారు. ఆ చిత్రంలోనే పద్మనాభం, రమాప్రభ తొలిసారిగా ద్విపాత్రాభినయం చేశారు. దురదృష్టవశాత్తూ ఆ చిత్రం బాక్సాఫీసు వద్ద పరాజయం పాలైంది. "చిత్రం ఫెయిలైనా, నా అభిమాన నటితో సినిమా తీశానన్నదే జీవితంలో నాకు గొప్ప సంతృప్తి" అనేవారు పద్మనాభం.

– బి.కె. ఈశ్వర్




మాట్లాడడం అట్లా వుంచుదాం, తెలుగు రాయడం బాగా తగ్గిపోయింది. ఒకప్పుడు అంటే ముప్పై ఏళ్ల క్రితం దాకా బంధు మిత్రులకు జాబులు రాసుకునే అలవాటు వుండేది. టెలిఫోన్ సౌకర్యం అందరికీ అందుబాటులోకి వచ్చాక వుత్తర ప్రత్యుత్తరాలు పూర్తిగా పోయాయి. బంధువుల్ని పిల్లల్ని సాగనంపేటప్పుడు, చేరగానే వుత్తరం రాయండి. వుత్తరాలు రాస్తూవుండండి అని పదే పదే చెప్పడం ఆ రోజుల్లో సాధారణ దృశ్యం. ఇప్పుడది లేదు. క్షణ క్షణం సమాచారం అందించే సెల్ ఫోన్ జేబుల్లోకి వచ్చింది. అర్ధ శతాబ్దికి పూర్వం లేఖ సాహిత్యం ఒక కాల్పనిక శాఖగా ప్రాచుర్యంలో వుంది. చాలా మంది రాసిన వుత్తరాలు పుస్తకరూపంలో కూడా వచ్చిన సంగతి మనందరకు తెలుసు. కొంతకాలం క్రితం వివిధ పత్రికలు లేఖా సాహిత్యాన్ని ఒక ఆసక్తికర శీర్షికగా నిర్వహించారు. మాట్లాడుతున్నట్టు ఎంతో ఆప్తంగా వుత్తరం రాయడం ఒక కళ. ఆ కమ్మలు ఎన్నో కబుర్లని మోసుకు వచ్చేవి. కేవలం ఇంటి విషయాలేగాక అనేక ఇతర సంగతులు కూడా వుండేవి. కొందరు లేఖల్లో వాక్యాలను ఎంతో పొందికగా కూర్చేవారు. మరికొందరు మళ్లీ మళ్ళీ చదవాలనిపించేలా చాతుర్యంగా రాసేవారు. చరిత్రలో ఎందరో సాహితీ వేత్తలు రాసిన లేఖలు నేటికీ పరిమిళిస్తున్నాయి. స్వాతంత్రోద్యమంలో జైళ్ల నుంచి నాయకులు రాసిన జాబులు చరిత్ర పుటలుగా ఎప్పటికీ నిలిచి వుంటాయి. లేఖా సాంప్రదాయాన్ని ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మింగేసింది. కాలం మార్పుల్ని తేవడం సహజం కదా.

– ఎడిటర్

---

## అపభ్రంశాలు




మాజీ ప్రధాని ఇందిరాగాంధి – కాదు. దివంగత ప్రధాని ఇందిరాగాంధి. అలాగే దివంగత ప్రధాని మొరార్జీ దేశాయ్–సరికాదు. మాజీ ప్రధానిగా చెప్పాలి. ఇలాగే ముఖ్యమంత్రుల సందర్భంలో కూడా పొరబాట్లు దొర్లుతూ వుంటాయి. పదవిలో వుండగా మరణిస్తే దివంగత, పదవి దిగిపోయాక అయితే మాజీ అనాల్సి వుంటుంది.

దారుణమైన హత్యకు గురయ్యారు. దారుణంగా హత్యకు గురయ్యారు–యిది సరైన వాడుక.

ఇటీవల ఒక పత్రికలో, " స్వదేశానికి తిరిగొచ్చిన సౌదీలో చిత్రహింసలకు గురైన కేరళ యువకులు" అనే శీర్షిక వార్త వచ్చింది. "సౌదిలో చిత్రహింసలకు గురై స్వదేశానికి తిరిగొచ్చిన కేరళ యువకులు" అని వుండాలి. వార్తా శీర్షికలు నిజానికి అంత వివరణతో కూడా అవసరం లేదు. క్లుప్తసరి శీర్షిక పెట్టి, వార్తలో వివరణ యివ్వచ్చు.

ఈ మధ్య "వెలుగుల పందిరిలో చీకటి చుక్కలు " అనే శీర్షికతో ఒక వార్త వచ్చింది. ఒక విద్యుత్ కేంద్రంలో సరఫరాకు అంతరాయం ఏర్పడి దీపాలు ఆరిపోయాయి. దాన్నింత కవితామయం చేయక్కర్లేదు. లోగడ ఒక ప్రముఖ దినపత్రిక అర్ధరాత్రి వానకురిస్తే " నిశీధిలో నీళ్లధారలు" అని శీర్షిక పెట్టింది. పాఠకులు ఏమిటో అనుకున్నారు. తీరా చదివితే రాత్రి వాన కురిసింది. వడ్లగింజలో బియ్యపు గింజ.

## సామెతలు

అత్త మీద కోపం దుత్తమీద చూపించినట్టు – అత్తమీద కోడలికి కోపం వస్తే ఆమెపై చూపించలేదు. కోపాన్ని దుత్త మీద చూపిస్తుంది. అది కాస్తా పగులుతుంది. తిరిగి అత్తగారి ఆగ్రహానికి కోడలు గురౌతుంది. "దుత్త" అంటే ఒకరకం మట్టిపాత్ర. దుత్త, చట్టి చిన్న పరిమాణంలో వెడల్పు మూతితో తయారు చేసే మట్టి పాత్రలు. మూడు నాలుగింటిని ఒక దానిపై ఒకటిగా ఉట్టెలో పెట్టుకోడానికి




అనువుగా యివి వుంటాయి.

ఆ రోజుల్లో సారెపై కుంభకారుడు రకరకాల మట్టి పాత్రలను తయారు చేసేవాడు. "బాన" అంటే చాలా పెద్ద ఆకారంలో పెద్ద మూతితో వుంటుంది. బాన పొట్ట దాన్నిబట్టే వచ్చింది. బట్టలు నానపెట్టడానికి, వుడకపెట్టడానికి దీన్ని వాడేవారు. చిరుధాన్యాలు, చింతపండులాంటి దినుసులను భద్రపరుచుకోడానికి కూడా వీటిని వాడుకునేవారు. చాలా తక్కువ ధరకు లభించే గృహోపకరణం యిది. తరువాత చిన్న పరిమాణంలో బుంగ, కుండ తయారయ్యేవి. కుండకి కొంచెం పెద్ద మూతి వుండగా బుంగకి చిన్న మూతి అమర్చేవారు. చిన్న నోరు, పెద్ద బుగ్గలూ వున్న ఆడపిల్ల అలిగితే, బుంగమూతి పెట్టిందంటారు. ఆకుమడులకు, కూరపాదులకు నీళ్లు జల్లడానికి బుంగల్ని వాడేవారు. బుంగని మోకాలిపై నిలిపి సన్నటి మూతిలోంచి నీటిని వర్షపు జల్లులా చిలకరించే వారు. అదొక కళ. కుండలతో అన్నం వండుకునే వారు. పిడకల దాలిపై కుండలో పాలు కాచేవారు. చిన్న మూతితో చిన్నగా చేతిలో అమిరే పాత్ర పిడత. బావిలో నీళ్లు తోడుకోడానికి, కావిడి బద్దతో తీసుకువెళ్లడానికి అనువైనవి మట్టికడవలు. బావి వంచకు, వరలకు తగలకుండా నీళ్లతోడడం చాలా కష్టం. నిండుకుండకు ఏ మాత్రం దెబ్బతగిలినా భళ్లుమంటుంది. ఇవిగాక వీటిపై మూకుళ్లు మూతలు వుంటాయి. ఇంకా రకరకాలు...దీపపు ప్రమిదులు, చిచ్చుబుడ్లు, డబ్బు దాచుకునే పిడతలు, కూజాలు, తాబేటి కాయలు కుమ్మరిసారెమీద పుట్టేవి. తరువాత "ఆమ"లో ఆ పచ్చి మట్టి సరుకు చేవ తేలేవి. ఘట వాయిద్యాలై వేదికలపై మోతమోగించేవి! తీగలాగితే డొంకంతా కదిలిందంటే యిదేమరి. ఒక మాట మీంచి మాట, సంగతి లోంచి సంగతి.

దేవతలు నాశనం చేయాలన్నకున్నవానికి ముందు పిచ్చి పట్టిస్తారు – ఇది అచ్చమైన తెలుగు సామెత. మన పురాణాలలో దేవతలు వరాలు యివ్వడం, వారు సరైనవారు కాకపోతే వాటిని దుర్వినియోగం చేయడం, చివరకు చావు తెచ్చుకోవడం చాలా చోట్ల కనిపిస్తుంది. "కుక్కని చంపాలంటే ముందు దానికి పిచ్చి ఆపాదించు " ఇది ఆంగ్ల సామెత. తెలుగు సామెత ఆట్టే వినిపించదు గాని యీ ఆంగ్ల సామెతని ఎక్కువగా వాడుతుంటారు.

## వీణల పేర్లు

మన సంప్రదాయంలో ఆయుధాలకు, ఆభరణాలకు,




రథాలకు, గుర్రాలకు, ఏనుగులకు పేర్లుండడం గమనిస్తాం. గాండీవం, పాంచజన్యం, కౌస్తుభం, అశ్వత్థామ యీ కోవకు చెందినవే. అలాగే వీణలకు పేర్లున్నాయి. అన్నీ ప్రసిద్ధమైనవే.

విశ్వావసుని వీణ బృహతి.

తంబురుని వీణ కళావతి.

నారదుని వీణ మహతి.

సరస్వతి వీణ కచ్ఛపి.

శివుని వీణ నాలంచి.

వత్సరాజు వీణ ఘోషవతి.

ఏడు తంత్రుల వీణని పరివాదిని అంటారు. నారదుని వీణ మహతికి వంద తంత్రులు!.

## పొడుపు కథలు

ఇవి మానవజాతి సంపద. వినోదాన్ని, విజ్ఞానాన్ని




పంచుతాయి. మెదళ్లను పదును పెడతాయి. వేదకాలం నుంచి పొడుపు కథలున్నాయి. ఋగ్వేదంలోని కొన్ని పొడుపు ప్రశ్నలు బహుళ ప్రచారంలో వున్నాయి. ఇవిగాక పురాణాలలో యివి కనిపిస్తాయి. భారతంలోని యక్ష ప్రశ్నలు పొడుపు కథల్లాంటివే. ప్రబంధాలలో, కావ్యాలలో, చాటువులలో పొడుపు కథలు కోకొల్లలుగా కనిపిస్తాయి. కథ సరిత్సాగరం, భేతాళ పంచవింశతిలలో సమస్యాత్మక పొడుపు కథలున్నాయి. యువరాణికి పొడుపు కథలంటే పిచ్చి. కథ విప్పితే పెళ్ళాడుతా, విప్పలేకపోతే తలతీయిస్తానంటుంది. ఇలాంటివి మన జానపద సాహిత్యంలో ఎన్నో కనిపిస్తాయి. ఈ ప్రక్రియ అన్ని భాషలలోనూ కనిపిస్తుంది. ఒక్కొక్క భాషలో ఒక్కో పేరుతో పిలుస్తారు. తెలుగులో వీటిని కొన్ని చోట్ల విచ్చుకథలంటారు. విప్పుకథలంటారు.

రాయలసీమలో మారుకతలుగా ప్రసిద్ధి. తెలంగాణలో తట్టుకథలని పిలుస్తారు. భావగూడత కలిగివుండేవి పొడుపు కథలని సంస్కృత పండితులు నిర్వచించారు. వీటిని ఇరవైరకాలుగా విభజించారు. వృత్తిపరమైన చిక్కుముడితో రూపొందినవి అనేకం వుంటాయి. ఉదా: చవిలేక నిప్పులో కాలేవాడు, తాపం లేక చెరువులో నానేవాడు, బతికుండి గోతిలో కూర్చునే వాడు – ఎవరు ? కమ్మరి, రజక, నేతశిల్పి. ప్రకృతి పరమైనవి కూడా విరివిగా వున్నాయి. ఉదా: బులుగు చీర చిన్నది, నాజూకు వున్నది, ముగ్గు పెట్టుతున్నది, ముద్దులాడుతున్నది – ఎవరది? జవాబు ఆకాశం. కాని పదాలతో సరదాలు మరొక రకం. కోడిగాని కోడి పకోడి, యంత్రం గాని యంత్రం సాయంత్రం వుదాహరణలు. శబ్దచిత్రాలు లేక చిత్రశబ్దాలున్నాయి. అవి – పామేల దుముకు –కప్పకై; గుడిసేల కురియు – కప్పుకై; కొంగేల పొంచు – చేపకై. ఇంకా తాత్త్వికమైనవి, ఆలోచన రేకెత్తించేవి పలు రకాల పొడుపు కథలు వ్యాప్తిలో వున్నాయి. చరిత్రని ఇతిహాసాన్ని మూడు ముక్కల్లో చెబుతాయి యీ కథలు. 'కట్టె –కొట్టె ?తెచ్చె' అనే సంక్షిప్త రామాయణం యిందుకు వుదాహరణ. మన జానపద చాలా సాహిత్యం అనేక కారణాల వల్ల మరుగునపడిపోయింది. ఆ సాహిత్యంలో విజ్ఞానం వినోదంతో బాటు బతుకు తెరువుకి బాటలు కూడా వినిపిస్తాయి.

## నిత్య వాడుకలో పాత మాటలు

ప్రచార మాధ్యమాలు ముఖ్యంగా పత్రికలు మన భాషని నిత్యం గుర్తుచేస్తూ, ఎనలేని సేవచేస్తున్నాయి. ఒక వార్తని వివరిస్తూ, "అధికారులు కొరడా ఝుళిపించారు" అని వ్యాఖ్యానిస్తారు. నిజానికి యిప్పటి పాఠకులకు కొరడా తెలియదు. ఝుళిపించడం తెలియదు. కాని సరిగ్గా భావాన్ని అర్థం చేసుకుంటారు. అలాంటిదే " అగ్గిమీద గుగ్గిలం" అగ్గి తెలిసినా గుగ్గిలం కొత్తమాటే యీ నాటి వారికి. అయినా ఆ ప్రయోగం చక్కగా చెలామణీ అయిపోతుంది. అధికార దర్పం గలవారు హఠాత్తుగా కోపం తెచ్చుకుంటే, అగ్గిమీద గుగ్గిలం




అవుతారు. పూర్వం విద్యుత్ పుట్టక ముందు రాత్రివేళ నాటక ప్రదర్శనలు యిచ్చేటప్పుడు కాగడాల వెలుగుని ఆశ్రయించేవారు. కూచిపూడి భాగవతులు ఆ రోజుల్లో భామాకలాపం, దాదినమ్మపాన్పు మొదలైన నృత్య నాటకాలని తెల్లవార్లూ ప్రదర్శించేవారు. నాటకంలో ప్రత్యేక సందర్భాలలో కాగడాలపై గుప్పెడు గుగ్గిలం పొడిని జల్లేవారట. అప్పుడు కాగడా ఒక్కసారి జిగేలుమంటుంది. దాంతో పాటు వేదికపైని దృశ్యం, అందులోని పాత్రలు కూడా వెలిగిపోయేవారట. ఇది ఆనాటి "స్పెషల్ ఎఫెక్ట్స్"లో ఒక భాగం.

## ఒకదాని వెంట ఒకటి

యాంత్రిక యుగంలో పశుసంపద తగ్గిపోయింది. క్రమేపీ కనుమరుగై పోతుంది. పాలకోసం మాత్రమే పశువులను పోషిస్తున్నారు. శ్రమించడానికి యంత్రాలు వచ్చాయి కనుక కోడెలు, గిత్తలు, ఎడ్లు, అవసరం లేదు. పశుసంపదతో పాటు పశులకొట్టాలు కనుమరుగైనాయి. పలుపుతాడు, కట్టుకొయ్య, దాణాలాంటి పశువుల సావడి పరిభాష వినిపించే అవకాశం లేదు. చిట్టు, తవుడు యివి రెండూ ధాన్యం మీది పొట్టు. పై పొట్టుని ఊక అంటారు. తర్వాత పొట్టు చిట్టు, ఆ తర్వాతది తవుడు. వీటిని నీళ్లలో కలిపి పశువులకు ఆహారంగా తాగిస్తారు. దీన్ని కుడితి అంటారు. దుక్కిటెడ్లకు ఉలవలను వూడిగించి గుగ్గిళ్లను ఆహారంగా యిచ్చేవారు. చాలా బలవర్ధకమైన అహారం. గొడ్ల సావిళ్లలో పశువులకు సంబంధించిన సామగ్రి అందుబాటులో వుండేవి. ఇదంతా ఒకనాటి వైభవం. రైతు తన పశుసంపదను జాగ్రత్తగా చూసుకుంటూ, ఎక్కువ సమయం వాటి సంరక్షణలోనే గడిపేవాడు.

## పొడుపు – విడుపు

పొడుపు : ఆ రాజు కూతురు అధిక చక్కనిదట గోరింత కొప్పుపెట్టి గొలుసులు దిగవేసింది.

[illegible]

– శ్రీరమణ

## మనవి

మన మాటల్ని మళ్లీ ఒకసారి గుర్తు చేసుకొని, తలుచుకొని ఆనందించి, తృప్తిపడే శీర్షిక ఇది. మీ ప్రాంతాలలో మీ వినికిడిలో తారసపడ్డ మంచిమాటల్ని, జాతీయాల్ని, చమత్కారాలను యీ శీర్షికలో పంచుకోండి.

– సంపాదకులు
ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక




యవనిక
డా. పెద్ది రామారావు
వెల : రూ.200/- పేజీలు : 200
ప్రతులకు : అన్ని పుస్తక కేంద్రాలలో

## నాటకరంగంతో పేగుబంధం

హరిశ్చంద్రుడు- చంద్రమతీ లోహితాస్యుడిని లేపడానికి పడరాని పాట్లు పడుతున్నారు నాటకం జరుగుతున్న స్టేజీ మీద. అలాగని లోహితాస్యుడు విగతుడై పడివుండే కాటిసీను కాదది. 'భక్తయోగ పదన్యాసి వారణాసి/ భవదురిత శాత్రవఖరాసి వారణాసి...' అంటూ రెండో హరిశ్చంద్రుడు పంచమాంకంలోకి అడుగుబెట్టి ఆరున్నొక్క శ్రుతిలో రాగం అందుకొని కాసేపయ్యింది. కాలకౌశికుడి శిష్యుడు కేశవుడు తన తల్లి చంద్రమతిని అదిలించడం చూసి, బేహాగ్ లో అందుకోవాలి- "ఏర! మాయమ్మని ట్టీద్వ నీకేమిరా/ క్రూర! నిన్నిప్పుడే గ్రుద్దెదన్ జూడరా!/ దూరమందుండి మా తోడ మాట్లాడరా!/ శూరునిన్ లోహితున్ జూచి నోర్మూయరా!" అని. నిండా ఆరేళ్లు కూడా లేని ఆ చిచ్చర పిడుగు రిహార్సల్సులో డైలాగులూ, పద్యాలు అదరగొట్టి, అపరాత్రి నాటకం టైముకి నిద్రపోవడంతో డీవీ సుబ్బారావు గారు, చంద్రమతి వేషంలో ఉన్న మరో నట విదుషీ గూడూరు సావిత్రి ఆ ఆరేళ్ల బుడతడి గడ్డం పట్టుకొని బతిమలాడారు, 'లేవరా కన్నా' అని.

ఆనాడు అలా హేమాహేమీల సాంగత్యంలో నాటకరంగ ప్రస్థానం మొదలుపెట్టిన కుర్రాడు, నటన నుంచి రచన వైపునకు మళ్లి, ఒక నాటక రంగ పత్రికకు సంపాదకుడై, విద్యావంతుడై యూనివర్శిటీల్లో నాటక శాఖలో ఆచార్యుడు కావడం విశేషం. ఆయనే- పెద్ది రామారావు!

నాటకం అనేది ఎంత లోతైన, గాఢమైన అనుభూతిని ఇవ్వగలదో గుర్తుచేసే వ్యాసాల్ని, ప్రస్తుత తెలుగు నాటకం ఆ అనుభవౌన్నత్యానికి ప్రయత్నించడం లేదని కుండబద్దలు కొట్టే వ్యాసాల్ని, తన పాతికేళ్ల అనుభవసారంగా గుదిగుచ్చి 'యవనిక' పేరిట పుస్తక రూపేణ తెచ్చారు రామారావు. ఈ గ్రంథంలో 37 వ్యాసాలున్నాయి. ఏ డీవీ సుబ్బారావు గారితో బామాలించుకున్నాడో.... అదే డీవీ సుబ్బారావుకి నివాళులెత్తిన వ్యాసం- 'హరిశ్చంద్రుడు అబద్ధం చెప్పాడు '. ఆ మహానటుడి అజరామరత్వాన్ని అద్భుతంగా అక్షరబద్ధం చేశారు రచయిత. ఇంకా, చీమకుర్తి నాగేశ్వరరావు వంటి ఎందరో పద్యనాటక దిగ్దంతుల మీద రాసిన వ్యాసాలు కన్నీళ్లు తెప్పిస్తాయి. నాటక రంగంతో పేగుబంధం ఉందని చెప్పుకున్నారు రచయిత. ఆ రంగానికి సంబంధించి పొగిడినా, తెగిడినా ఆ ప్రేమపాశంతోనే చేశారు కాబట్టే, ఇది మిక్కిలి పఠనీయ గ్రంథం.

- నీరుకొండ ప్రసాద్

---

## సతత హరిత మార్గ దిశానిర్దేశకులు




ప్రకృతి నేస్తాలు
క్రాంతికుమార్ రెడ్డి, వెల : రూ.150/-
పేజీలు : 256, ప్రతులకు : రైతునేస్తం పబ్లికేషన్స్,
6-2-959, దక్షిణ భారత హిందీ ప్రచార సభ కాంప్లెక్స్,
ఖైరతాబాద్, హైదరాబాద్ -500 004,
ఫోన్: 9490559999

పర్యావరణ విధ్వంసం, పంచభూతాలు కలుషితం,మనిషి తీసుకునే ఆహారం విషతుల్యమై మానవమనుగడను, భావితరాల భద్రతను, పచ్చని పరిసరాల ఉనికిని ప్రశ్నార్థకం చేస్తున్నాయి. ఇటువంటి సమయంలో సహజ, ప్రకృతి, సేంద్రీయ సంబంధిత విధానాలు నదుల సాగుకు ఆదరించాలనే భావనలు ప్రారంభమయ్యాయి. ఒక్క ప్రాంతంలో ఒక్కోరీతిలో ఒక్క వ్యక్తి నాయకత్వంలో చిగుర్లు వేయించటం చూస్తున్నాం. కారణాలు ఏవైనా ఇటీవల కాలంలో తెలుగు రాష్ట్రాలలో కూడా కొంతమంది సేంద్రియ, ప్రకృతి సాగుకు శ్రీకారం చుట్టారు. వారి దిగుబడి పాఠాలు మరికొందరికి ఆదర్శమవుతున్నాయి. నూతన పంథాకు పునాదులు వేస్తున్నారు.

అయితే ఇటువంటి వారి విజయగాథలను పల్లె పల్లెకు తెలియజేయాలనే ఉద్దేశ్యంతో "రైతునేస్తం పబ్లికేషన్స్" వారు "ప్రకృతినేస్తాలు" పేరుతో ఒక పుస్తకాన్ని అందంగా, ఆకర్షణీయంగా, పాఠకులను ఆకట్టుకునేలా ముద్రించారు. ఆ పుస్తకంలో ప్రకృతి, సేంద్రియ వ్యవసాయ విధానాలు ప్రోత్సహిస్తున్న సంస్థలు, వ్యక్తులు, ఆదరిస్తున్న రైతులకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేశారు కూడా. ఒక 50 మంది ప్రత్యామ్నాయ వ్యవసాయ పద్ధతులతో పంటలు సాగుచేస్తూ మంచి దిగుబడులు, రాబడులు సాధిస్తున్న వారి సేద్యాలను రచయిత క్రాంతికుమార్ రెడ్డి అక్షయబద్ధం చేసిన తీరు అందరినీ ఆకట్టుకుంటుంది. వ్యవసాయాన్ని జీవనవిధానంగా వారు చేస్తున్న కృషిని వివరించిన విధానం, చదివే వారి కళ్ళముందు దృశ్యం సాక్షాత్కారించినట్లుంది. అంతేకాకుండా ఛాయాచిత్రాలు కనువిందు చేస్తాయి.

ఈ పుస్తకంలో సహజ, ప్రకృతి, సేంద్రియ వ్యవసాయ విధానాలలో వాడే ఎరువుల తయారీ, వాడే విధానం పొందుపరిచారు. పైగా ఈ విధానాలు సమాజానికి అందించిన పుకుటకా, చో మొదలుకుని నేటి పాలేకర్ దాకా వారి జీవితచిత్రణల, వారి విధానాల "ఆత్మ" ను కూడా ఒడిసిపట్టి ఆవిష్కరించారు.

వ్యవసాయ సమాజం మొత్తం ఒక్కసారి అయినా తప్పక చదవాల్సిన పుస్తకం. ఈ పుస్తకాన్ని తెలుగు సమాజానికి అందించే ప్రయత్నంలో సాహసం చేసిన "రైతునేస్తం" వేంకటేశ్వరరావు, రచయిత క్రాంతికుమార్ రెడ్డి అత్యంత అభినందనీయులు.

- వలేటి గోపీచంద్

# కందుకూరి కవితా సౌభాగ్యం




కందుకూరి శ్రీరాములు: కవిత్వ జీవనది, సౌభాగ్య, వెల : రూ.80/-, పేజీలు : 128, ప్రతులకు : నవచేతన బుక్ హౌస్, విశాలాంధ్ర బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, ప్రజాశక్తి, హైదరాబాద్, నవయుగ, విజయవాడ.

నలభై యేళ్లకు పైగా కవిత్వం రాస్తున్న కందుకూరి శ్రీరాములు పాఠకుల ఆదరణ పాత్రుడే. పరిశీలన, అభ్యుదయం, హృదయావిష్కరణ ఇత్యాది అంశాలను ఇంపుగానూ శక్తివంతంగానూ వ్యక్తీకరించిన తీరు కవితప్రియులకు సు-రుచిరమే. కందుకూరిని, ఆయన కవితను మరింతగా అభిమానించిన సౌభాగ్య మరింత అనుభూతించి, ఆస్వాదించి, అందులోని జీవనది సదృశ నైర్మల్యాన్ని ఔన్నత్యాన్ని విశ్లేషిస్తూ రాసిన విశ్లేషణే ఈ పుస్తకం.

పూర్వం కావ్యాలకు భాష్యాలు వెలువరించడం సర్వసాధారణమే. అపుడపుడు అధిక సంఖ్యలో ఈ భాష్యాలు వచ్చిన విషయం తెల్సిందే. అయితే సమకాలీన సహచర కవిపై పాఠకుడుగా తాను భావించింది, తనకు కన్పించింది సహృదయతో వివరించ పూనుకొన్న సౌభాగ్య అభినందనీయుడు. అటు కవిత్వ పరిచయం ఇటు విశ్లేషణ పటుత్వం చక్కగా సంగమించిన ఈ పుస్తకం పరితలకు చక్కని అనుభూతి కల్గించగలదు.కొత్త తరంలో విశ్లేషకులను విమ-ర్శకులను తయారు చేయనూగలదు..

**- రాము ఇటిక్యాల్**

# సప్రామాణిక 'బౌద్ధ వాఙ్మయ సర్వస్వం

'బౌద్ధ వాఙ్మయ సర్వస్వం గ్రంథాన్ని క్రీ.శే. పండిత బలదేవోపాధ్యాయ హిందీలో ప్రామాణికంగా రచించారు. ఆయన కోరిక మేరకు బహుభాషా కోవిదులు, సంస్కృతం, హిందీ, పాళీ, మరాఠీ, తెలుగు, ఆంగ్లభాషా ప్రవీణులు డా. పెదపాటి నాగేశ్వరరావు పాళీ, సంస్కృత గ్రంథాల ఆధారంగా స్వతంత్ర రచన అనిపించే విధంగా తెలుగులో అనువదించారు. ఈ గ్రంథంలో రచయిత కొందరు పండితుల బౌద్ధమతతత్త్వ ఖండనలను సోపపత్తికంగా పూర్వపక్షం చేశారు. రచయిత మూలవిధేయంగా శైలీసౌలభ్యంతో 'బౌద్ధ వాఙ్మయ సర్వస్వం' గ్రంథాన్ని అనువదించడం అభినందనీయం. డా. గోపీనాథ్ కవిరాజ్ వంటి బౌద్ధతత్త్వ ఆచార్యుల ప్రశంసలందు కొన ఈ గ్రంథం బౌద్ధ మతానుయాయులు, బౌద్ధ మత పరిశోధకులు విధిగా చదువదగినది.




'బౌద్ధ వాఙ్మయ సర్వస్వం'.
రచయిత డా. పెదపాటి నాగేశ్వరరావు
వెల : రూ.200/- పేజీలు : 456, ప్రతులకు: 402, అవంతి మేన్షన్, బి 64, డి.డి కాలనీ, శివం రోడ్, హైదరాబాద్. ఫోన్ : 9949486529

ఈ గ్రంథాన్ని రచయిత డా. పెదపాటి నాగేశ్వరరావు ఐదు ఖండాలుగా, 24 పరిచ్ఛేదాలుగా విభజించి, వర్గీకరించి సవివరంగా విశ్లేషించారు. బౌద్ధ ధర్మ విశేషాలు, బుద్ధుడి జీవిత చరిత్ర, బుద్ధుడి కాలంనాటి సామాజిక ధర్మాలను సవివరంగా ఈ గ్రంథంలో చర్చించారు రచయిత. అస్తవ్యస్తంగా ఉన్న ఆనాటి సామాజిక వ్యవస్థలో బ్రాహ్మణులు కూడా వ్యవసాయం చేసినట్టు భారద్వాజుడి కథ వల్ల తెలుస్తోంది. బుద్ధుడి సమకాలీనులైన దార్శనికుల వివరాలు, బౌద్ధ దర్శనం చారిత్రక రూపురేఖల వివరణ సహేతుకంగా జరిగిందీ పుస్తకంలో.

**- డా. పి.వి. సుబ్బారావు**

# స్వీకారం



**ప్రియే చారుశీలే!**
సుజలగంటి
**వెల :** రూ.150/-
**పేజీలు :** 248
**ప్రతులకు :** 303, అలైఖ్య రైన్ డ్రాప్స్, ప్లాట్ నెం. 17-18, గౌతమి పబ్లిక్ స్కూల్ పక్కన, కొండాపూర్, హైదరాబాద్ -500084, ప్రముఖ పుస్తక కేంద్రాలలో




**నవ్యాంధ్ర మంత్రులు సభాపతులు**
**వెల :** రూ.150/-
**పేజీలు :** 160
**ప్రతులకు :** దాసరి ఆళ్వార స్వామి, జర్నలిస్టు కుందేరు, (వయా) ఆకునూరు, కంకిపాడు మండలం, కృష్ణా జిల్లా -521 245
ఫోన్ : 9393818199




**అతను-ఆమె-కాలం**
బహుమతి కథల మణిహారం
**వెల :** రూ.150/-
**పేజీలు :** 200
**ప్రతులకు :** శ్రీమతి జి.ఎస్ లక్ష్మి, 2-2-23/7/1, బాగ్ అంబార్ పేట్, హైదరాబాద్ -500 013, అన్ని పుస్తక కేంద్రాలలో.
ఫోన్ : 9908648068




**ఒక రాస్తాను**
ర్యాలి ప్రసాద్
**వెల :** రూ.50/-
**పేజీలు :** 114
**ప్రతులకు :**అన్ని పుస్తక కేంద్రాలలో.
ఫోన్ : 9494553425

# విజయవిలాసం

విజయనగరం పేరు చెప్పగానే అందెలు సవ్వడి వినిపిస్తుంది. సంగీత సప్తస్వరాలు ఇంద్రధనువై కళ్లకు కడతాయి. ఎన్నో అపురూపమైన కథలూ గాథలూ చెవిలో అమృతం పోస్తాయి. ఆ కథలు అక్కడివారే చెప్పాలి. అందరూ విని ఆనందించాలి.

## వెయ్యి బరాణీలు

ఆనంద గజపతి రాజావారు గొప్ప వీణా విద్వాంసులు. వీణ చినగురురాయాచార్యులు వార్ధక్యంలో తన కుమారుడు వెంకట రమణదాసును రాజావారికి అప్పగించి, విద్వాంసుడిగా తయారు చేయమని కోరారు. రాజావారు ఆ బాధ్యత స్వీకరించారు. వెంకట రమణదాసుకి బరాణీలంటే చాలా యిష్టం. ఆనంద గజపతి వెయ్యి బరాణీలు తన దగ్గర వుంచుకుని, ఒక త్రిస్థాయికి ఒక బరాణీ గింజ చొప్పున దాసుగారి నోట్లో ప్రేమతో వేస్తూ రోజూ సాధన చేయించేవారు. అలాగ వెయ్యి త్రిస్థాయిలు వెయ్యి బరాణీలతో పూర్తి అయ్యేవి. తర్వాత రమణదాసు "వీణాచక్రవర్తి", "పట్కాల చక్రవర్తి" బిరుదులు వహించి సంస్థానానికి గురువుగారికి పేరు తెచ్చారు.

## అమృత హస్తం

1919లో విజయనగర సంగీత కళాశాలను విజయరామ గజపతి స్థాపించారు. హరికథాపితామహ ఆదిభట్ల నారాయణదాసుని అధ్యక్షులు గానూ, ద్వారం వాసా వారి లాంటి మేరు సమానులైన విద్వాంసులను ఆచార్యులుగానూ నియమించారు. అలాంటి సంస్థలో పనిచేసే డవాలా బంట్రోతు ఎటువంటివాడై వుండాలి? అతను నారాయణదాసు గారి కనుసన్నలలో మెలగాలి కదా! అందుకని విజయరామ గజపతి తన పర్సనల్ అటెండరు రామస్వామిని సంగీత కళాశాల బంట్రోతుగా నియమించారు. రామస్వామిది మంచిరూపం. మెరిసిపోతూ బుర్రమీసాలు, తిరు చూర్ణంతో నామం, తెల్లని పంచె, గ్లాస్కోలాల్చీ, తెల్లని పాగా, చేతిలో కర్ర, చెరగని చిరునవ్వుతో వుండేవాడు. హమేషా విజయరామ గజపతుల సన్నిధిలో వుండి వారి ఇంగితానికి అనుగుణంగాను, వారిని కలుసుకోడానికి వచ్చిన ఇతర సంస్థానాధీశుల అవసరాలు కనిపెడుతూ మెలిగినవాడు రామస్వామి. రాజా వారితో అతడనేక వుత్తరాది సంస్థానాలకు కూడా వెళ్లినవాడు. రాజు సేవలో సిద్ధహస్తుడు. ప్రభువులకూ, అతిథులకు వలసినప్పుడో అలసినప్పుడో సేవించడానికి అమృతం సిద్ధంగా వుంచడం, వారి మతం, మితం గ్రహించి దానిని అందించడం. రామస్వామిది అమృత హస్తం. అంతటి నమ్మకస్తుణ్ణి, సొంతవాణ్ణి సంగీత కళాశాలకు అందునా దాసుగారికి సేవ చేయమని రాజావారు నియమించారు. నెలకు ఆరు రూపాయలు జీతం.



రామస్వామికి స్కాట్‌లాండ్ ఆసవాల రుచులలోను, ఫ్రెంచి మధువుల మాధుర్యాలలోను ఎంత పాండిత్యమున్నా అనునిత్యం అలవాటైంది మాత్రం రామనామామృతపానమే! తను మిగుల్చుకున్న డబ్బుతో తనకో ఇంటితోబాటు శ్రీరాములవారికి ఒక చిన్న గుడి కూడా కట్టించాడు. రోజూ సాయంత్రం కళాశాల నుంచి ఇంటికి వెళుతూ మిత్రులెవరైనా కనిపిస్తే, ఆఖరికి చిన్న పిల్లలైనా సరే ఒక అర్ధణావో, అణావో అడిగి తీసుకుని పప్పు బెల్లాలు కొనేవాడు. తెల్లారకనే లేచి స్నానపానాదులయ్యాక గుడికి వెళ్లి, పూజ చేసుకుని ప్రసాదం పంచుతూ కాలేజీకి వచ్చేవాడు.

రామస్వామికి ఫిడేలు నాయుడు గారంటే పంచప్రాణాలు. ద్వారం వారు కళాశాల అధ్యక్షులుగా రిటైరయ్యేవరకూ రామస్వామి కూడా అక్కడ పనిచేశాడు. ఆ రోజుల్లో నాయుడు గారికి ఎంతటి పేరు ప్రతిష్ఠలున్నప్పటికీ, విస్తృతంగా కచేరీలు జరుగుతున్నప్పటికీ మొదట్లో ఆయన కచేరీలకు డబ్బు మాత్రం తక్కువే యిచ్చేవారు. ఇది 1920ల మాట. నాయుడు గారు తనకు నూటపదహార్లు పారితోషకం ఎవరైనా యిస్తారా? తన సంగీతానికి విలువకట్టేవారే లేరా అని వాపోతుండేవారు.

ఆ రోజుల్లో నాయుడు గారింట్లో గురుకులవాసం చేస్తూ చాలా మంది విద్యార్థులు, కళాశాల విద్యార్థులు వుండేవారు. రోజూ శిష్యుల్లో ఒకరు కూరగాయలు తెచ్చి, గురువుగారికి చూపించి లెక్కచెప్పి మిగిలిన చిల్లర యిచ్చేవారు. అప్పుడప్పుడు రామస్వామిని బజారు పంపేవారు. అతను తెచ్చినప్పుడు మాత్రం లెక్క పట్టించుకునే వారుకాదు. అతను ఎంత చిల్లర యిస్తే అంత తీసుకునేవారు. శిష్యులకి కంటికింపుగా వుండేది. తెగించి ఒకనాడు గురువు గారిని అడిగేశారు. యీ పక్షపాతం ఏమిటని. 'అయితే చెప్తాను వినండి' అంటూ నాయుడు గారు మొదలు పెట్టారు.

"ఎంత గొప్పగా వాయించినా, ఎంత పేరొచ్చినా సరైన గుర్తింపు లేదని బాధపడుతుంటే, రామస్వామి నన్ను వూరడించేవాడోయ్. మీకు స్వర్ణాభిషేకాలు జరిగే రోజులు వస్తాయండీ అని భరోసా యిచ్చేవాడు.. ఒకరోజున వచ్చి, అయ్యగారూ! నేను చిన్న రాములోరి గుడి కట్టించానండీ. రేపటి వుదయం విగ్రహాలు పెడుతున్నారు. మధ్యాహ్నం సంతర్పణ జరుగుతుంది. సాయంత్రం తమరు కచేరీ చేస్తే ధన్యుణ్ణవుతానన్నాడు. సరేనని పరమానందంతో కచేరీ చేశాను. బాగా రక్తి కట్టింది. కచేరీ కాగానే రామస్వామి నాకు తాంబూలంతో నూటపదహార్లు యిచ్చి నమస్కరించాడు. అంతగొప్ప సన్మానం మొదటిసారిగా చేసిన వాడిని చిల్లర లెక్క అడగమంటారా?" అని సూటిగా ప్రశ్నించారు.

రామస్వామి ఎనభైఏళ్లు దాటి శుభ్రమైన జీవితం గడిపాడు. ఒక సాయంకాలం రాములవారి దర్శనం చేసుకొని వచ్చాడు. రాత్రికి భోజనం వద్దు పాయసం చేయమన్నాడు. అందరితో కలిసి పాయసం సేవించి, ఆ రాత్రి సుఖనిద్రలో రాముని సన్నిధి చేరుకున్నాడు. అతను మాన్యుడా? సామాన్యుడా? అతని సంస్కారం యీ నేలలోంచి వచ్చిందా? నెనరులోంచి వచ్చిందా? విజయనగర సంస్కృతికి అచ్చమైన సాక్షి రామస్వామి. ఫిడేలు నాయుడు గారు సింహద్వారం!

(అక్కడి కథలు అక్కడి వారు చెబితేనే మర్యాద. ద్వారం దుర్గాప్రసాద్ రావు చెప్పిన గాథ యిది)

– శ్రీరమణ

# కొత్త ఏడాది...కొత్త, ఆశయాలు...

జనవరిలో ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు పాల్గొన్న కార్యక్రమాల చిత్రమాలిక.

**ఛాయాచిత్రం 1:** విజయవాడలో జరిగిన 67వ గణతంత్ర దినోత్సవ వేడుకల్లో ముఖ్యమంత్రి, ఇతర ప్రముఖులు. ఆకట్టుకున్న శకటాల ప్రదర్శన.

**ఛాయాచిత్రం 2:** కొత్త సంవత్సరంలోకి అడుగుపెట్టిన సందర్భంగా బెజవాడ కనకదుర్గమ్మ గుడిలో పూజలు నిర్వహిస్తున్న ముఖ్యమంత్రి దంపతులు.

**ఛాయాచిత్రం 3:** విజయవాడలో పోలియో చుక్కలు వేసేందుకు నిర్వహించిన ప్రచార కార్యక్రమం సందర్భంగా, పసిబిడ్డకు స్వయంగా చుక్కలు వేస్తున్న చంద్రబాబు.









Regd. No.HD - 962/2015-17
Published on 01-02-2016

ఆంధ్రప్రదేశ్

RNI No. 10926/1957
Posting: 4th & 5th



- గ్రామీణ నిరుపేద మహిళలలో ఆత్మవిశ్వాసాన్ని పెంచుతున్న శ్రీ నారా చంద్రబాబు నాయుడి ప్రభుత్వం
- మహిళలు ఆర్థికంగా నిలదొక్కుకోడానికి లక్ష రూపాయల వరకు పెట్టుబడి నేరుగా వారి ఖాతాలోనే జమచేస్తోంది ప్రభుత్వం
- ఇసుక తవ్వకాల అధికారం, ఆదాయం పూర్తిగా డ్వాక్రా మహిళలకే అప్పజెప్పిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



నవ్యాంధ్రకు నవోదయం - అభివృద్ధి పథకాలతో శుభోదయం

# పేదరికంపై గెలుపు

## ఇక పేదరికం మటుమాయం!
## మహిళా ఆర్థికాభివృద్ధి ఖాయం!!

జారీచేసినవారు : కమిషనర్, సమాచార, పౌరసంబంధాలశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథనిలయం

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,
రాజమహేంద్రవరము - 533101.
ఫోన్ : 0883 - 2462565
e-mail : mohanpublications@gmail.com

# మావద్ద లభించు గ్రంథములు



## వ్రత కథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీవ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాథ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాథవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీవ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీకుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీవ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |

| | | |
|---|---|---|
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |



# స్తోత్రాలు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |

| | | |
|---|---|---|
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |



# శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాథ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |



# జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72.00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 45.00 |
| 5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 30.00 |
| 7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 30.00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 30.00 |
| 9. సాదా క్యాలండర్ | 5.00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. పూర్వ పరాశరి | 100-00 |
| 20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. ప్రశ్న సింధు | 99-00 |
| 22. నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |
| 25. ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. జాతక మకరందం | 63-00 |
| 31. జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. నవరత్నములు శుభయోగములు | 36-00 |

| | | |
|---|---|---|
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |

| | | |
|---|---|---|
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 95. | శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. | రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. | ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. | ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. | లఘుజాతకం | 63-00 |
| 100. | జాతకాలంకారము | 63-00 |
| 101. | మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. | వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. | మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. | కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. | సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. | కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. | తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. | వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. | ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. | మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. | కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. | మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. | నారద సంహిత | 200-00 |
| 114. | పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. | తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. | సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. | రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. | ఛాయాగ్రహములు | 99-00 |
| 119. | జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

## రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్‌బైండ్) | 200-00 |



# వాస్తులు

| | | |
|---|---|---|
| 1. | 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకోనండి | 180-00 |
| 2. | వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. | వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. | మీరూ మీ వాస్తు | 63-00 |
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |



# మంత్రశాస్త్రాలు



| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |

| | | |
|---|---|---|
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీ తంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |



## గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |

| | | | |
|---|---|---|---|
| 54. | దేవుళ్ళు డాట్ కామ్ | | 99-00 |
| 55. | గణపతిభాష్యం | | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | | 99-00 |
| 57. | నవయోగులు | | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | | 99-00 |
| 67. | మార్షల్‌ఆర్ట్స్ (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | | 99-00 |
| 69. | చదరంగం | | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | | 63-00 |
| 71. | గరుడపురాణం | | 40-00 |
| 72. | మాఘపురాణం | | 36-00 |
| 73. | శివపురాణం | | 36-00 |
| 74. | వైశాఖపురాణం | | 36-00 |
| 75. | కార్తీక పురాణం | | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | | 36-00 |
| 80. | వృక్షదేవతలు | | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | | 150-00 |
| 83. | చతుర్వేదములు | | 120-00 |
| 84. | నవగ్రహారాధన | | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | | 250-00 |
| 87. | మానవధర్మములు | | 120-00 |
| 88. | వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. | సహస్రలింగార్చన | | 120-00 |
| 90. | శ్రీ శివగీత | | 120-00 |
| 91. | ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. | పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| | (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. | బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. | బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. | బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |

| | |
|---|---|
| 96. కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | 63-00 |
| 97. దక్షిణావృత శంఖములు | 63-00 |
| 98. 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | 36-00 |
| 99. ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | 270-00 |
| 100. భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | 99-00 |
| 101. చిలుకూరి బాలాజీచరిత్ర | 36-00 |
| 102. భగవత్‌స్తుతి | 63-00 |
| 103. సూర్యోపాసన | 36-00 |
| 104. కాశీఖండం | 250-00 |
| 105. దేవీభాగవతం | 360-00 |
| 106. శ్రీ ఆంజనేయం | 216-00 |
| 107. ధర్మసందేహాలు | 216-00 |
| 108. ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | 250-00 |
| 109. రామాయణం | 600-00 |
| 110. పోతన భాగవతం | 900-00 |
| 111. శివమంత్రములు | 63-00 |



## వైద్య గ్రంథాలు

| | |
|---|---|
| 1. ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. గృహవైద్యసారం | 36-00 |
| 6. హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. ప్రకృతివైద్యం | 36-00 |
| 8. ఆహారం-వైద్యం | 99-00 |
| 9. సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. ఒబెసిటీ | 99-00 |
| 18. హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. ఫుడ్‌థెరపి | 63-00 |

| | | |
|---|---|---|
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |



## అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |
| 9. | శ్రీ అయ్యప్ప నిత్యనియమావళి P | 10-00 |
| 10. | భవానీదీక్ష (శ్రీ భవానీ లీలామృతం) | 36-00 |
| 11. | దేవీలీలామృతం | 99-00 |
| 12. | శ్రీ దేవీ పూజాకల్పం | 20-00 |
| 13. | దేవీ భక్తిగీతాలు | 20-00 |
| 14. | భవానీదీక్ష P | 10-00 |
| 15. | దేవీ భక్తిమాల F | 10-00 |
| 16. | శ్రీ అయ్యప్ప భజనావళి | 120-00 |
| 17. | అయ్యప్పపూజావిధి (జేసుదాసుసాంగ్స్‌తో) | 24-00 |



# భజనలు - కీర్తనలు

| | | |
|---|---|---|
| 1. | అన్నమయ్య కీర్తనలు | 20-00 |
| 2. | శ్రీరామదాసు కీర్తనలు | 20-00 |
| 3. | సర్వదేవతా మంగళహారతులు | 20-00 |
| 4. | వసుంధర మంగళ హారతులు | 25-00 |
| 5. | సౌభాగ్య దేవతా మంగళహారతులు | 36-00 |
| 6. | సర్వదేవతా భజనలు | 36-00 |
| 7. | చిట్టి పొట్టి పాటలు | 10-00 |
| 8. | జాతీయ గీతాలు | 10-00 |
| 9. | దేశభక్తి గీతాలు | 36-00 |
| 10. | పండుగలు-పుణ్యక్షేత్రాలు భక్తిగీతాలు | 36-00 |
| 11. | గొబ్బిళ్ళపాటలు,లాలిపాటలు,కోలాటపాటలు | 36-00 |
| 12. | అన్నమయ్య సంకీర్తనలు | 99-00 |
| 13. | పెళ్ళిపాటలు-స్త్రీలపాటలు | 36-00 |
| 14. | భక్తానంద భజనకీర్తనలు(ఓల్డ్‌సినీస్టైల్) | 36-00 |
| 15. | సర్వదేవతాభక్తిమణిమాల | 36-00 |
| 16. | బతుకమ్మ ఉయ్యాల పాటలు | 36-00 |
| 17. | అన్నమయ్య సంకీర్తనానిధి(1000కీర్తనలు) | 270-00 |



# హిట్ సాంగ్స్



| | | |
|---|---|---|
| 1. | ఘంటసాల భక్తిగీతాలు-భగవద్గీత | 36-00 |
| 2. | ఎస్.పి.బాలు భక్తిగీతాలు | 36-00 |
| 3. | ఘంటసాల సుమధురగీతాలు | 99-00 |
| 4. | పి. సుశీల సుమధురగీతాలు | 99-00 |
| 5. | ఎస్.పి. బాలు సుమధురగీతాలు | 99-00 |
| 6. | ఎస్.జానకి సుమధురగీతాలు | 99-00 |
| 7. | వేటూరి సుందరరామమూర్తిహిట్స్ | 99-00 |
| 8. | సర్వదేవతా సినీభక్తిగీతాలు | 99-00 |



# స్త్రీలకు ఉపయుక్త పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీకాంతామణి వంటలు (వెజ్) | 63-00 |
| 2. | శ్రీకాంతామణి వంటలు (నాన్‌వెజ్) | 63-00 |
| 3. | శాకాహార వంటలు | 30-00 |
| 4. | మాంసాహారవంటలు | 30-00 |
| 5. | చిట్టిచిట్కాలు | 30-00 |
| 6. | అందానికి చిట్కాలు | 30-00 |
| 7. | పిల్లల పేర్లు (పెద్దది) | 30-00 |
| 8. | పిల్లల పేర్లు (చిన్నది) | 10-00 |
| 9. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ శారీబోర్డర్స్ | 36-00 |
| 10. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ డిజైన్స్ | 36-00 |
| 11. | చిన్నారులకు చిరుతిళ్ళు | 30-00 |
| 12. | పసందైన ఫాస్ట్‌ఫుడ్ వంటలు | 30-00 |
| 13. | పలావ్‌లు, ఫ్రైడ్ రైస్‌లు, వెరైటీరైస్‌లు | 30-00 |
| 14. | వేపుళ్ళు-ఇగుర్లు | 30-00 |
| 15. | బ్రేక్‌ఫాస్ట్ వంటలు | 30-00 |
| 16. | పండుగలలో చేసుకొనే పిండివంటలు | 30-00 |
| 17. | మైక్రోవోవెన్ వంటలు | 99-00 |
| 18. | సర్వదేవతాభక్తిమాల | 36-00 |
| 19. | పిల్లలపేర్లు (బాబు) | 36-00 |
| 20. | పిల్లలపేర్లు (పాప) | 36-00 |
| 21. | మోడ్రన్ మెహంది (గోరింటాకు డిజైన్స్) | 36-00 |
| 22. | మోడ్రన్ పిల్లలపేర్లు | 99-00 |
| 23. | నోరూరించే నాన్‌వెజ్‌వంటలు | 99-00 |
| 24. | మోడ్రన్ టైలరింగ్ (లేడీస్ & జంట్స్) | 99-00 |

# వివిధ రకములు

| | |
|---|---|
| ఎందరోమహానుభావులు | 270-00 |
| యోగాసనాలు | 36-00 |
| సూర్యనమస్కారములు | 36-00 |
| పొడుపు కథలు (చిన్నవి) | 10-00 |

మావద్ద లభించు గ్రంథములు...మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమహేంద్రవరం.

| | |
|---|---|
| హిందీ-తెలుగు-స్వబోధిని | 20-00 |
| ఇంగ్లీషు-తెలుగు-స్వబోధిని | 20-00 |
| జనరల్ నాలెడ్జ్ | 20-00 |
| నూరు ఎక్కాలు | 10-00 |
| 1-100 టేబుల్ బుక్ | 10-00 |
| 1-100 టేబుల్‌బుక్ (క్రౌన్‌సైజు) | 4-50 |
| శ్రీరామకోటి | 27-00 |
| శ్రీశివకోటి | 27-00 |
| మేజిక్ | 30-00 |
| అంకెలతో గారడీ | 30-00 |
| హృదయస్పందన (కవితలు) | 30-00 |
| వాత్స్యయన కామసూత్రాలు | 36-00 |
| ఎ.పి.టూరిస్ట్ గైడు | 36-00 |
| ఇంద్రజాల రహస్యాలు | 30-00 |
| మహేంద్రజాల రహస్యాలు | 30-00 |
| శరీరభాష (బాడీ లాంగ్వేజ్) | 99-00 |
| క్రియాయోగం | 36-00 |
| ఆనందంగా జీవిద్దాం | 99-00 |
| హరిశ్చంద్ర నాటకం | 50-00 |
| వాత్సాయనకామసూత్రాలు | 99-00 |
| పంచసాయకం | 99-00 |
| రతిరహస్యాలు | 99-00 |
| అనంగరంగం (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| శృంగారకేళి (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| గాయత్రీవిజ్ఞాన్ | 99-00 |
| చింతామణి (నాటకం) | 50-00 |
| బాలనాగమ్మ | 50-00 |
| కాళహస్తి స్త్రీల వ్రతకథలు | 36-00 |
| కాళహస్తి రామాంజనేయ యుద్ధం(బదిరెడ్డి) | 50-00 |
| కాళహస్తి గోవింద నామాల భగవద్గీత | 36-00 |
| కాళహస్తి గృహవాస్తు చింతామణి | 99-00 |
| కాళహస్తి గృహవాస్తు మర్మాలు (బైండు) | 63-00 |
| రామరాయవాస్తుశాస్త్రం(ముద్రగడరామారావు) | 90-00 |
| ఎం.ఎస్.ఆర్.హనుమాన్‌చాలీసా | 10-00 |
| ఎం.ఎస్.ఆర్.సుందరకాండ | 80-00 |
| బ్రహ్మంగారిజీవితచరిత్ర (జవంగుల) | 125-00 |
| శ్రీ ఆదిశంకరాచార్య దివ్యచరితామృతం | 40-00 |
| కాశీరామేశ్వర మజిలీ కథలు | 63-00 |
| శ్రీలలితాసహస్రనామము(భాస్కరభాష్యం) | 600-00 |

